

అందమైన కళ్లే కాదు
వారసత్వంగా వచ్చేది.....
అపాయకరమైన వ్యాధులు కూడా...
హెపటైటిస్-బి వ్యాధి సోకిన తల్లి తనకు
తెలియకుండానే గర్భస్థ శిశువుకు కూడా
సంక్రమింపచేస్తుంది - ఆ కాలేయపు వ్యాధిని.
మీ డాక్టర్‌ను సంప్రదించండి.
సకాలంలో టీకా వేయించుకోండి. ధర
అందుబాటులో ఉండే అంతర్జాతీయ శ్రేణి
వ్యాక్సిన్ గురించి తెలుసుకోండి.
ప్రజాహితం కోరి విడుదల చేసినది
ప్రాణాంతక హెపటైటిస్-బి వ్యాధి నిరోధక టీకా
శాన్‌వాక్-బి తయారీదారులు:
శాంతా
బయోటెక్నిక్స్ (ప్రై) లి.
3వ ఫ్లోరు, శిరీన్ ఛాంబర్స్, బంజారాహిల్స్, హైదరాబాద్
ఫోన్స్ : 040-23548507, 23608843, ఫ్యాక్స్: 040-23548476
హెపటైటిస్-బి
పసుపు వలయం
ప్రమాద సూచకం
Help. Stop HBV
Shanvac™ - B
r-DNA Hepatitis-B vaccine

# ఎందరో మహానుభావులు - అందరూ 'హాసం' అభిమానులే !

హాసం' వచ్చిందంటే చివరిపేజీ
చూసేదాకా కింద పెట్టను - బాపు

మాస పత్రికలకు బందీలై మూలుగుతున్న వారంతా హాయిగా
నవ్వి, నవ్విస్తున్నారు. సంగీతపరంగా కూడా ఇంతవరకూ
ఇంత చక్కగా కొత్తగా-అలాగా! అనిపించేలా ఎక్కడా రాలేదు -
- ముళ్లపూడి వెంకటరమణ

ఈనాటి పాఠకుల నాడి తెలిసిన పత్రిక
- కాళీపట్నం రామారావు

సంస్కారులైన పాఠకులకు ఓ అపురూప వరం 'హాసం.
చేతిలో ఉంటే గర్వకారణంగా ఉంటోంది.
- ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం

ఈ 'హాసం' - ఆహ్వానించదగ్గ మధుమాసం!
- సిరివెన్నెల సీతారామశాస్త్రి

ఒక సమగ్ర రసాత్మక కావ్యం చదువుతున్నామని
అనిపించే తీరున, తీరుగా రూపుదిద్దుకుంటోంది
- పి.బి.శ్రీనివాస్

కేవలం 'అట్ట'హాసం మాత్రమే కాకుండా
ఆపాదమస్తకం 'ఆహా'సం!!!
- బ్రహ్మానందం

'హాసం' హాస్య సంగీత ప్రియులందరినీ
అందమైన లోకాలలో
విహరింపచేస్తోంది. - యస్వీ కృష్ణారెడ్డి

శ్రమపడి, ప్రత్యేక లక్ష్యంతో నడుపుతున్న పత్రిక
- చలసాని ప్రసాదరావు

'హాసం— is the first magazine which I want to be in my house - తేజ

'హాసం'ను అందరూ మెచ్చుకుంటున్నారు. ఆనందంగా ఉంది - రావి కొండలరావు

టెన్షన్స్‌లోంచి కొంతసేపైనా బయటపడి హాయిగా రిలాక్సయ్యేందుకు
మనసుకు ఒక మంచి టానిక్ 'హాసం' - డా॥ ఇండ్ల రామసుబ్బారెడ్డి

ప్రతి శీర్షిక, ప్రతిపేజీ లక్షల విలువ
- పూరీ జగన్నాథ్

కాపీ దొరక్కపోతే దొంగిలించాలనేంత
కోరిక పుట్టించిన పత్రిక 'హాసం'
- త్రివిక్రమ్ శ్రీనివాస్

యువర్ 'హాసం' ఈజ్ రియల్లీ,
ట్రూత్‌ఫుల్లీ గుడ్ - సత్యానంద్

మీ హాస సముద్రంలో నేనూ
ఓ చిరుబిందువు నవ్వాలనే ఆకాంక్ష
- భువనచంద్ర

## కొనడం మీ వంతు!

## ఆకట్టుకొనడం మా వంతు!

### SUBSCRIPTION/RENEWAL COUPON

Name :.......................................................... Age: ......................Profession.......................

Address:.......................................................................................................

............................Ph. No. ................ (O) ....................... (R) email:.............................................

I am enclosing DD/Cheque/M.O. Receipt No.......................... Dated .......................... for Rs. 200/- (225/- in case of outstation cheques)favouring HUMMUS INFOWAY (P) Ltd., **payable at HYDERABAD** for Subscription/Renewal (incl. Postal Charges) of 24 issues of 'HAASAM HAASYA SANGEETHA PATHRIKA' starting from Issue No......(................ month, 2003)

Date: Signature

Mail to: HUMMUS INFOWAY (P) LTD., 502, SRI BALAJI NILAYAM, 13-1-212, BSP COLONY, MOTINAGAR, HYDERABAD - 500 018. Ph: 2383 1388 / 5557 0215, email: haasammag@hotmail.com

Note: If chq/DD is not drawn on Hyderabad Add Rs. 25/- towards collection charges

'హాసం'
హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# హాస్యం - సంగీతం

## ఇవీ సంగతులు

38



**ముఖచిత్రం**

**విడుదలకానున్న 'సీతయ్య' చిత్రంలో సిమ్రాన్**

'సెంటర్ స్ప్రెడ్'లో
'ఒట్టేసి చెప్పుతున్నా', 'తారక్'
సినిమా పాటల పుస్తకాలు
కలర్‌లో

సంపుటి : 2 సంచిక:14

16-30 ఏప్రిల్ 2003

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200



మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ



HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
email: haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82


The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

38

'హాసం'లో హిందీపాటల ప్రస్తావన తరచుగా రావడం, హిందీ, ఇంగ్లీషు పాటలకు ప్రత్యేకంగా శీర్షికలుండడం కొంతమందికి ఆశ్చర్యం కలిగిస్తూ ఉంటుంది. 'తక్కిన ఏ పత్రికలూ స్పృశించని సబ్జక్టులు మీరు బాగా డీల్ చేస్తున్నారే' అని కొందరు మెచ్చుకుంటే, 'మీరిలా హిందీ భాషా ప్రచారానికి పూనుకోవడం ఏమీ బాగా లేదు. పొరుగు రాష్ట్రాల పాటల గురించి పట్టించుకోరు గానీ, ఎక్కడో హిందీ పాటల గురించి మనకెందుకండీ' అని చికాకు పడేవాళ్లు కొందరు!

ఈ విషయంలో మా దృక్పథం మొదటినుండీ స్పష్టంగానే ఉంది. ఈ పత్రిక తెలుగువాళ్లకోసం పెట్టినది. తెలుగునాట ఏది బాగా ప్రచలితంగా ఉంటుందో వాటన్నిటి గురించీ ప్రస్తావించాలి అని మా ఉద్దేశ్యం. హిందీ సినిమాలు ఊరూరా ఆడతాయి. హైదరాబాదులో మాత్రమే కాదు, చిన్న , చిన్న పట్టణాలలో కూడా అవి ప్రజాదరణకు నోచుకుంటాయి. హిందీ సినిమాల విజయానికి కారణం వాటి ద్వారా మనకందే సంగీతమేనని అందరికీ తెలుసు. ఆ పాటల్లో హిందీ పాలెంతో, ఉర్దూ పాలెంతో, భోజ్‌పురి పాలెంతో మనకు తెలియదు. ఏదో ప్రేమగీతమనో, విషాదగీతమనో, టీజింగ్ సాంగనో మాత్రం గుర్తుపట్టగలం. ఆ మాటకొస్తేహిందీ సినిమాలు పూర్తిగా అర్థమయ్యే ప్రాంతాలు దేశంలో 25 శాతం కంటె ఎక్కువ ఉండకపోవచ్చు. అయినా దేశంలోని అన్ని ప్రాంతాలవాళ్లూ ఎంతో కొంత మేరకు తమ పాటలు ఆస్వాదించేట్లా హిందీ సినిమాలకు సంగీతం అందించిన సంగీతకారులు జాగ్రత్త పడ్డారు . వివిధప్రాంతాల సంగీతాలను మేళవించి, అందరికీ ఒప్పే బాణీలను తయారుచేసి, వాయిద్యాల విషయంలో రాజీపడకుండా హిందీ సినిమాసంగీతాన్ని సమకూర్చారు వారు. హిందీ సినిమాల మ్యూజిక్ బడ్జెట్,ప్రాంతీయ సినిమాల బడ్జెట్ కంటె ఎక్కువ ఉండేదంటే ఆశ్చర్యం కలగకపోవచ్చు. అందుకే భారతదేశ సమైక్యతకు దోహదం చేసిన రెండింటిలో ఒకటి మసాలాదోసె అయితే మరొకటి హిందీపాట అనే వాస్తవం లాటి జోకు పుట్టింది.

అయితే ఈ సంగీతం ఒట్టి వాద్యసంగీతం మాత్రమే కాదు, సన్నివేశాన్ని దృష్టిలో పెట్టుకుని గీతరచయితలు రాసిన కవిత్వాన్ని రాగాలలో పొదిగిన కళాసృష్టి. ఆ పాటల అందాలను ఆస్వాదించాలంటే ఆ మాటల సొంపు, ఆ సన్నివేశ ప్రాధాన్యత తెలియాలి. హిందీకాసెట్లు విరగబడి కొనే తెలుగువారిలో ఎందరికి ఇవి తెలుసు? తెలియవు కాబట్టే తెలియజెప్పే ప్రయత్నం జరుగుతోంది -" అర్థం చేసుకుందాం, ఆస్వాదిద్దాం "శీర్షికన. అంతేగానీ గ్రామరుతో సహా హిందీని పాఠకుల నెత్తిన రుద్దే ప్రయత్నమేమీ లేదు దానిలో. 'పాప్ కార్నర్' శీర్షికకూ అదే కారణం- మన రాష్ట్రంలో పాప్ సంగీతం అమ్ముడుపోతోంది; ఆ గాయకుల గురించి మన టీవీ ఛానెల్స్‌లో వస్తోంది.

పొరుగురాష్ట్రాలలోని సినిమాలలో ఎన్నో ఉత్తమగీతాలుండవచ్చు. అవి మనకు అందుబాటులో ఉండాలి , మన రాష్ట్రంలో కనీసం పట్టణాలలోనైనా ఆ పాటలు, సినిమాలు దొరకాలి, అప్పుడు వాటి గురించి కొంతయినా పాఠకులకు తెలిస్తే, మరింత ఆసక్తిని రేకెత్తించేట్లు మనం సమాచారం ఇవ్వవచ్చు. అటువంటి అవకాశం వచ్చినప్పుడు 'హాసం' వదులుకోదని గత రెండు, మూడు సంచికలుగా 'ఆపాతమధురం' శీర్షిక గమనిస్తున్నవారికి తెలుస్తుంది. 'ప్రేమలేఖలు', 'ఆలీబాబా 40 దొంగలు', 'వీరకంకణం', ఈ సారి వస్తున్న 'భూకైలాస్' -ఇవన్నీ తమిళచిత్రసీమతో మనకున్న సంబంధబాంధవ్యాలను ముచ్చటించేవే! సందర్భానుసారంగా తమిళసీమలోని ప్రముఖులను పేర్కొనడం, తమిళపదాలను ఉదహరించడం జరుగుతోంది. ఇలా ఇచ్చిపుచ్చుకున్న ఘట్టాలు ఎదురైనప్పుడు ఏపాటి వివక్షత లేకుండా ఏ ప్రాంతం వారినైనా ప్రస్తావించడం, అవసరమయితే ప్రశంసించడం జరుగుతుంది. అతి త్వరలో మా కృషిని తమిళరంగం వైపు కూడా విస్తరించే ప్రయత్నాలు చేస్తున్నాం.

సంగీతానికి ఎల్లలు లేవని, దానిని ఆస్వాదించడానికి ప్రాంతీయభేదాలు అడ్డురావని మా నమ్మకం. మా ఈ ప్రయత్నాన్ని మీరు అర్థం చేసుకుంటారని, ఆస్వాదిస్తారని మరి మా విశ్వాసం.

**అలనాటి ఆణిముత్యాల గురించి**
**నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే**

క్లాసిక్స్ రీటోల్డ్

# నవ్వుటద్దాలు

- ఆచార్య తిరుమల

## పద్యాల్లో పల్లెదనం




ప్రతిది సులభమ్ముగా
సాధ్యపడదు లెమ్ము
నరుడు నరుడౌట
యెంతొ దుష్కరము సుమ్ము!

అన్నారు గాలిబ్ గీతానువాదంగా డా.దాశరథిగారు. కష్టపడితే గానీ మంచి ఫలితాలు రావు, మంచి ఫలితాలు లేకపోతే మనిషి మనిషిగా బతకలేడు. చదువుకోటం, నేర్చుకోవటం కష్టమనుకుంటే మనిషి క్రూర మృగమై పోతాడు. మనలో చాలామందికి పద్యాలన్నా, సంస్కృత శ్లోకాలన్నా భయం. 'బాబోయ్, వద్దం'టూ దూరంగా పారిపోతారు. తమకు వచ్చిన భాషలోనే చెప్పాలనుకుంటారు గానీ అర్థం చేసుకోటానికి ప్రయత్నం చెయ్యరు. డబ్బులు ఖర్చుపెట్టి ఇంగ్లీషు, ఫ్రెంచ్, ఉర్దూ వంటి విదేశీ భాషలైనా నేర్చుకుంటారు గానీ సంస్కృతాంధ్రాల జోలికిపోరు. కాస్తంత ప్రయత్నిస్తే, శ్రమిస్తే అర్థం కానిదంటూ ఏమీ వుండదు. సరే! అవసరాన్ని బట్టి అర్థాలు, పరమార్థాలు మారిపోతున్నా, మాతృభాషలో తల్లివొడిలో, పల్లెవొడిలో దొరికే ఆనందాన్ని మించిన ఆనందం, సుఖాన్ని మించిన సుఖం మరెక్కడా దొరకవని నిక్కచ్చిగా చెప్పగలం.

భాష రెండు విధాలు. గ్రంథాల్లో భాషని గ్రాంధికభాష అని, గ్రామాల్లోని ప్రజల వాడుక భాషని- గ్రామ్యభాషని అంటారు- ఏ ప్రాంత ప్రజల భాషైనా సహజం గాను, ప్రకృతి సిద్ధంగాను వుంటుంది. గ్రాంధిక భాష, గ్రంథాలు, కావ్యాలు రాసే కవిపండితుల పాండిత్య ప్రదర్శనల వల్ల కొంత అసహజం గాను, కృత్రిమం గానూ వుంటుంది. కానీ, గ్రంథాలు, కావ్యాలు, శాస్త్రాలు వంటివి లేకపోతే ఏ జాతికైనా నాగరికతగానీ, చరిత్రగానీ, పురోభివృద్ధిగానీ వుండవు. మానవ సంస్కృతి మహోన్నత దశకు చేరుకున్నప్పుడే కావ్యశాస్త్రాలు ఆవిర్భవిస్తాయి. కాబట్టి, వాటిని కష్టపడైనా అర్థం చేసుకోవలసిన అవసరం ఉంది. మరో విధంగా చెప్పాలంటే- గ్రామ్యభాష సాగిపోయే ఉత్సవ విగ్రహమైతే, గ్రాంధిక భాష ప్రతిష్ఠితమైన ఆలయ మూల విరాట్టు! ఆ దర్శనం వేరు, ఆ ఆనందం వేరు. ఇంతకీ- శ్రోత స్థాయి గాని, పఠిత స్థాయిగానీ ఎలావున్నా, ఎవరెక్కడ ఎలా ఏం చెప్పినా మనిషికే చెప్పారనీ, మనిషిని, మానవ సమాజాన్ని ఉద్ధరించటానికే చెప్పారని మర్చిపోకూడదు.

పల్లె ప్రజల భాషలో ఒక విధమైన అందం వుంది. ఆ యాసలో ఒక విధమైన సొగసు వుంది. ఆ ఉచ్చారణలో అచ్చమైన జీవిత విధానం వుంది. ఆ భాషా ప్రకటనలో స్వచ్ఛమైన హృదయం ఉంది. మన కవి పండితుల్లో చాలామందికి పల్లెలే

పట్టుకొమ్మలు. ఇంచుమించు వాళ్లంతా పల్లెలనుంచి వచ్చిన వాళ్లే. పాండురంగ మహాత్మ్యం మనే ప్రౌఢ ప్రబంధం రాసిన తెనాలి రామకృష్ణకవి-

"మా కొలఁది జాన పదులకె
నీ కవితాఠీవి యబ్బునే!"

అని అన్నాడంటే ఆ కావ్యాలకి జానపదాలెంతటి పునాదులుగా వుండేవో ఊహించుకోవచ్చు. జనపదాలంటే పల్లెలు. పల్లె ప్రజల భాష జానపదం. అన్నమాచార్య కీర్తనల్లో కావల్సినంత పల్లె పలుకుబడి, తెలుగు నుడికారం వుంది. తిక్కన భారతంలో తెలుగు పలుకుబడి, తెలుగు వారి జీవిత విధానం పుష్కలంగా కనిపిస్తాయి. ఇలాగే కవులు, మహాకవులు, వాగ్గేయకారులూ కనిపిస్తారు. వాళ్లెవరికీ, ఎవ్వరికీ అర్థం కాని రచనలు చేయాలనే మూర్ఖపు పట్టుదల వున్నట్టు తోచదు. ఈ అర్థం కాకపోవటమనేది పూర్వమైతే పాఠకుడిది, యిప్పుడైతే కవి ది తప్పని విశ్వనాథ సత్యనారాయణ గారు-

తొలినాళులు పద్యార్థము
తెలియనిచో పాఠకునిది తెలియమి, ఈనా
ళుల వ్రాసిన కవి దోషము
కవి ముదిరిన కొలది వింత గతులం జెలగున్!!

అనే పద్యంలో వ్యంగ్యంగా చెప్పారు. ఏది ఏమైనా కవిని పాఠకుడు, పాఠకుణ్ని కవి దృష్టిలో పెట్టుకుని అర్థం చేసుకోకపోతే మంచిరచనలు రావని, వచ్చినా పది కాలాల పాటు నిలవ్వని గుర్తించటం మంచిది.

అచ్చ తెలుగు కావ్యాలు వచ్చాయి గానీ, సంపూర్ణంగా గ్రామ్యభాషలో వచ్చిన పద్య కావ్యాలు నేను చూడలేదు. కానీ అక్కడక్కడ పద్యాలు కనిపిస్తున్నాయి. అటువంటి పద్యాలు కొన్ని మీకు పరిచయం చేస్తాను. ఆ అందాలు చూడండి:-

మహాకవి శ్రీనాథుడు పడమటి వ్యాపారుల్ని దుయ్యబడుతూ-

దస్త్రాలున్ మసి బుర్రలుం గలములుం దార్కొన్న చింతంబళుల్
పుస్తుల్ గారెడు దుస్తులుం జెమట కంపుం గొట్టు నీర్కావులుం
అస్తవ్యస్తపు గన్నడంబును భయంబైదోచు గడ్డంబులున్
వస్తూ చూస్తిమి రోస్తిమిన్ బడమటన్ వ్యాపారులం గ్రూరులన్!!

అని చెప్పిన పద్యంలో వస్తూ చూస్తిమి, రోస్తిమి వంటి గ్రామ్య పదాలుండి ఆ వ్యాపారుల వేషభాషలు కళ్లకు కట్టినట్టుగా అవుతుంది.

కూచిమంచి తిమ్మకవి, తన పార్వతీవల్లభా శతకంలోను, కుక్కుటేశ శతకం లోను ఆనాటి సాంఘిక దురాచారాల్ని, లోపాల్ని- నిశితంగా గ్రామ్యభాషలో కూడా ఖండించాడు. చూడండి:-

పో! పో! బాపడ! దోసడూదలిడినన్ పోలేక పేరాసలన్
మీ పోజాగితివేమి? నీ సదువు తిర్నామంబులో సుద్దులో
బూపాలంబులో లంక సత్రెలో బలా! బొల్ల్యావు పోట్లాటలో
కా! పాటింప నటంచ్రు బాలిశులు, భర్గా! పార్వతీ
వల్లభా!!

ఈ పద్యంలో విద్వాంసుల్ని అల్పులు ఏ విధంగా చుల్కనగా చూస్తారో చెప్పాడు. ఇలాగే, కుక్కుటేశ శతకంలో మూర్ఖుడి అల్పత్వాన్ని, బండారాన్నిలా బయటపెట్టాడు:-

అబ్బబ్బ కిందటేఁడప్పయ్య తీర్తాన
జోలె జంగమ కిస్తి సోలెడుప్పు
సాతాని జియ్యరు సతికితే పోయిస్తి
కొల్లగా గుల్లెడు సల్లబొట్టు
లంక సత్తెల వాడు పొంకాన పొగిడితే
మాలదాసరి కిస్తి మానెడూద
లేదాలు వాగితే యెల్లుబొట్టయ్యకు
కొలకుండ దోసెడు కొర్ర లిస్తి

ఔర! తమకున్న కూసుగా డవలనింక
గలడెయను మూర్ఖుడిద్ధర, కామవైరి
భూనుత విలాస! పీఠికాపుర నివాస!
కుముద హిత కోటి సంకాశ! కుక్కుటేశ!!

కూచిమంచి జగ్గకవి తన చంద్రరేఖా విలాప మనే పరమ బూతు కావ్యంలో-

"వస్తాడు నీల భూపతి -
తెస్తాడు ధనంబు నీ కతిప్రమదముగా
నిస్తాడు విరహవేదన -
చస్తాడా? నమ్ము మదిని సందియమేలా?"

అనే పద్యంలో ప్రయోగించిన వస్తాడు, తెస్తాడు, ఇస్తాడు,చస్తాడు- అనే మాటలు గ్రామ్యభాషకు సంబంధించినవే. వాటినలా గ్రాంధిక భాషా కావ్య పద్యాల్లో వాడకూడదు. అది లక్షణం కాదని వ్యాకరణం అంటుంది.

చంద్రశేఖర శతకమని గ్రామ్యభాషా పద్యాలతో గిలిగింతలు పెట్టే ఒక శతకముంది. దాన్నెవరు రాశారో తెలియదు. అందులో ఆ అజ్ఞాత కవి మూర్ఖుని మూర్ఖత్వాన్ని, అతి తెలివిని చాలా బైటపెట్టాడు. చూడండి:-

గంటము పేర యింటను భగాతము సెప్పితె యీది లోన వో
రెంటెలి సూత్తి నేను యిను రేత్రి రమాండెము బాగ సెప్పె మా
యింటి దురోదనుండు బవుయిద్ధ మిబీసను సించి లంకలో
మంటె గలించి వొచ్చెనను మాంద్యుడు మూర్ఖుడు చంద్రశేఖరా!!

తేలికైన మాటలతో రాసిన యిలాంటి పద్యాలు కూడా అంత తేలిగ్గా చదవగానే అర్థంకావు. కాస్త జాగ్రత్తగా చదివి, అర్థం చేసుకోవాలి. గంటం పేరయ్య ఇంట్లో భాగవతం చెపితే వీధిలో ఎవరివెంటోవెళ్లి చూశాడట. రాత్రి రామాయణం బాగా చెప్పాట్ట. దుర్యోధనుడు యుద్ధంలో విభీషణుణ్ని చంపి లంక కాల్చి వచ్చాడని అంటాట్ట మూర్ఖుడు. ఇలాంటిదే మరో పద్యం చూడండి:-

సంగితకాడ పాడకిక సాలును, నీవది పాడినందుకున్
యింగిత మెంచి నేను మరి యిన్నదుకున్ సరిపాయె, నింకపై
గంగుగ నే తలూపినటి యప్పుకు తంబుర నీడబెట్టి పో!
బంగుడ బాపనోడయని పల్కును మూర్ఖుడు చంద్రశేఖరా!!

సంగీతకాడా! నువ్వు పాడినందుకు నేను విన్నందుకు సరిపోయింది. పైగా, నీ పాటకి హంగుగా నేను తలూపినందుకు నీ తంబురా యిక్కడపెట్టి పొమ్మంటాడట మూర్ఖుడు. మూర్ఖపద్ధతిని గూర్చి భర్తృహరి కూడా చాలా విషయాలు వెల్లడించాడు. కానీ ఆ పద్యాలు గ్రాంధిక భాషలో వుంటాయి. వాటి విలువలు వేరు. సరే-

తరిగొండ వెంగమాంబ తన వేంకటాచలమహాత్మ్యం కావ్యంలో



ఎఱుకసాని నోట సోది చెప్పింది - చూడండి:-

"అవ్వోయవ్వ! దేవుళ్లు పలుకుసుండారు. నిన్ను నీ బిడ్డ వనాని
కేగినాది. ఆడ తేజి నెక్కిన నల్లనయ్యను సూసి వలపు గొన్నాది.
ఆ నల్లనయ్య యే దిక్కునుండి వచ్చినాడంటావా? తల్లి!
యిదిగో! యీ మూల నుండి-' ఇలా సాగే ఆ సోదిలో గ్రామ్యభాషలోని సొగసు పసిగట్టండి.

సిద్ధయ్య, బ్రహ్మం గార్ల పొడుపు కథల రూపంలోని ఆ భాషా చమత్కారం ఎంతుందో మచ్చుకి చూడండి:-

సిద్ధ:- బోడివాడెవడయ్యా? బొచ్చువాడెవరయ్యా?
మొలచుట్టు కత్తులున్న వానిపేరెవరయ్యా?
బ్రహ్మం:- బోడివాడు వెలక్కాయ- బొచ్చువాడు కొబ్బరికాయ
మొలచుట్టు కత్తులున్న వాని పేరు వంకాయ-
సిద్ధ:- ఊరుకున్న దేదయ్యా? ఊగులాడే దేదయ్యా?
కాళ్లసందు దేదయ్యా? కమ్ముకొచ్చే దేదయ్యా?
బ్రహ్మం:- ఊరుకున్నది ఆవయ్యా-ఊగులాడేది దూడయా
కాళ్లసందుది ముంతయా - కమ్ముకొచ్చేవి పాలయా!-!!

జానపద సాహిత్యానికి పాట ఆయువు పట్టు కదా!

దాసు శ్రీరాములు గారు తమ 'తెలుగునాడు' అనే చిన్న కావ్యంలో గ్రామ్యభాషా పద్యాలు రాశారు. మచ్చుకీ పద్యం చూడండి:-

అస్సే చూస్సివషే, వొషే! చెవుడషే అష్లాగషే, యేమిషే
విస్సావఝ్ఝుల వారి బుర్రినష యా విస్సాయ కిస్సారుషే
విస్సండెంతటి వాడె, యేళ్లు పదిషే వెయ్యేళ్ల కీడే షుమా
ఒస్సే బుర్రికి యీడషే? వొయిషుకే ముంచుందిలే మంచివొ
ర్చెస్సే, యందురు శ్రోత్రియోత్తమ పద స్త్రీలాంధ్ర దేశంబునన్!!

ఈ పద్యంలో వైదికులైన ఆంధ్ర స్త్రీల భాష, పలుకుబడి ఎలా వుంటుందో వర్ణించారు. ఈ పద్యాన్ని 'స్సి' బదులు 'స్తి' అని, 'షే' బదులు 'టే' అని, 'షు' ని 'సు' అని దిద్దుకుని చదువుకుంటే సులభంగా ఆ వైదికాచార స్త్రీల ముచ్చట్లేమిటో అర్థమవుతాయి.

కాళ్లకూరి నారాయణరావుగారు 'చింతామణి' నాటకం లో సుబ్బిసెట్టి పాత్ర ద్వారా యాస భాషని గుప్పించి, ఎంత సహజత్వాన్ని సాధించారో చూడండి:-

ఇంటిలో కాలెట్ట నిచ్చెందె శానని
యేలుకు యేలు గుప్పేసినాను
పిల్ల సొత్తాడింది పెట్టాలి తిళ్లంటె
బళ్లతో సావాన్లు పంపినాను
యేపూట కాపూట యెచ్చని సిరుతిళ్లు
వట్టుకెళ్లి మొగాన గొట్టినాను
మేలాని కెల్లొచ్చి మెదలక తొంగుంటె
బిడియ విడిసి కాళ్లు పిసిగినాను
అరద రేతిరికాడ ఆరికీరికి సీట్లు
మొయ్యమంటే కూడ మోసినాను
యిన్ని సేసినోణ్ని యీడ్సి పారేశారు
తక్కినోళ్ల మాట లెక్కయేంటి?
యేవి లాబ వట్టి యెదవల కొంపల
కెల్లకండి, యెల్లె తల్లి తోడు!!

బుక్కపట్టణం తిరుమల తాతాచార్యులని ఒక తిట్టుకవి ఉండేవారు. ముక్కుపొడుం (నస్యం) అడిగితే యివ్వలేదని ఓ శాస్త్రిగారిని-

శాస్తుర్లట యీ నీచుడు
పాస్త్రాత్తుల మగడు వీని పరువేమోకా!
కాస్తింత నస్య మడిగితె
నాస్తేయని పలికె వీని నాలుక పీకా!!

అని తిట్టారు. ఈ తిట్టులో, భాషలో గ్రామీణుల కోపమెలా వుంటుందో గమనించండి.

గద్వాల సంస్థాన ప్రోత్సాహంతో రామాయణం, త్రిపురాంతక స్థల మహత్మ్యం, ధ్రువచరిత్రలు రచించిన గొప్ప అవధాన ఆశు కవి గారైన గాడేపల్లి వీరరాఘవ శాస్త్రి గారిని గూర్చి మేడవరపు సుబ్బరాయ కవి గ్రామ్యభాషలో చేసిన ప్రసంగం చూడండి:-

రాగవశాస్తులో రడుగొరా! అదె సూడె పెబంతమాసి చే
లాగన మంట కైతలొ సెలాకు పరీచ్చట! బుద్ధి మేదయే
మో! గడె కొక్క పొత్తెకము వున్నటె వుండి రసిత్తడంట! అ
బ్బే! గదవాల కాడ పెద పెద్ద పెసంగము సేత్తడంటరా!!

ఒక పెద్దమనిషిని గూర్చి యిలా చెప్పవలసిన అవసరమేమిటో తెలియదు. మద్దులపల్లి సుబ్రహ్మణ్యశర్మ గారు గ్రామ్యభాషలో ఎన్నికల అభ్యర్థుల్ని గూర్చి చెప్పిన పద్యంతో యీ వ్యాసం ముగిస్తాను.

యిడవరు, యింటసుట్టు వలయేత్తరు, సూత్తరు, వంక దణ్ణముల్
పెడతరు, మేలు సేత్తమని పెగ్గెలు బల్కుత రాపనైన వెం
బడి తిరిగైన సూడ రిసువంటి పెబుద్దులు రాజ్జెమేలితే
కుడిసి కుకుండ నిస్తర? మొగుండ్లయి సూస్తనె గొంతుగోయరా?

గ్రామ్యభాషలో కూడా యింత రాజకీయ వాతావరణం ఉందని గ్రహించటం మంచిది.

గ్రామ్యభాషని గూర్చి అప్పకవి-

"గ్రామ్య మనగ నెవరు నొప్ప రొరుల దెగడు చోట నొప్పునదియు"

అని చెప్పాడు.

ఇందులో అతిశయోక్తి వున్నా కసిగా తిట్టటానికి గ్రామ్యభాష తప్ప గ్రాంధిక భాష పనికిరాదు. కోపావేశాల్లో అదొక ఆయుధమే అవుతుంది. ఇంతకీ గ్రామ్యభాషలో పద్యాలు రాసి అందమైన పల్లెదనాన్ని సాధించటానికి కవులకి ఆ భాషమీద కూడా చాలా పట్టు, అధికారం ఉండాలి. ఆ పని 'తేలిక తేలిక' అనుకున్నంత తేలికగా ఉండదు. ప్రతిది సులభమ్ముగా సాధ్యపడదు లెమ్ము!! ప్రయత్నించండి!!

ఉమ్మడం, తిట్టడం, తన్నడం, వంటి వెగటు చేష్టలతో జనాలను ఆకర్షించి 'మేజిక్'ను 'మహత్తు'గా ప్రచారం చేసుకుంటూ, ప్రజల బలహీనతలను, నిస్సహాయతను 'క్యాష్' చేసుకునే సీరియస్ 'ఇష్యూ'ని సీరియస్‌గా చర్చించకుండా, కామెడీగా సెటైరిగ్గా చెప్పాలన్న ప్రయత్నమే...




-విజయార్క

దీనంగా, హీనంగా, ముష్టిముదనష్టంగా, బావురుకప్పలా నోరు తెరిచి, కళ్లు మిటకరిస్తూ తన ముందువున్న చాంతాడంత 'క్యూ'ని చూస్తూ ఏడ్వలేక, నవ్వలేక, కక్కలేక, మింగలేక లిబర్టీ స్టాచ్యూ అయిపోయేడు గోపాలం.

"రండి బాబూ రండి, మోక్షసాధనకు, ఆరోగ్య రక్షణకూ నిమ్మకాయ తీర్థం పుచ్చుకొండి. మీకు తోచిన దక్షిణ సమర్పించుకొండి. ఇది నిమ్మకాయ బాబా మహత్యం..." అంటూ గులకరాళ్లు డబ్బాలో వేసి గులకరించే సౌండిస్తూ బావురుకప్ప కజిన్‌లా నోరు తెరిచి అరుస్తోంది లాజ్‌బంతి.

రోజూ ఉదయం పదినుంచి సాయంత్రం ఆరు వరకూ గోల్డెన్‌హిల్స్ సెంటర్‌లో ఈ ప్రోగ్రాం వుండాల్సిందే! రాత్రి ఎనిమిదినుంచి అర్ధరాత్రి పన్నెండు వరకూ టాంక్‌బండ్ దగ్గర ఈ స్పెషల్ షో ఉంటుంది.

బొట్టు బాబాని, తిట్టు బాబాని, కాళ్లతో తన్నే బాబాని, పిల్లల్ని పుట్టిస్తామని వళ్లంతా తడిమే బాబాలను నమ్మే జనాలంతా అక్కడ పోగయ్యేరు.

గోపాలం శిలువ వేసిన ఏసులా నిలబడి వున్నాడు. లాజ్‌బంతి చేతిలో ఓ వెండి గ్లాసు, మరో చేతిలో అప్పడాల కర్ర ఉన్నాయి. నోరు తెరిచేవున్న గోపాలం దీనంగా లాజ్‌బంతి వైపు, జాలిగా తన ముందు వున్న 'క్యూ' వైపు చూస్తూ తనని తానే 'ఛీ... నాయబ్బ జీవితం' అని తిట్టుకుంటున్నాడు.

'క్యూ'లో నిలబడ్డ ఓ శాల్తీ గోపాలం

ముందుకు వచ్చాడు. మిసెస్ గోపాలం అయిన లాజ్‌బంతి వెండి గ్లాసును ఆ శాల్తీకి ఇచ్చి, భక్తితో కళ్లు మూసుకుని 'జై నిమ్మకాయ బాబా' అనమంది.

ఆ శాల్తీ అలానే అన్నాడు. లాజ్‌బంతి, గోపాలం డిప్ప మీద ఒకటిచ్చింది తన చేతిలో వున్న అప్పడాల కర్రతో.

భళుక్కు మన్నాడు గోపాలం. అంతే...గొంతులో నుంచి బొటబొటా నిమ్మరసం వచ్చి వెండి గ్లాసులో పడింది.

ఆ శాల్తీ విస్మయంగా చూసి, చంకలు గుద్దుకుంటూ, 'జై నిమ్మకాయ బాబా' అంటూ ఆ వెండి గ్లాసులోని నిమ్మరసం, తన గొంతులోకి ఒంపుకున్నాడు.

"వెళ్లు పిచ్చి భక్తా" అంది లాజ్‌బంతి.

ఆ శాల్తీ లాజ్‌బంతి వైపుచూసి బుర్ర గోక్కుని, "పిచ్చి భక్తా ఏమిటి నీ పిండాకూడు" అన్నాడు కాసింత వళ్లుమండి.

"అది నా ఊతపదంలే...నిమ్మకాయ బాబా కరుణించి నిమ్మరసం ప్రసాదించాడు. వంద అక్కడ పెట్టు. వెండి గ్లాసు నీ పక్కవాడికి ఇచ్చి, ముందుకు కదులు. లేకపోతే, నీ గొంతులో పడ్డ నిమ్మరసం, విషమై, నీ పెళ్లానికి టికిలీ(బొట్టుబిళ్ల) లేకుండా పోతావ్" అంది సీరియస్ ఎక్స్‌ప్రెషనిస్తూ.

బిక్కచచ్చి, ఆ శాల్తీ వంద అక్కడ ప్లేటులో వేసి, తన చేతిలోని వెండి గ్లాసు పక్కవాడికి ఇచ్చి ముందుకు కదిలాడు.

అలా ఒక్కో భక్తశాల్తీ గోపాలం ముందు వెండి గ్లాసుతో నిలబడ్డం, లాజ్‌బంతి మొగుడి డిప్ప మీద కొట్టడం, గోపాలం భళ్లుభళ్లుమని నిమ్మరసం కక్కడం, భక్తశాల్తీ కళ్లకద్దుకుని అది తాగి, వంద పెట్టి ముందుక్కదలడం -షరా మామూలే.

* * *

సాయంత్రం ఆరు-

ఆవాళ్టికి దుకాణం కట్టేసింది మిసెస్ గోపాలం. గోపాలం వొగరుస్తూ కోపంగా, పెళ్లామ్ వంక చూసి, తన ఎదురుగా వున్న ప్యాడ్ అందుకుని, జేబులోనుంచి పెన్ను తీసి బరబరా గీకి పెళ్లాం ముందు పెట్టాడు.

అది చదివింది మిసెస్ గోపాలం.

"నన్నెందుకే...ఇలా మటన్ ఫ్రయ్ చేసుకుని తింటావ్. మాట్లాడలేను... అరవలేను... మింగలేను... కక్కలేను...చైనావాడి కప్పలు మింగి ఛస్తావే...ఇదే నా శాపం' అని రాసి అందులో.

మిసెస్ గోపాలం ఓ లాఫ్ లాఫి "అది కాదురా మొగుడు బావా..దీపం వున్నప్పుడే ఇల్లు చక్కబెట్టుకోవాలి. నీ గొంతులో నిమ్మకాయ వున్నప్పుడే బ్యాంక్ బ్యాలెన్స్ పెంచుకోవాలి. అర్థం చేసుకోవూ..." అంది మొగుడి చెంపలు పట్టి పిండుతూ.




గోపాలం మనసు బండ బూతులు తిడుతోంది.

"సర్లే మొగుడు బావా...కాసేపు రెస్ట్ తీసుకో. ఎనిమిది గంటలకు టాంక్‌బండ్ దగ్గర షో ఉంది కదా..." అంది.

గోపాలం టప టప టప టపా...పది, పదిహేను కన్నీటి బొట్లు రాల్చి, దీనికంతటికి కారణమైన నిమ్మకాయని గుర్తుచేసుకుని, ఫ్లాష్‌బ్యాక్‌కి వెళ్లాడు.

* * *

గోపాలం, లాజ్‌బంతి బావామరదళ్లు.

బొద్దుగా,గుండ్రంగా,తిప్పరాయిలా వుండే లాజ్‌బంతి అంటే గోపాలానికి తెగ ఇది.

లాజ్‌బంతికి గోపాలం అంటే ఇష్టమే కానీ, డబ్బు అంటే అంతకన్నా ఇష్టం. "ముందు నువ్వు ఏదైనా సంపాదించిపెట్టు. తర్వాత నేను తాళి కట్టించుకుపెడతా" అంది.

గోపాలానికి వెంటలెక్కింది. ఏం చేయాలి...ఎలా డబ్బు సంపాదించాలి? అప్పుడు గుర్తొచ్చాడు కపర్ది.

చిన్నపాటి మెజీషియన్ అతను....మేజిక్‌లు చేస్తూ, ప్రోగ్రామ్స్ ఇస్తూ ఉంటాడు. అతన్ని బ్రతిమిలాడి, బామాలి చిన్న చిన్న ట్రిక్స్ నేర్చుకున్నాడు. ఆ విధంగా తను పెద్ద మెజీషియన్ అవ్వాలని, పి.సి.సర్కార్ జూనియర్ తన దగ్గరకి వచ్చి, "మిస్టెర్ గోపాలం, యిండియాలో మీరూ,నేనూ తప్ప ఇంకెవరు వున్నారు చెప్పండి" అని తన భుజం తట్టాలని...ప్రోగ్రావ్స్ ఇచ్చి బోల్డు సంపాదించాలని 'డ్రీమ్స్' కనేవాడు.

ఓ రోజు, కపర్ది తో ప్రోగ్రామ్ ఇస్తూ, నిమ్మకాయని నోట్లో పెట్టుకుని, మాయం చేసి, మళ్లీ రప్పించే మేజిక్ చేస్తానని చెప్పి, నిమ్మకాయ నోట్లో పెట్టుకున్నాడు.

అతని అదృష్టం కచ్ భూకంపమైంది. బ్యాడ్‌లక్ ఫ్రంటయ్యి, గుడ్‌లక్ లెఫ్ట్‌కు వెళ్లిపోయింది. నోట్లోని నిమ్మకాయ గొంతులోకి వెళ్లి అడ్డం పడి, శివుడికి గళంలో గరళంలా వుండిపోయింది.

సరిగ్గా అప్పుడే అతని బ్రతుకు కృషి బ్యాంకైంది.

* * *

డాక్టర్ వేపకాయంత వెర్రి, గోపాలాన్ని క్షుణ్ణంగా పరీక్షించి...క్షించీ..సీరియస్‌గా మొహం



పెట్టి, సీలింగ్ ఫ్యాను వంక చూసి- "ప్చ్...ప్చ్...ప్చ్..." అన్నాడు. దాన్ని బ్యాడ్ మీనింగ్‌లో తీస్కొని 'ఏంటా సైగలు?' అని లాజ్‌బంతి నాలుగు పీకేక, డాక్టర్ వేపకాయంత వెర్రి లబోదిబోమని...

"పెళ్లికాక ముందు నేను మా ఆవిడకే సైగలు చెయ్యలేదు. నీకు సైగలు చేసేటంత ధైర్యం నాకెక్కడిది తల్లీ" అని లెంపలేస్కొని అసలు విషయం చెప్పాడు.

గోపాలం గొంతులోని నిమ్మకాయ బయటకు రావడం గానీ, లోపలకు వెళ్లడం గానీ కుదరని పని అని, దానంతట అదే కరిగిపోతుందనీ ధైర్యం చెప్పాడు.

సరిగ్గా అప్పుడే అతని ఫేస్ పెసరట్టు రోస్టయింది.

"ఇలాంటి పిచ్చి పిచ్చి ప్రోగ్రామ్స్ చేస్తావా?" అని లాజ్‌బంతి గోపాలం డిప్ప మీద ఒక్కటిచ్చింది. భళుక్కుమని గిద్దెడు నిమ్మరసం, నేలమీద పడింది. లాజ్‌బంతి ఫేసు ఫ్లాష్ లైటయింది. అంతే....'నిమ్మకాయ బాబా' పేరుతో, నకిలీ బాబాలను ఆదర్శంగా తీస్కొని-సీన్ క్రియేట్ చేసింది

దట్సాలంతే...జనం క్యూ కట్టారు....ఇన్‌కమ్ పెరిగింది. వెంఠనే గోపాలాన్ని పెళ్లి చేసుకుంది. కానీ బ్యాడ్‌లక్ ఏమిటంటే, వాళ్లకు ఫస్ట్‌నైట్‌కే టైమ్ కుదిరి చావడం లేదు.

అదీ గోపాలం నీచ, నికృష్టమైన ఫ్లాష్‌బ్యాక్.

* * *

నైట్ ఎయిటై చచ్చింది!

ట్యాంక్‌బండ్ దగ్గర 'నిమ్మకాయ బాబా' షో మొదలైంది. అప్పుడే గోపాలానికి ఖర్మ కాలే టైమ్ మొదలైంది.

అమాయక భక్తకోటి వందిచ్చి నిమ్మరసం చుక్కలు గొంతులో పోసుకునే టైంలోనే అటుగా




వచ్చాడు ఇన్‌స్పెక్టర్ అహోబిల్రావ్.

జీపాపి లాఠీని స్టయిల్‌గా వూపుకుంటూ, గాల్లోకి ఎగరేసాడు. అది నేలమీద పడి వూరుక్కుంది. చుట్టూ జనం ఎవరైనా చూసారేమోనని చూసి, 'హమ్మయ్య' అనుకుని స్టయిల్‌గా వంగినట్లు వంగి లాఠీ తీసుకున్నాడు.

నోరంతా ఎండి, చల్లటి జ్యూస్ తాగాలనే ఫీలింగ్ కలిగింది. అదీ తన స్టయిల్లో...

అహోబిల్రావ్ స్టయిలే సెపరేట్... కూరగాయల మార్కెట్‌కు వెళ్లి "నేను సిన్సియర్‌ని... లంచం అంటే లాకప్‌లో మక్కె లిరగదీస్తా..' అంటూ లెక్చరిచ్చి "మీరు నాకు రోజూ కూరగాయలు 'ఫ్రీ'గా ఇవ్వాలను కుంటు న్నారేమో... అలా అనుకుని , నాకు 'కూరగాయల లంచమిస్తే' డొక్క చీరేస్తా... అలాంటి వుద్దేశముంటే..." అని చుట్టూ చూసి, 'మా హెడ్'తో ఇంటికి పంపించండి" అని చెప్పెళ్లే టైప్.

* * *

ఎదురుగా గోపాలం షో చూసేడు. విషయం విథిన్ సెకన్స్‌లో అర్థమైంది. వెంటనే జనాల్ని లాఠీతో బెదిరిస్తూ, గోపాలం ముందెళ్లి నిల్చున్నాడు. వెండి గ్లాసు గోపాలం నోటి ముందు పెట్టి "కమాన్ వామ్ట్" అన్నాడు అసహ్యంగా.

కానీ, లాజ్‌బంతి మాత్రం అలా అన్లేదు. పైగా "నువ్వు నిమ్మరసం కక్కితే...డిప్ప పగలగొడతా..."అంది మొగుడికి వార్నింగిస్తూ... డబ్బులివ్వకుండా నిమ్మరసం అడిగే ఇన్‌స్పెక్టర్‌ని చూస్తూ!

గోపాలం మిడిగుడ్లేస్కొని పెళ్లామ్ వంక, ఇన్‌స్పెక్టర్ వంక చూస్తోండిపోయేడు.

"ఏంటీ..నేనెలా కనిపిస్తున్నాను...వీరప్పన్‌ని ముప్పు తిప్పలు పెట్టిందెవరనుకున్నావు... మి...దావూద్ ఇబ్రహీం ఇండియా వదిలి పాకిస్తాన్‌కి పారిపోయేలా చేసిందెవరనుకున్నావ్... మి...అంతెందుకు కాశ్మీర్లో అల్లకల్లోలం సృష్టించే మిలిటెంట్లు హైద్రాబాద్ ఎందుకు రావడం లేదంటే... కారణమెవరు...మి..."దర్పంగా చెప్పాడు ఇన్‌స్పెక్టర్ అహోబిలం .

గోపాలం పెళ్లామ్ వంక చూసేడు. డిప్ప పగులుతుందన్న వార్నింగ్‌ని ఫేస్‌లో ఎక్స్‌ప్రెస్ చేసింది.

"నేను నిస్సహాయుడ్ని బాబో" అన్న ఎక్స్‌ప్రెషనిచ్చాడు గోపాలం ఇన్‌స్పెక్టర్ వైపు చూస్తూ.

అంతే, ఇన్‌స్పెక్టర్ అహోబిలం రెచ్చిపోయేడు. గోపాలాన్ని జీపులోకి తోసేడు.

* * *

లాకప్ రూమ్.

భయంకరమైన ఎట్మాస్ఫియర్...తాళ్లతో కుర్చీకి కట్టేసారు గోపాలాన్ని. ఇన్‌స్పెక్టర్ అహోబిలం దర్పంగా వచ్చి, లాఠీని గాల్లోకి స్టయిల్‌గా ఎగరేసి, క్యాచ్ పట్టుకోబోయాడు. కానీ క్యాచ్ మిస్సయి, యాజిటీజ్‌గా ఎప్పట్లా నేలమీద పడి సొండిచ్చింది.

ఆ సీన్ చూసి హెడ్డు కిసుక్కున నవ్వాడు. సీరియస్ లుక్కేసాడు ఇన్‌స్పెక్టర్. మౌత్ మూసుకున్నాడు హెడ్డు.

"ఛీ...ఛీ...ఉద్యోగంలో జాయినైనప్పట్నుంచీ, లాఠీని గాల్లోకి ఎగరేసి పట్టుకోవాలని చూస్తున్నా కుదరట్లేదు" తనను తానే తిట్టుకుని , గోపాలం వైపు నడిచి...

"ఏరా...నేనెలా కనిపిస్తున్నాను? నా ఫేస్‌లో బ్రహ్మానందం కామెడీ కనిపిస్తోందా?



చంపేస్తాన్రోయ్...కొండవీటి సింహంలో అన్న ఎన్టీఆర్ టైప్ 'నేను...' గంభీరంగా అని...."ఏరా నిమ్మరసం అడిగితే ఇవ్వనంటావా? ఇంతకీ నీ పేరేమిట్రా...అవున్రోయ్....మొన్న ఢిల్లీలో ఎర్రకోట దగ్గర బాంబులు పెట్టింది నువ్వేనా? మరచిపోయాన్రోయ్...కాశ్మీర్లో బురఖా వేస్కోలేదని అమ్మాయిల మీద యాసిడ్ పోసింది నువ్వే కదరా,"అన్నాడు లాఠీని గోపాలం కళ్ల ముందు తిప్పుతూ.

కళ్లు మిటకరించి , లాఠీ వంక చూసి తల అడ్డంగా తిప్పాడు గోపాలం.

"స్పీకమంటే తల అడ్డంగా తిప్పుతావేంట్రా... నేను వెర్రి వెంగళప్పలా కనిపిస్తున్నానా?" కోపంగా అరిచాడు ఇన్‌స్పెక్టర్.

తల నిలువుగా తిప్పి, వెంటనే కంగారుగా అడ్డంగా తిప్పాడు

ఇన్‌స్పెక్టర్ అహోబిలం లాఠీని పైకెత్తి గోపాలం వీపుమీదొక్కటిచ్చాడు

కొట్టొద్దన్నట్టు ఫేస్‌లో ఎక్స్‌ప్రెషనిచ్చాడు

"మాట్లాడవేమిట్రా...ఎంత పొగర్రా..వీడో పిచ్చి వెధవ. వీడితో మాట్లాడేదేమిటి నా తొక్కలో - అనుకుంటున్నావా? నీతో మాట్లాడించక పోతే నా పేరు బిలం...అహోబిలమే కాదు....." అన్నాడు.

"ఒరే పిచ్చి ముండావాడా...నేను స్పీకలేనురా." అని గొంతెత్తి చెప్పాలని వున్నా, గొంతులో అడ్డంగా నిమ్మకాయ వుండటంతో 'అర్థం చేసుకోరా' అన్నట్టు ఇన్‌స్పెక్టర్ వైపు చూసేడు. కానీ ఇన్‌స్పెక్టర్ మిస్సండర్ స్టాండ్ చేసుకుని, ప్రెస్టేజి ఇష్యూగా ఫీలై, లాఠీ విరిగే వరకూ చితకబాదడం మొదలెట్టాడు.

కుయ్యో...మొర్రో...అని కూడా అన్లేక పోయాడు గోపాలం.

* * *

అరగంట తర్వాత రొప్పుతూ, గోపాలం కాళ్లమీద పడి....

"నీకు దండం పెడతాన్రా...టంగ్ విప్పరా...నా సర్వీస్‌లో నీ లాంటి వాడిని ఫస్ట్‌టైమ్ చూస్తున్నాన్రా... నాకు మెంటలెక్కిపోతోందిరా... మాట్లాడరా." అన్నాడు.

"నేను మాట్లాడలేన్రా..." అని చెప్పలేకపోయాడు గోపాలం.

'ప్లీజ్‌రా...' మళ్లీ బ్రతిమిలాడాడు. అయినా నో యూజ్.

ఇన్‌స్పెక్టర్‌కు మండింది. పక్కనే వున్న నీళ్ల కూజా తీసి, కసికొద్దీ గోపాలం నెత్తిమీద బలంగా కొట్టాడు. ఫట్‌మని కూజా పదహారు ముక్కలైంది. 'చచ్చాన్రోయ్ 'అని గోపాలం అరిచాడు. విజయ గర్వంతో నోరంతా తెరిచి నవ్వాడు అహోబిలం...అంతే...గోపాలం గొంతులో అన్నాళ్లూ వుండిపోయిన నిమ్మకాయ, ఇంగ్లీషు సిన్మాలోని గ్రాఫిక్‌లా కదిలొచ్చి ఇన్‌స్పెక్టర్ అహోబిల్రావ్ నోట్లోకి దూరి నంగనాచి తుంగబుర్రలా గొంతులో పర్మినెంట్‌గా సెటిలైంది.

స్టాచ్యూలా వుండిపోయిన ఇన్‌స్పెక్టర్ వైపు చూసి "సారీ ఫ్రెండూ...అదృష్టం సైడయి, దురదృష్టం కజినవ్వడమంటే ఇదే...నీ బ్రతుకు పాచిపోయిన పేస్టయి, వేస్టవ్వబోతుందేమో... పుసిక్కీ మీ ఆవిడా, మా ఆవిడలా 'నిమ్మకాయ బాబా' దుకాణం ఓపెన్ చేస్తే..."

వెంటనే విజువలైజ్ చేసుకున్నాడు ఇన్‌స్పెక్టర్ అహోబిల్రావ్.

* * *

విజువలైజ్ నుంచి బయటకొచ్చి, కింకర్తవ్యమ్ అనుకున్నాడు.

ఫినిషింగ్ టచ్ ఏమిటంటే...

మిస్టర్ గోపాలం, మిస్టర్ అహోబిల్రావ్‌లు రోడ్డుమీద పిచ్చెక్కినట్టు పరుగెడ్తున్నారు.

మిసెస్ గోపాలం, మిసెస్ అహోబిల్రావ్‌లు వెంటపడుతున్నారు.

గొంతులోని నిమ్మకాయ కక్కి, బిజినెస్ పోగొట్టినందుకు మొగుడి డిప్ప పగులకొట్టడానికి మిసెస్ గోపాలం...

కక్కుర్తిపడి గోపాలాన్ని చితగొట్టి, తన గొంతులోకి నిమ్మకాయ తెచ్చుకున్న మొగుడ్ని వీపు చిట్లగొట్టడానికి మిసెస్ అహోబిల్రావ్.

మగాళ్లిద్దరూ పరుగెడుతున్నారు. ఆడాళ్లిద్దరూ వెంటపడి తరుముతున్నారు. ■



## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

**మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి బాలూ గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.**

1. తావి (మనోహరం- పుచ్చాపూవుల)
   ఎ) ప్రదేశము బి) మొగ్గ
   సి) కాంతి డి) పరిమళము
2. వెల్ల (మనోహరం- పుచ్చాపూవుల)
   ఎ) విల్లు బి) నీడ
   సి) తెలుపు డి) ప్రతిబింబము
3. ధవళము (భూకైలాస్ - దేవ దేవ)
   ఎ) కొండ బి) తెలుపు
   సి) మంచు డి) వెండి
4. ఫాలము (భూకైలాస్ - జయ జయ)
   ఎ) పాలు బి) కమలము
   సి) మూడవది డి) నుదురు
5. కంధరము (భూకైలాస్- జయ జయ)
   ఎ) భుజం బి) మెడ
   సి) శరీరము డి) కంద
6. పాహి (భూకైలాస్ - జయ జయ)
   ఎ) క్షమించు బి) రమ్ము
   సి) దాచుము డి) రక్షించు
7. కూర్మము (భూకైలాస్ - మున్నీట)
   ఎ) తాబేలు బి) చేప
   సి) తిను పదార్థము డి) మోహిని
8. కిటి (భూకైలాస్ - మున్నీట)
   ఎ) పంది బి) సింహము
   సి)గవాక్షము డి) పాము
9. నాభి (భూకైలాస్ - మున్నీట)
   ఎ) ఆకాశము బి) బొడ్డు
   సి) హృదయము డి) బ్రహ్మ
10. పుంగవ (భూకైలాస్ - రాముని)
   ఎ) పుట్టినవాడు బి) రాజు
   సి) శ్రేష్ఠుడు డి) పూర్వీకుడు

### జవాబులు

1) d 2) c 3) b
4) d 5) b 6) d
7) a 8) a 9) b
10) c

బాలు

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

## ఎం.చిత్తరంజన్

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

## పూవులే పిలిచే వేళ

ప: పూవులే పిలిచే వేళ పులకింతలే కాదా
వినిపించె మురళీగానం వేగరావేలనోయి

1చ: కలలే కథలై కమ్మనిసుధలై
కదల సాగే మదిలోన
ఏఏ తారలు నిలువరించెనో
నిను వరించి నెరజాణ ॥పూవులే॥

2చ: అందమైన బృందావనిలో
అందుకొంటి నీ సొగసు
దాచుకొందునని దోచుకొంటివి
దారికాచి నా మనసు ॥పూవులే॥



| | |
|---|---|
| రచన | : డా॥ ఆచార్య తిరుమల |
| సంగీతం | : చిత్తరంజన్ |
| గానం | : శ్రీమతి విజయలక్ష్మీశర్మ |
| రాగం | : దర్బారి కానడ (హిందుస్తాని రాగం) |
| తాళం | : ఆది (కర్ణాటక సం॥) |
| | - కహరువా (హిందుస్తాని సం॥) |
| ఆరోహణ | : స రి గ మ రి మ ప ద ని స |
| అవరోహణ | : స ద ని ప మ ప గ మ రి స |

-షడ్జము, చతుశ్శృతి రిషభం, సాధారణ గాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, శుద్ధ దైవతం, కైశికి నిషాదం- యీ రాగంలోని స్వరాలు.

ఈ స్వరాలు ఆరోహణలోను, అవరోహణలోను పైన చూపిన విధంగా వక్రసంచారంతో రాగ స్వరూపాన్ని వెల్లడి చేస్తాయి. చాలా ప్రసిద్ధి చెందిన హిందుస్తాని రాగం. గాంధారం, దైవత స్వరాలకుండే గమకాలు రాగ స్వరూపానికి విశిష్టతను చేకూర్చుతవి. భక్తి, శృంగారాలకే కాక యీ రాగం రాజ దర్బారులలో హుందాతనము, దర్పము వ్యక్తమయ్యే విధంగా కూడా పాడబడేదని పండితులు చెబుతారు. ఈ విషయాలను నవివరంగా "హాసం" 1-15 సెప్టెంబరు 2002 సంచికలో ప్రస్తావించాను. లలిత సంగీతంలో కూడా దర్బారి కానడ రాగాన్ని ఉపయోగించి పలువురు స్వరకర్తలు సుమధురమైన బాణీలను మనకందిస్తూనే వున్నారు.

మధుర భక్తిగా ఓ గోపిక మదిలో తరంగించిన శృంగార భావనకు రూపమే ఈ గీతంగా తిరుమల కలం ఆవిష్కరించింది. పూవులు పిలచిన వేళ యమునానది వీచికల నుండి ఏతెంచే పిల్లగాలులు వినిపించే మురళిగానం తన మనసును దోచుకున్న గోపాలుని గుర్తునకు తేగా గోపిక తన మదిలోని తీపి జ్ఞాపకాలను గుర్తుకు తెచ్చుకుంటుంది రస రమ్యంగా. తిరుమల రచించిన ఈ గీతాన్ని నా సంగీతంలో విజయలక్ష్మి శర్మ గానం చేశారు.

### శ్రీమతి విజయలక్ష్మీశర్మ

అవధాన ప్రక్రియలో సిద్ధహస్తులు, ప్రసిద్ధులూ అయిన తిరుపతి వెంకట కవుల్లో ఒకరైన దివాకర్ల తిరుపతి శాస్త్రి గారి మనుమరాలు శ్రీమతి విజయలక్ష్మి శర్మ. చిన్ననాటి నుంచి సంగీతం పట్ల అభిరుచితో శ్రీ సుసర్ల శివరాం గారి వద్ద కర్నాటక శాస్త్రీయ సంగీతం అభ్యసించింది. కేంద్రీయ విద్యాలయంలో 1975 నుండి సంగీత ఉపాధ్యాయురాలిగా పనిచేస్తూ



గాయనిగా కూడా ప్రసిద్ధిపొందింది. కేంద్ర ప్రభుత్వం ద్వారా 'ఉత్తమ ఉపాధ్యాయినిగా' బహుమతి నందుకుంది.

1968లో ఆకాశవాణి ఆడిషన్ టెస్టు పాసై లలిత సంగీతం పాడటం ప్రారంభించి 1984 లో 'ఎ'గ్రేడ్ కళాకారిణిగా గుర్తింపుపొందింది. ఆకాశవాణి, దూరదర్శన్‌లలో అనేక కార్యక్రమాలలో లలిత సంగీతం, భక్తి సంగీతం, జానపద సంగీతం పాటలు పాడింది. అంతేకాక ఆమె అనేక టి.వి. సీరియల్స్‌లో కూడా పాల్గొన్నది. ప్రఖ్యాత కళాకారులైన శ్రీ ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, శ్రీమతి సుశీల, శ్రీమతి జానకి మొదలైన వారితో కలిసి ఎన్నో సినిమాలలో పాడి గాయనిగా మంచి పేరు తెచ్చుకుంది. సంగీత, హెచ్.ఎం.వి మొదలైన రికార్డింగ్ సంస్థలు రూపొందించిన ఎన్నో క్యాసెట్లలో కూడా పాడింది.

వేదికలమీద అనేక సంగీత కార్యక్రమాల లోను ప్రపంచ తెలుగు మహా సభల్లోను, ఆకాశవాణి జాతీయ కార్యక్రమాల్లోను విజయలక్ష్మి శర్మ పాల్గొని పలువురి మన్ననలను పొందినది.

ఆకాశవాణిలో శ్రీ విశ్వనాథంగారి సంగీత సారధ్యంలో ఆమె పాడిన డా॥ అరిపిరాల విశ్వంగారి రచన "శివపాదము నుంచనేను






శిలనైనను కారాదా", నా సంగీత సారథ్యంలో శారదా అశోకవర్ధన్ రచించిన "ఎంత రాతి మనసు నీది", జొన్నవాడ రాఘవమ్మ రచించిన "నవ్వకే నెలవంక", "పిల్లన గ్రోవి మెల్లన ఊది", మైత్రేయ రచన 'అనురాగ మందిరాన' మొదలైన అనేక గీతాలు ఆమె పాడినవి చాలా ప్రసిద్ధి పొందినవి.

ఈ సందర్భంలో మరొక ముఖ్య విషయం. బిందుమాలిని అనే కర్నాటక రాగంలో ఒక్క త్యాగరాజ స్వామి వారు మాత్రమే 'ఎంత ముద్దో ఎంత సొగసో!! అనే కీర్తన రచించారు. చక్రవాక రాగజన్యమైన బిందుమాలిని వక్ర సంచారం గల అపూర్వ రాగం.

శాస్త్రీయ సంగీత విద్వాంసులు కూడా సాధారణంగా ఈ రాగం ఎక్కువగా పాడరు. కాబట్టి లలిత సంగీతంలో ఈ రాగం వాడటమన్నది చాలా అరుదైన విషయం. వి.సంపత్‌కుమార్ రచించిన 'పిడికెడు ఎదలో పాల వెల్లువలు' అన్న గీతాన్ని బిందుమాలిని రాగంలో సంగీతం కూర్చి నేను విజయలక్ష్మీ శర్మ చేత పాడించాను. ఆమె ఎంతో కృషి చేసి ఈ పాటను చక్కగా పాడింది. ఎన్నో పాటలు నాతో కూడా కలసి ఆకాశవాణి లోను, పలు సభలలోను పాడింది.

మంచి గాత్రం, చక్కని రేంజ్‌తో బాటు క్లిష్టమైన సంగతులను కూడా చక్కగా పలికించగల నేర్పు, కృషి కూడా విజయలక్ష్మికి ఉన్నవి. దాదాపు 3 దశాబ్దాలుగా మంచి గాయనిగా ప్రఖ్యాతి పొందిన విజయలక్ష్మీశర్మ తన సంగీతం ద్వారా అనేక సేవా కార్యక్రమాలు కూడా చేయటం ముదావహం.

'హాసం' సెప్టెంబరు 1-15, 2002 సంచికలో దర్బారి కానడ రాగం ఆధారంగా కొన్ని తెలుగు, హిందీ చిత్ర గీతాలను ప్రచురించటం జరిగింది.

**జరిగిన కథ**

అజయ్ అనే శ్రీమంతుడు, విజయ్ అనే పేదవాడు ఒక ఏడాదిపాటు తమ తమ స్థానాలను మార్చుకోవాలని నిశ్చయించుకుంటారు. అజయ్ స్థానంలో వచ్చిన విజయ్ మేనేజర్ భానోజీ మోసం చేస్తున్నాడని గమనించి అతని కూతురు సరళతో ప్రేమ నటిస్తాడు. కానీ ఆమె తనంటే నిజంగా ఇష్టపడుతోందని అనిపిస్తుంది అతనికి. భానోజీ అనుచరులను ఉద్యోగంలోంచి తీసేసి, దుబారా తగ్గిస్తూ, భానోజికి ముకుతాడు వేస్తూంటాడు. విజయ్ స్థానంలో వచ్చిన అజయ్ చెల్లెలు మీనా కాపురం సరిదిద్దే ప్రయత్నంలో బావ బుజ్జిని బెదిరిస్తాడు. బుజ్జి భార్యను కలవడానికి చాటుగా వస్తూంటాడు. మోటారు మెకానిక్‌గా పని చేస్తున్న అజయ్‌కు తన కొలీగ్ ప్రకాష్ చెల్లెలు పద్మతో ప్రేమలో పడతాడు. భార్యను కలిసి వస్తున్న బుజ్జి తండ్రి కళ్ళల్లో పడుతూంటే, తల్లి కాపాడుతుంటుంది. భానోజీని ఉద్యోగం నుండి తొలగించినా సరళను పెళ్లి చేసుకుంటానని చెప్పి అతన్ని మచ్చిక చేసుకుంటాడు విజయ్. నగల ఆచూకీకై సరళను వెంటబెట్టుకుని భానోజి స్వగ్రామంలోని బంగళాకు వెళతాడు. మీనా నెల తప్పిన విషయం బయటకు పొక్కుతుంది. - (ఇక చదవండి)

# అన్నపూర్ణా వారి ఇద్దరు మిత్రులు



## సీరియల్ - నవల 15

**రచన : ముళ్లపూడి వెంకటరమణ**

"అది కాదో కోడలా అంతగుట్టయితే ఎలా?" అంది ఒకావిడ.



"నెల దప్పావుటగా, ఆ మాట కాస్త మా చెవిని వేస్తే యేం? అంత కానివాళ్ళమా?"

"చెప్పడానికే వుంది పిన్నిగారూ" అంది మీనా సిగ్గుతో తలవంచుకొని.

"అవున్లే, దాచుకోడానికేం కారణాలున్నాయో, మనకేం తెలుసూ-" అంటూ ఎత్తి పొడిచిందో లోకమాత.

మీనా మనసు చివుక్కుమంది.



"ఏమిటండీ ఆ మాటలు?" అంది.

"అబ్బో పౌరుషం! కాపరాని కెళ్ళకుండా నెల తప్పొచ్చుగాని, అంటే తప్పొచ్చిందా?" అందింకో తల్లి.

మీనా కళ్లు తిరిగిపోయాయి దుఃఖం పొంగి వచ్చింది. నిలువ లేక ఇంటికి పోబోయింది.

"కోడలా జాగ్రత్త - కాలు జారేను" అని శ్లేషించిందో అత్తగారు.



"ఇప్పుడు జారడమేం, ఎప్పుడో జారింది."

ఈ మాటలు, మీనా విందో లేదోగాని, అప్పుడే అటు వస్తున్న పద్మ చెవిన పడ్డాయి.

"మీ నోటికి శుద్ధీ బద్ధీ వుండక్కర్లేదూ, ఒక తోటి ఆడది కష్టాల్లో వుంటే, ఇలా అకారణంగా ఆడిపోసుకుంటారా, మీరూ మనుషులేనా? ఛీ" అంటూ చర చర ఇంట్లోకి వెళ్ళింది.



సావడిలో ముసలాయన నిరసంగా కుర్చీలో కూర్చున్నాడు. అవతలి గదిలో మీనా వెక్కి వెక్కి ఏడుస్తోంది. పద్మ ఆమెను ఎంత సముదాయించినా దుఃఖం ఉపశమించలేదు.

"లేదు పద్మా, లేదు నాకింక బతకాలని లేదు. ఇలాంటి అపనిందను మోస్తూ బతకడంకన్న..."

"చావడం మేలంటావు. చాల్లే ఇప్పుడేం మునిగి పోయింది. నీ నిజాయితీ నీకు తెలుసు. నీ భర్తకు తెలుసు."

"తెలిసి ఏం ప్రయోజనం! లోకుల దృష్టిలో నేను..."



"వాళ్ళేదో కూశారని ప్రాణాలు తీసుకుంటావా. చదువుకున్న దానివి. నువ్వు చెయ్యవలసిన పనేనా? ఈవేళ కాకపోతే, రేపు అత్తారింటి కెళ్తావు. అప్పుడంతా నోరుమూసుకుంటారు."

మీనా తల పైకెత్తి నేస్తురాలి వంక ఆశగా చూసింది. "నాకా అదృష్టం వుందంటావా? ఆయనా రావడం మానేశారు. ఇక నాకు నా అనే వాళ్ళెవరున్నారు? కడుపులో దాచుకుని కాపాడేందుకు కన్నతల్లి కూడా లేదు" అనేవరకు దుఃఖం

పెల్లుబికింది. ముఖం చేతులలో దాచుకుని ఏడ్వసాగింది.

"ఊరుకో మీనా, ఊరుకో. నేనున్నానుగా" అంది పద్మ ఇంకేమనాలో తోచక.



"మీనా" అంటూ అజయ్ లోపలికి వచ్చాడు ఉత్సాహంగా.

పద్మ సైగచేసి అతన్ని వారించి, ప్రక్క గదిలోకి తీసుకువెళ్ళింది.

"మీనా మనసు ఏమీ బాగాలేదు. తల్లి కాబోతుందని మనమంతా సంతోష పడుతూంటే, లోకులు ఆమె శీలాన్నే శంకిస్తున్నారు" అంది నెమ్మదిగా.

"ఎవరా శంకించేది. పళ్ళురాలగొడతాను" అన్నాడు అజయ్ ఆగ్రహావేశంతో.

"వాళ్ళ పళ్ళు తరవాత రాలగొడుదువుగాని, కాని ముందు మీనాను అత్తవారింటికి పంపే ఏర్పాటు చెయ్యి, ఊళ్ళోవాళ్ళు అనే సూటీపోటీ మాటలు పడలేక ఏ నిమిషాన ఏ అఘాయిత్యం చేస్తుందో, నాకు భయంగా ఉంది."



"సరే ఇవుడే వెడతాను, ఆ పరంధామయ్య కోడలు గొంతు కోయడానికి సిద్ధపడ్డాడు సరే; వంశాంకురాన్ని కూడా చంపుకుంటాడా తేల్చుకు వస్తాను" అంటూ నిల్చున్న పళంగా బయల్దేరాడు అజయ్.

* * *

"వీల్లేదు" అన్న ఒక్కముక్కతో, సంగతి క్షణంలో తేల్చేశాడు పరంధామయ్యగారు.

"ఎన్నిసార్లు రాయబారాని కొచ్చినా నువ్వనేది ఒకటేగా. డబ్బు ఊసెత్తకుండా పిల్లను తీసుకొచ్చి ఏలుకోమంటావ్. అంతేనా?" అన్నాడు తిక్కగా.



"మావఁగారూ! మీ పంతాలకూ, పట్టింపులకూ ఒక హద్దంటూ వుండాలి. ఎంతకాలం ఇలా ఆడపిల్ల వుసురు పోసుకుంటారు. ఇప్పటికైనా మీనాను తీసుకురాకపోతే, మీకే తలవంపులు" అన్నాడు అజయ్- తనకి సాధ్యమైనంత శాంతంగా.

"ఏఁవిటోయ్ తలవంపులు?"

"ఏం బావగారూ! ఏమీ ఎరగనట్టు అలా వూరు కుంటారేం?" అని కథానాయకుడు బుజ్జిని, గదమాయించాడు అజయ్.

"ఏమిట్రా సుపుత్రా! మాట్లాడవేం చెప్పు" అన్నాడు తండ్రి.



"నేనా?" అన్నాడు కుమారుడు తల్లివంక చూసి.

"వాడేం చెప్తాడండీ! పిరికి సన్నాసి" అంటూ వెకకేసుకొచ్చింది సూరమ్మ గారు.

అజయ్ కీ వరన అనహ్యాం కలిగించిది. "సరే నేను చెప్తాను. మీనా ఇప్పుడు గర్భవతి" అన్నాడు.

"ఆఁ! గర్భవతా!" అంటూ దిగ్గున లేచాడు పరంధామయ్యగారు. "అసలు మావాడు మీ అమ్మాయి మొహమైనా చూడందే!"

"అని మీరనుకుంటున్నారు. మీ చండశాసనానికి భయపడి చెప్పలేదేమో. చాలా రోజులుగా మా యింటికి వచ్చిపోతున్నాడు" అన్నాడు అజయ్.



"ఏమిటీ? నా వెనకాతల ఇంత కథ నడిచిందీ!" అంటూ విస్తుపోయాడు పెద్దాయన. ఆయన దృష్టి అర్థాంగి మీదకు తిరిగింది. "ఏవేం ఇంటి యిల్లాలా! ఇదంతా నువ్వాడించిన నాటకమేనా?" అని గద్దించాడు.

"అవును మరి భార్యా భర్తల్ని విడదీసి ఎంతకాలం అలా ముగ్గిపొమ్మంటారు వాళ్ళని! మీరేమో నగలు నగలని భీష్మించుక్కూచుంటిరి. వాడికి ప్రాణం విసిగింది. అక్కడికే వెళ్ళొస్తున్నాడు" అందావిడ ధైర్యం చేసి.



"వెళ్ళొస్తున్నాడూ? వస్తాడు వస్తాడు. నా మాటకి ఎదురు తిరిగేటంతటివాళ్ళయ్యారా మీరు? ఏరా- ఉండండి మీ యిద్దరి పనీ చెబుతాను" అటూ కర్ర తిరగేశాడు ఇంటి పెద్ద.

బాబోయ్ అన్నాడు బుజ్జి.

"మామగారూ, ఇంతకీ మీరు చెప్పే సమాధానం ఏమిటీ?" అన్నాడు అజయ్ విసుగ్గా.

భార్యా బిడ్డల పనిపట్టే ఉద్యమం ఆపి, వెనక్కు తిరిగాడు పరంధామయ్యగారు. "హరి గిరి మీద పడ్డా ఈ పరంధామయ్య లొంగుతాడనుకో కబ్బాయ్ మీ అమ్మాయి అత్తింటికి వెళ్లకుండా నెలతప్పితే అది మీకే అప్రతిష్ఠ మాకేం లేదు" అన్నాడు నిష్కర్షగా.



అజయ్ నిర్ఘాంతపోయాడు.

"ఆ మాటకొస్తే, మీ అమ్మాయినే శంకించవలసి వస్తుంది" అన్నాడు పెద్దాయన శ్రుతిమించి శ్రుతిపెంచి.

"పరంధామయ్యగారూ మాటలు మీరుతున్నారు జాగ్రత్త. మీరు కూసినకూతకు, మీనా ముఖం చూసి వూరుకుంటున్నాను. లేక పోతే..."



'లేకపోతే?"

అజయ్ పిడికిళ్లు బిగించి పళ్ళు పటపట కొరికాడు.

"అయ్యో అయ్యో ఏమిటండీ ఇది, నలుగురూ వింటే నవ్విపోతారు" అంది సూరమ్మ గారు భర్తధోరణికి నొచ్చుకుని.

"నోర్ముయ్" అని ఆవిడని టూకీగా ఆజ్ఞాపించి, విజయ్ కేసి తిరిగాడు పరంధామయ్య.

"ఇదిగో అబ్బాయ్, ఇప్పటికేనా ఆనోటా ఆనోటాపడి నాలుగు రకాల అపవాదులు పడకుండా వుండాలంటే - మీ చెల్లెలు అత్తింటికాపురం సక్రమంగా చెయ్యాలంటే, మా నగలు తెచ్చిపారెయ్. లేదా వడ్డీతో సహా డబ్బు తెచ్చియివ్వు. లేకపోతే, మీ దారి మీది, నా దారి నాది" అన్నాడు.



"అంతేనంటారా?"

"అంతే."

"హుఁ. మీకు మనుషులకంటే డబ్బే ప్రధానం. వెధవ డబ్బు కోసం మీరెన్ని అన్యాయాలైనా చెయ్యగలరు. ఎంతటి అభాండాలయినా వెయ్యగలరు. మావఁగారూ...డబ్బు వదులుకుని మీరు బతకలేరు. మిమ్మల్ని ఎదిరించి మీ అబ్బాయి బతకలేడు- సరే, ఆ డబ్బేదో సాయంత్రంలోగా తెచ్చి మీ ముఖాన పారేస్తాను" అంటూ చరచర బయటకు వెళ్ళిపోయాడు అజయ్.

పరంధామయ్యగారు తీరుబాటుగా, భార్యా పుత్రులను దండించే కార్యక్రమానికి ఉద్యమించారు.

"ఏరా చిట్టినాన్నా, సినిమాలనీ, షికార్లనీ నువ్వు చేస్తున్నదిదా? అమ్మాయికోసం అంతతొందర వచ్చిందేం? ఇంక వాళ్ళ గడప ఎలా తొక్కుతావో చూస్తాను. పద లోపలికి"



అంటూ బుజ్జి తాలూకు బుజ్జి చెవులు పట్టుకొని పక్కగదిలోకి ఈడ్చుకు పోయాడు.

"అమ్మా" అని ఆర్తనాదం చేసింది బుజ్జి కంఠం.

"అయ్యో అదేమిటండీ, చెట్టంత కొడుకుని పట్టుకుని-" అంటూ అడ్డుపడబోయింది తల్లి.

"చెట్టంత కొడుకు వాడు, మానంత మనిషివి నువ్వు...ఒరేయ్ పద.



పదపద. ఊ"అంటూ కులదీప కుడిని గదిలోకి తోసి తలుపేశాడు తండ్రి.

"ఊహ్" అంటూ రివాజు ప్రకారం మూర్ఛాస్త్రం ప్రయోగించి కుర్చీలోకి ఒరిగింది సూరమ్మగారు.

"నాన్నా! అమ్మ..." అన్నాడు కొడుకు.

"ముందు నీ సంగతి తేల్చి తరవాత దాని సంగతి" అంటూ గదికి తాళం వెయ్యసాగాడు తండ్రి.



బుజ్జి బుర్ర చురుగ్గా పనిచేసింది గబగబా కిటికీ దగ్గరకు పరిగెత్తి, కిటికీ అవతల కుర్చీలో మూర్ఛ నటిస్తున్న తల్లిని తట్టి, "అమ్మా అమ్మా! ఆ తాళం చెవి ఎలాగేనా కొట్టేయ్" అన్నాడు.

"అలాగేలే! తొందరపడకు" అంటూ ధైర్యం చెబుతోందావిడ.

తాళంవేసి తలెత్తిన పరంధామయ్యగారు ఈ సన్నివేశం చూసి ఆశ్చర్యపోయాడు.

"ఆ! నీ మూర్ఛకూడా నాటకమే నన్నమాట. ఊఁ. లే. లేస్తావా వెయ్యమంటావా?" అంటూ కర్ర



తిరగేసి,- కళ్ళుమూసుకుని ఉన్న భార్యనెత్తిన తేలిగ్గా ఒకటి వేశాడు.

"అమ్మబాబోయ్, లేస్తాను" అంటూ తక్షణం లేచి నిలబడిందావిడ.

"మళ్ళీ ఎప్పుడూ ఇలాంటి దొంగనాటకం ఆడనని చెంపలేసుకో. వేసుకుంటావా? వెయ్యమంటావా?"

ఆవిడ మొదటి మార్గాన్నే ఎన్నుకుంది.

"ఊ అలా దారికిరా. పరంధామయ్య అంటే ఏమనుకున్నారో జాగ్రత్త" అన్నాడు పరంధామయ్యగారు.

-(ఇంకావుంది)



ఎస్.రాజేశ్వరరావు

అన్నపూర్ణ సంస్థలోకి సంగీత దర్శకుడు శ్రీ రాజేశ్వరరావుగారు "ఇద్దరు మిత్రులు" చిత్రంతో ప్రవేశించారు.

శ్రీ రాజేశ్వరరావుగారు ఆఫీసుకు చాలా ఆలస్యంగా (అంటే పుదయం 11గం॥ ప్రాంతాన) వచ్చేవారు. కానీ-శ్రీ మధుసూదనరావుగారు, శ్రీ ఆదుర్తి 8-30 గం॥లకే సిద్ధంగా వుండే వారు.

ఒకరోజున - ఆలస్యంగా వచ్చిన రాజేశ్వరరావుగారి మీద మధుసూదనరావుగారు మండిపడ్డారు. రాజేశ్వరరావుగారు కోపగించి వెళ్ళిపోయారు. వారికి బదులు శ్రీ పెండ్యాలగారిని గాని, శ్రీ వేణుగారిని గాని పిలుద్దామని మధుసూదనరావుగారి వుద్దేశ్యం - కాని శ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారు వద్దన్నారు.

నన్ను శ్రీ రాజేశ్వరరావుగారి వద్దకు పంపి, ఆఫీసుకు తీసుకు రమ్మన్నారు. నేను వెళ్లాను. నన్ను చూడగానే శ్రీ రాజేశ్వరరావుగారు "క్షమించాలి సార్ మీకు చెప్పకుండా - ఆ కంపెనీలో మానేసాను" అన్నారు.

"నాకెందుకు చెప్పాలి? నేనెవర్ని?"

"మీరే కదా నన్ను ఆ కంపెనీలోకి తీసుకెళ్ళారు?"

"డ్రయివర్ని పంపి, మిమ్మల్ని తీసుకు రమ్మనడం మర్యాద కాదని సహాయ దర్శకుడ్నైన నన్ను పంపారు"

"..............................."

"అసలు మీరెందుకు మానాలి? మీ తప్పేమిటి?"

"..............................."

"ఆలస్యంగా రావడమే కదా?"

"అవునండి - అందుకే కోప్పడ్డారు".

"మీరు ఆలస్యంగా వస్తారని పరిశ్రమ అంతటకీ తెలుసు. మీరు పాటలు ఆలస్యంగా ఇవ్వడంలేదు కదా?! మీ ఆలస్యం వల్ల షూటింగ్‌లు ఎన్నడూ కాన్సిల్ అవలేదుకదా?"



మధుసూదనరావు

"లేదండి - అలాంటిదేం లేదండి"

"మరి, ఆ సంగతి మీరొచ్చి మధుసూదనరావుగార్నే అడగండి"

"అంతేనంటారా?"

"అంతే -"

"నాకు బి.యన్.గారి సిట్టింగ్ వుందే?"

"కాస్త ఆలస్యంగా వస్తామని వాళ్లకు చెప్పివెళ్దామండి."

వారిని తీసుకుని బి.యన్.రెడ్డిగారి ఆఫీసులో చెప్పి, అన్నపూర్ణ ఆఫీసుకు వెళ్లాను. శ్రీ మధుసూదనరావుగారు, రాజేశ్వరరావుగారు ఏకాంతంగా మాట్లాడుకున్నారు. రాజీ కుదిరింది. వారితో అశోకా హోటల్‌కు వెళ్లాను. స్వీట్స్‌తో టిఫిన్లు తిన్నాం.

అంతే! ఆ తర్వాత ఆ కంపెనీలోకి మరే సంగీత దర్శకుడు ప్రవేశించలేదు.

-స్వామి చిత్రానంద(కె.వి.రావు)., చెన్నై



సినీగీత కోశంలో 'భార్యాభర్తలు' చిత్రంలోని పాటలు, సంగీత దర్శకుడి పేరు వ్రాస్తూ మధ్యలో ఓ పాటకు ఎస్.రాజేశ్వరరావుకు బదులుగా ఘంటసాల పేరు వ్రాసారు. ఇదెలా సాధ్యం. సినిమాలో యిద్దరి సంగీత దర్శకుల పేర్లు లేవే! పొరపాటా? నిజమా? తెలియజేయగలరు.

-సపారె ఈరణ్ణ, కర్నూలు.

**(అది అచ్చుతప్పు... ఆ చిత్రానికి ఎస్.రాజేశ్వరరావు మాత్రమే సంగీత దర్శకుడు. -ఎడిటర్)**

16-28 ఫిబ్రవరి సంచికలో టి.వి.రాజు గారి గూర్చి పి.బీ.శ్రీనివాస్ గారు రాసినట్టి "పాండురంగమహాత్మ్యం"లో "ఆనందమిదే నోయీ సఖా" పాట పాడినది జిక్కికాదు పి.సుశీల పాడారు. ఇక 12వ పేజీలో కాపి/పీలు రాగాల ఆధారంగా చిత్తరంజన్‌గారు ఉదహరించిన గీతాలలో "నేను తాగ లేదు" పాట సంగీతం టి.చలపతిరావు. సినిమా పేరు "మనుషులు-మమతలు".

-డా॥ సయ్యద్ రహమతుల్లా, పర్లాకిమిడి (ఒరిస్సా).

16-31, జనవరి 2003 "హసం" పత్రికలో 52వ పేజీలో శ్రీ ఆదినారాయణ రావుగారు వ్రాసిన వ్యాసంలో పొరపాటు దొర్లినది. "కదనకుతూహలం" రాగంలోని "రఘువంశ సుధాంబుధి" కీర్తనను రచించినవారు "శ్రీ పట్నం సుబ్రహ్మణ్య అయ్యర్". "శ్రీ త్యాగరాజ స్వామి" వారు కాదు.

-శ్రీమతి ఎన్.లలిత, హైదరాబాద్.

1-15 ఏప్రిల్ 2003 సంచికలో "ధరణికి గిరి భారమా" అనే జూనియర్ సముద్రాల గారి గీతం "శభాష్ రాముడు" చిత్రంలోనిదని రాశారు. కాదు ఆ పాట "మంచి మనసుకు మంచిరోజులు" చిత్రంలోనిది.

-పి. జగన్నాధరావ్, విశాఖపట్నం.
-ఎన్. సారంగపాణి, అనంతపురం.
-సపారె ఈరణ్ణ, కర్నూలు.

**(మీరంతా కరెక్టు.-ఎడిటర్)**

తనకు స్వర్ణపతకం తెచ్చిన 'అనురాధా' సినిమాకు హృషిదా మొదట శంకర్ జైకిషన్‌లను కుదుర్చుకున్నా వారు 6 పాటలుండాలనడంతో వారిని కాదని రవిశంకర్‌చే సంగీతం చేయించారు. లీలానాయుడుకిదే తొలి సినిమా అయినా ఉత్తమనటిగా జాతీయ అవార్డును అందుకుందామె. -పద్మజారాయ్, మహబూబ్‌నగర్.

అనూరాధ లో జానే కైసే.. పాట గురించి చదువుతుంటే చదివిన సంగతులెన్నో గుర్తుకువచ్చాయి. 'హాసం' పాఠకులతో పంచుకునే ప్రయత్నమిది -

రవిశంకర్ కమ్మర్షియల్ హిందీ సినిమాలకు సంగీతం ఇచ్చినది తక్కువే! కె. ఎ.అబ్బాస్ సినిమా 'ధర్తీ కే లాల్', చేతన్ ఆనంద్ 'నీచానగర్' కి 1946 ప్రాంతాలలో ఇచ్చాడు. అవి ఫెయిల్ అయ్యాయి. 14, 15 సంవత్సరాల తర్వాత త్రిలోక్ జెట్లీ ' గోదాన్' కు, హృషీకేశ్ 'అనూరాధా'కు ఇచ్చాడు. ఇవీ ఫెయిలే! చాలా ఏళ్ల తర్వాత 1979 లో గుల్జార్ 'మీరా'కు చేశాడు. అదీ సక్సెస్ కాలేదు. విశ్వవిఖ్యాతంగా ఎంత పేరు సంపాదించినా కమ్మర్షియల్ సినిమాకు రవిశంకర్ పనికిరాడని అన్నారందరూ. 'వీళ్ల మొహం, వీళ్లెప్పుడూ విదేశాల మొహం చూసినవారు కారు. అందుకే అవసరమున్నా లేకపోయినా 30, 40 వయొలిన్లు పెట్టేస్తారు. నేనైతే సరిగ్గా ఎన్నికావాలో అన్నే పెడతాను.' అంటాడు రవిశంకర్. 'ఆయన ప్రతిభావంతుడే కానీ కమ్మర్షియల్ సినిమా టెక్నిక్ తెలియదు పాపం' అన్నాడు నౌషాద్ ఒకసారి. ఓ పి నయ్యర్ అయితే మరీ పచ్చిగా ' ఆయన వాద్యకారుడు తప్ప కంపోజర్ కాదు' అనేశాడు.

అయినా గుల్జార్ తన దర్శకత్వంలో హేమామాలిని హీరోయిన్‌గా తయారవుతున్న 'మీరా' (1979) సినిమాకై రవిశంకర్ సంగీతంలో లతా చేత పాడిద్దామని చాలా ప్రయత్నించాడు. దానికి చాలా అవరోధాలు వచ్చాయి. 'అనూరాధా' సినిమాలోని 'సావ్‌రే, సావ్‌రే' పాట రికార్డింగులో రవిశంకర్, లతాల మధ్య మనస్పర్థలు వచ్చాయి. చివరకు ఆ పాట డబ్బింగు రవిశంకర్ శిష్యుడు, ప్రఖ్యాత వేణు విద్వాంసుడు విజయరాఘవరావు పర్యవేక్షణలో నిర్వహించబడింది. అది జరిగి దశాబ్దంన్నర అయింది కాబట్టి లతా, రవిశంకర్ ఇద్దరూ మర్చిపోయివుంటారనుకున్నాడు గుల్జార్.

గుల్జార్ 'మీరా'ను ప్లాను చేసినప్పుడు హేమమాలిని రూపం, లతా గళం కలిపితే బ్రహ్మాండమైన హిట్‌పెయిర్ అవుతుందని అంచనా వేశాడు. లక్ష్మీకాంత్ ప్యారేలాల్‌లను సంగీతదర్శకులుగా పెట్టుకున్నాడు. లతా 'మీరా' ముహూర్తానికి హాజరయింది కానీ సంగీతదర్శకుడిగా తన తమ్ముడు హృదయనాథ్ మంగేష్కర్‌ను పెట్టమంది. తను పాడిన మీరా భజనలు ప్రైవేటు ఆల్బమ్స్‌కి హృదయనాథే సంగీతం సమకూర్చాడు కాబట్టి అతనే సరైనవాడని ఆమె వాదన. హృదయనాథ్ ఎంత గొప్పవాడైనా కమ్మర్షియల్‌గా సెల్లింగ్ పాయింటు కాడని గుల్జార్ బాధ. లతా ఉద్దేశ్యం గ్రహించిన లక్ష్మీ -ప్యారేలు ఏదో కుంటిసాకు చెప్పి సినిమానుండి తప్పుకున్నారు. లతాకు కోపం తెప్పించే ఉద్దేశ్యం వారికి ఎంతమాత్రమూ లేదు.

అప్పుడు రవిశంకర్ మీద దృష్టిపడింది. రవిశంకర్ పేరు విదేశాలలో బాగా అమ్ముడుపోతుంది కాబట్టి ఓవర్సీస్ మార్కెటుకు ఉపయోగపడుతుందనుకుని ఆయనను అడిగారు. సరేనన్నాడు. లతా పాటలు, రవిశంకర్ సంగీతం అంటే అనూరాధా టైప్‌లో శ్రోతలందరూ ఆకర్షింపబడతారని నిర్మాత, దర్శకుల అంచనా. కానీ లతా, రవిశంకర్‌ల మధ్య నడుస్తున్న తాజా తగాదా వారికి తెలియదు.

లతాకు విదేశాలలో కచ్చేరీలు ఇచ్చే అలవాటు లేదు. 1974లో రాయల్ ఆల్బర్ట్ హాల్‌లో ప్రదర్శన సూపర్ హిట్ కావడంతో ఆమె తన కమ్మర్షియల్ వాల్యూ బాగా గుర్తించింది. అప్పటిదాకా అక్కడ రవిశంకరే స్టార్. సితార్‌తో కొత్త, కొత్త ప్రయోగాలు చేస్తూ ప్రపంచ పౌరులందరినీ ఆకర్షించగల విద్వాంసుడాయన. లతా పరాయివాళ్లు మ్యూజిక్ ఇచ్చిన పాటలే పాడవచ్చు గాక, ఆమె పాటలు భారత ఉపఖండం నుండి వచ్చిన ఇండియన్స్, పాకిస్తానీలు, బంగ్లాదేశీయులకు మాత్రమే నచ్చవచ్చు గాక ఆమె ప్రదర్శనలు రవిశంకర్ కచ్చేరీల కంటె ఎన్నోరెట్లు కనకవర్షం కురిపించేవి. అందువల్ల ఆమె ఫీజు రవిశంకర్ ఫీజు కంటె ఎక్కువ ఉండేవి. కాస్తో, కూస్తో ఎక్కువయితే రవిశంకర్ కూడా ఫీలవకపోదునేమో! కానీ క్రమంగా అది రవిశంకర్ ఫీజు కంటె 15 రెట్లు ఎక్కువగా ఉండే స్టేజికి చేరుకునేసరికి రవిశంకర్‌కి బాధ మొదలయింది.

'మీరా'కు లతా పాడననేడయంతో రవిశంకర్ 'వాణీజయరాం చేత పాడిద్దాం లెండి. ఆవిడ కూడా మంచి సింగరే' అనేశాడు. 'మీరోసారి లతాతో మాట్లాడిచూడండి' అని గుల్జార్ అన్నా రవిశంకర్ అప్పటికి సరేనని తర్వాత కుదర్లేదనేశాడు. వాణీజయరాం చేతనే 'మీరా' పాటలు పాడించారు. వాటికోసం రవిశంకర్ విదేశాలనుండి బొంబాయి వచ్చి 14 రోజుల్లో 14 పాటలు రికార్డు చేయించాడు.

'మీరా' రికార్డింగు రోజుల్లో ఒకరోజు మెహబూబ్ స్టూడియో లో పక్క రూములో ఖయ్యాం - లతా రికార్డింగు ఉంది. ఆనాడు ఇద్దరూ ఎదురయినప్పుడు ఎలా ఉంటుందో అని అందరూ అనుకుంటూండగా ఆ రోజు లతా-ఖయ్యాం రికార్డింగు క్యాన్సిల్ చేశారెవరో! 'హమ్మయ్య' అనుకున్నారందరూ.

'మీరా'లో పాటలు వాణీ జయరాం అద్భుతంగా పాడింది. అయినా సినిమా ఫెయిలయింది. లతా, రవిశంకర్ ఇద్దరూ కలిసి పనిచేసివుంటే ఫలితం వేరేలా ఉండేదమో అని చేసుకునే 'ఊహాగానకచేరీలు' అనంతంగా సాగుతూనే ఉన్నాయి,ఉంటాయి.

**-మంజీర, గదగ్**






కాంతం : "ఇతను మా తమ్ముడు ఇవాళే అమెరికా నుండి దిగాడు"
పక్కింటావిడ: "ఏం ప్రపంచమో ఏమో ఇప్పుడు అన్నదమ్ములను కూడ దిగుమతి చేసుకోవలసి వస్తోంది!"



"కాస్త నా చెవి చూడండి సార్"
"మీరు పొరబడ్డారు, నేను డాక్టర్నుకాను. సంగీతంలో డాక్టరేట్‌ని అంతే."
"అందుకే కదా మీ వద్దకు వచ్చింది. నా చెవిలో అనుమానం ఝుం ఝుం అంటూ ఓ శబ్దం వినిపిస్తోంది. అది ఏ రాగంలో ఉందో మీరైతేనే చెప్పగలరని...."



చేతులు, మోకాళ్ళతో పాక్కుంటూ ఇంట్లో ప్రవేశించిన కుర్రాణ్ని చూసి తండ్రి 'ఏవిటా కోతి చేష్టలు' అంటూ కోప్పడ్డాడు.
"పరీక్ష తప్పితే ఇంట్లో కాలు పెట్టవద్దని మీరే కదా అన్నారు. వచ్చే నెల రిజల్ట్స్ వస్తాయి కదా.. ఇప్పట్నించే ప్రాక్టీస్ చేస్తే పనికొస్తుందని...." అంటూ వివరించాడు ముందు చూపున్న తనయుడు.



భార్య, భర్త స్టేషనుకు చేరేసరికి వాళ్ళు వెళ్ళవలసిన ట్రయిన్ వెళ్ళిపోయింది. తర్వాతి ట్రెయిన్ రావడానికి ఇంకా వ్యవధి ఉంది.
భర్త: నువ్వు నీ సింగారింపు ఇంత సేపు చేయకపోతే రైలు వెళ్ళిపోయేది కాదు కదా!?
భార్య: మీరు ఇంత తొందర, హడావిడీ చేయకుండా ఉంటే ఈ రెండో రైలు కోసం ఇంత పడిగాపులు తప్పేవి కదా!



ఓ పోలీసు గస్తీ తిరుగుతుండగా 'కాపాడండి కాపాడండి' అని కేకలు వినిపించాయి. వెంటనే ఆ పోలీసు, దగ్గరలో ఒక బావి దగ్గరకు వెళ్ళాడు. చీకటి కావటం చేత లోపల ఎవరున్నారో కనబడలేదు. దగ్గర ఉన్న ఒక ఇంట్లోంచి ఓ పేద్ద తాడు తీసుకువచ్చి బావిలో వేసాడు. అది పట్టుకొని లోపలి వ్యక్తి పైకి వస్తుండగా మొహం కనిపించింది. ఆ వ్యక్తి ఎవరోకాదు ఎస్.పి.గారు. వెంటనే ఈ పోలీసు సెల్యూట్ చేద్దామని చేతిలోని తాడు వదిలిపెట్టేశాడు.



**పేపరులో ఓ ప్రకటన:**
నా పర్సు పోయింది. కొట్టేసినవారు ఎవరో నాకు తెలుసు. 42 వ నం॥ బస్‌స్టాపులో అతన్ని చూసాను. దయచేసి ఆ వ్యక్తి వచ్చి నా పర్సు నాకు ఇచ్చేస్తే మర్యాదగా వుంటుంది.
**మర్నాడు ఇంకో ప్రకటన:**
నేను రేపు 42 వ నం॥ బస్టాపులో పగలు 10-12 మధ్య ఉంటాను. పర్సు పోగొట్టుకున్న పెద్దమనిషి ఎవరో వచ్చి నన్ను పోల్చుకుని పర్సు తీసుకోవచ్చు.

ఒక ఆసామికి తన ఇల్లు అమ్ముదామని ఆలోచన వచ్చింది. ఎందుకంటే ఆ ఇంట్లో అతనికి చాలా ఇబ్బందులు ఉన్నాయి. దెయ్యంకొంపలా అనిపించింది. అందుకే ప్రాపర్టీ డీలరుతో సంప్రతించి పేపరులో ఏడ్ ఇమ్మని చెప్పాడు. ఆ డీలర్ వచ్చి ఇల్లు చూసి ఆ ప్రకటనలో ఆ ఇల్లు ఎంతో గొప్పగా ఉందని దానిని నకల సుందరాంగంగా వర్ణించి వ్రాసాడు. ఆ పేపరు ప్రకటన చదివిన తరువాత ఇంత మంచి ఇంట్లో నేనే ఉండవచ్చు కదా! అమ్ముకోవడం ఎందుకు అని అనుకున్నాడా ఓనరు.



"ఇది వరకు నెయ్యి రూ. 150/- ఉండేది ఇప్పుడు రూ.130/- కు తగ్గిపోయింది"
"దానికి ఇంత చింతించటం ఎందుకు? ఆనందించాలి గానీ"
"ఏమి ఆనందం!? ఇంతకు ముందు నేను నెయ్యి కొనకపోవడంవల్ల 150రూ॥ ఆదా చేసేవాడిని, కాని ఇప్పుడు ఆ ఆదా రూ 20/- కి తగ్గిపోలా?"



**ఈ జోక్‌లను పంపినవారు జి.బి.లక్ష్మి, హైదరాబాద్.**






ఒక దొంగ : సూట్‌కేసు తెమ్మంటే పాము బుట్ట ఎందుకు తెచ్చావురా..?
ఇంకో దొంగ: పరుల సొమ్ము పాము వంటిదని...



"అందమైన అమ్మాయిలకి, అప్పలవారికి పోలికేమిటి?"
"ఇద్దరూ కలలలో కొస్తారు"



"మీరు నాకు రవ్వల నెక్లెస్ కొని తెచ్చినట్టు కల కన్నానండి"
"అయితే సాయంత్రం ఆఫీసునుంచి వస్తున్నప్పుడు మర్చిపోకుండా కొని తీసుకొస్తా"
"రవ్వల నెక్లెసే?"
"కాదు స్వప్న ఫల దీపిక గ్రంధం"



"కథ ఉంచిన కవరుపై మా ఫ్రెండు చిరునామా...- ఫ్రెండుకి సమాధానం వ్రాసిన కవరుపై పత్రిక చిరునామా వ్రాసి పోస్ట్ చేశా... పొరపాటున."
"ఏమైంది"
అక్కడ "పత్రికవాళ్ళు అది ప్రచురించారు- ఇక్కడ ఫ్రెండు ఆత్మహత్య చేసుకున్నాడు"

**ఈ జోక్‌లను పంపినవారు: ఎం. శిరీష, చిత్తూరు.**



"మా అబ్బాయి పరీక్షలు అయిపోతున్నాయంటే మాకు చాలా భయంగా ఉంటోందోయ్"
"ఏం?"
"ఏముంది. ఓ నెల తర్వాత రిజల్ట్స్ వస్తాయి.. ఫెయిల్ అవుతాడు... ఆ తర్వాత ఇంటిలో నుండి పారిపోతాడు... ఇహ వెతకలేక మేము నానా తిప్పలు పడాలి"



"మీ ఒంట్లో అసలు రక్తంగాని.. కొంచెం కండగాని లేదండి"
"అది సరే డాక్టర్. ఇంతకీ నా ఒంట్లో ఏం ఉందంటారు?"
"అస్థిపంజరం"



"ఏమోయ్! నేను ఒక నవల రాస్తున్నాను. ఆ నవల రాస్తున్న సమయంలో నేను ఈ లోకాన్ని మర్చిపోతానంటే నమ్ము"
"నిజంగా..'
"మరే. మా యావిడకు ఆ విషయం తెలీక నేను పోయాననుకుని అందర్నీ పిలిచి దహన కార్యక్రమాలకు ఏర్పాట్లు చేసేసింది కూడా"



"మన పెళ్లికి మా ఇంట్లో ఛస్తే ఒప్పుకోరు'
"మా ఇంట్లోకూడా అంతే..."
"అయితే ఏం చేద్దాం"
"పారిపోదాం"
"ఎక్కడికి?"
"నువు మీ ఇంటికి... నేను మా ఇంటికి..."

**ఈ జోక్‌లను పంపినవారు బి.వి.ఎస్. బాబు, తెనాలి.**

హాస్యవల్లరి సంగీత లహరి

సీరియల్ 14



# కిశోర్ జీవనఝరి

**- ఎమ్మెస్ స్వాతి**

**1975** జూన్ నుండి 19 నెలలపాటు భారతదేశంలో నడిచిన ఎమర్జన్సీ గురించి చాలా మంది మర్చిపోయి వుండవచ్చు. ఆ తరువాత పుట్టినవాళ్లకు దాని గురించి పూర్తి అవగాహన ఉండకపోవచ్చు. ఆనాటి రోజుల సెన్సార్‌షిప్ గురించి, ఎదురుచెప్పినవాళ్లపై ప్రభుత్వం సాగించిన దమనకాండ గురించి, ఎమర్జన్సీ నేపథ్యం గురించి విపులంగా తెలియకపోతే ఆ ప్రభుత్వదోపిడీకి వ్యతిరేకంగా కిశోర్ ప్రదర్శించిన స్థయిర్యం గురించి అర్థం చేసుకోలేము.

ఎమర్జన్సీని ప్రకటించిన ఆనాటి ప్రధానమంత్రి ఇందిరాగాంధీ. ఆమె రాజకీయరంగ ప్రవేశమే ఓ తమాషా! నెహ్రూ కూతురిగా ఆమె ప్రసిద్ధురాలు. నెహ్రూ మరణానంతరం

కిశోర్ కుమార్ మూడవభార్య యోగితాబాలి. మొదటి రెండు వివాహాలు జరగడంలో కొంత తర్కం కనబడుతుంది కానీ ఎందుకు చేసుకున్నారో అర్థం కాని విధంగా ఈ పెళ్లి జరిగింది. హాలీవుడ్ స్టయిల్లో అడావుడిగా పెళ్లి, ఆ పైన నిరాసక్తత, కూల్‌గా విడిపోవడం - ఇదీ వీరి కళ్యాణగాథ!

కిశోర్ మొదటిభార్య బెంగాలీ హిందూ, రెండో భార్య పఠాన్ ముస్లిమ్, మూడోభార్య అయిన యోగితా పంజాబీ సిఖ్.

ప్రఖ్యాత నటి, షమ్మీకపూర్ ప్రథమ కళత్రం గీతాబాలి అక్క కూతురే యోగితా. ఆ పేరు పెట్టినది గీతాబాలియేనట. తన కంటె యోగ్యురాలు కావాలని గీతాకు 'యో' చేర్చి యోగితా చేసిందట. ఎర్రగా, బొద్దుగా ఉండటం వలన యోగితాను అందరూ పింకీ అని పిలిచేవారు.

డైరక్టర్ షహీద్ లతీఫ్ చిల్డ్రన్ ఫిలిం సొసయిటీ కోసం 'జవాబ్ అయేగా' అనే బాలల చిత్రం తీస్తూ ఆమెను హీరోయిన్‌గా పెట్టుకున్నాడు. అప్పుడు తెరపై కనబడిన పేరు బేబీ పింకీ. ఇదే పేరుతో 'ఛోటీసీ ములాకాత్' (తెలుగులో 'మాంగల్యబలం'గా అంతకుముందే వచ్చింది. రెండింటికీ మూలం - అగ్నిపరీక్షా అనే బెంగాలీ సినిమా) లో బాల వైజయంతిమాలగా నటించింది. సినిమా బాగా ఆడకపోయినా బేబీ పింకీ సమీక్షకుల దృష్టిని ఆకర్షించింది. ఆమె అందాన్ని, ప్రతిభను కొనియాడుతూ వారు పత్రికలలో రాశారు.

ఆ వ్యాఖ్యలు అనంతస్వామి అనే తమిళ నిర్మాత కంటబడ్డాయి. ఈయన ఇంతకుముందు హేమమాలినిని వెలికిదీసి ఐదేళ్ల కాంట్రాక్టు ఆమెతో రాయించుకుని, బాగానే ఆర్జించాడు. అంటే ఆ అయిదేళ్లకాలంలో హేమమాలినికి ఇతర నిర్మాతలిచ్చిన పారితోషికంలో కూడా అతనికి వాటా వస్తుందన్నమాట. ఒకవేళ సినిమాలలో వేషాలు రాకపోతే ఒప్పందం ప్రకారం అనంతస్వామి ప్రతీనెలా జీతం ఇస్తూంటాడన్నమాట.

యోగితాబాలి కూడా హేమమాలిని లాగానే తనకు కల్పవృక్షంలా ఉపయోగపడుతుందని అంచనా వేసిన అనంతస్వామి ఆమె ఇంటికి వెళ్లి తలుపుతట్టాడు. నెలనెలా రెండువేలు ఇస్తానని చెప్పి పై షరతులతో ఆమెతో కాంట్రాక్టు రాయించుకున్నాడు. యోగితాబాలి కుటుంబం సరేనంది.



## ఎందుకు పెళ్లాడిందో, ఎందుకు

## యోగిత

దేశప్రధాని ఎవరు కావలన్న విషయంపై తర్జనభర్జనలు జరిగాయి. స్వాతంత్ర్యపోరాట సమయంలో సంపాదించుకున్న గ్లామరు కాంగ్రెసు పార్టీ పోగొట్టుకుంటున్న రోజులవి. చివరకు నెహ్రూ అనుయాయి లాల్‌బహదూర్ శాస్త్రి ప్రధానమంత్రి కావడం, ఆయన 1966 ఇండో-పాక్ యుద్ధంలో గెలిచి పేరు తెచ్చుకునేటంతలో మరణించడం జరిగాయి. మళ్లీ ప్రధానమంత్రికై వేట సాగింది.

వస్తువుకైనా, పార్టీకైనా సరే మార్కెట్ కావాలంటే ప్రొడక్టును వెంటనే గుర్తుపట్టేట్లు చేయడం అవసరం. ఆ దృష్ట్యా నెహ్రూకుటుంబం దేశమంతా తెలుసుకాబట్టి, ఆయన కూతురు ఇందిరాగాంధిని తెచ్చి కూచోబెడితే ఓట్లు తెచ్చుకోవడం సులభమని సిండికేటు కూటమిగా ఏర్పడిన కాంగ్రెసు నాయకులు అనుకున్నారు. ఇందిరాగాంధీకి పాలిటిక్స్‌లో అనుభవం లేదు కాబట్టి తాము చెప్పినమాట వింటుందని అనుకుని ఆమెను గద్దె నెక్కించారు.

గద్దెనెక్కిన తర్వాత ఆమె పోరాట పటిమ, రాజకీయ చతురత బయటపడ్డాయి. సిండికేటు విధానాలకు విరుద్ధంగా ప్రజాకర్షణ విధానాలను చేపట్టి సామాన్యప్రజలకు ఆరాధ్యదైవం అయ్యారు. 1971లో జరిగిన బంగ్లాదేశ్ యుద్ధంలో భారత్ విజయం కారణంగా ఆమెను ఒక దేవతామూర్తిగా ప్రజలు ఆరాధించే స్థాయికి ఎదిగారు. వెనువెంటనే వచ్చిన ఎన్నికలలో ఆమెకు ఘనవిజయం లభించింది.

ఇక్కడనుండి ఆమెలో నియంతృత్వ పోకడలు తలెత్తాయి. అసమర్థులైనా తనకు దాసోహం అన్నవారిని అందలం ఎక్కించడం, ఎదిరించిన వారిని నిర్మూలించడం జరిగింది. తన చిన్నకొడుకు సంజయ్‌గాంధీకి అర్హత లేకపోయినా ప్రజాధనం దోచిపెట్టడం విమర్శలకు దారితీసింది. అయినా ఆమె పట్టించుకోలేదు. గుజరాత్ రాష్ట్రంలో దుష్పరిపాలనకు వ్యతిరేకంగా విద్యార్థులు ఉద్యమం చేపడితే దానిని క్రూరంగా అణిచివేయడం జరిగింది. తండ్రికి ఆప్త మిత్రుడు, లోకనాయక్‌గా విఖ్యాతుడు జయప్రకాశ్ నారాయణ్ బిహార్‌లో ఉద్యమం నడిపితే దాన్ని రూపుమాపే ప్రయత్నంలో ఉండగానే అలహాబాద్ హైకోర్టు తీర్పు వచ్చింది.

ఇందిరకు ప్రధానమంత్రి పదవి కట్టబెట్టిన పార్లమెంటు ఎన్నికలో అక్రమాలు జరిగాయని ఆమెపై పోటీ చేసి ఓడిపోయిన రాజ్‌నారాయణ్ అనే ఒక వింత రాజకీయ నాయకుడు ఆ ఎన్నికపై అలహాబాద్ హైకోర్టులో కేసు




అయితే అందరూ హేమమాలినులు కాలేరు. ఏడాది గడిచినా ఏ నిర్మాతా యోగితాబాలిని పెట్టి సినిమా తీయడానికి ముందుకురాలేదు. ఉత్తిపుణ్యానికి నెలనెలా రెండువేల కరకు రూపాయలు యోగితా ఎదాన పోయడానికి అనంతస్వామికి కష్టం తోచింది.

చూసి, చూసి వినోద్ మెహరాను హీరోగా పెట్టి 'పర్దే కే పీఛే' (1971) అనే ఓ సస్పెన్స్ సినిమా తనే తీసేశాడు. యోగితా చేత అంగప్రదర్శన చేయించి పబ్లిసిటీ సంపాదించాడు. సినిమా ఓ మాదిరిగా ఆడింది కానీ ఈ లోపున యోగితా కిరణ్ కుమార్ అనే సహనటుడితో ప్రేమలో పడింది. విలన్ పాత్రలలో రాణించిన అలనాటి నటుడు జీవన్ కుమారుడే కిరణ్ కుమార్. తెరపై కథానాయక వేషాలకై ప్రయత్నిస్తూ తెరవెనుక దక్షిణ నాయకుడుగా పేరుమోశాడు.

యోగితా మెట్రిక్ పాసయింది. గడుసుతనం తక్కువ, భావావేశం ఎక్కువ. కిరణ్ ప్రేమలో తలమునకలుగా పడిపోయి తన కెరియర్‌ను పట్టించుకోలేదు. వేషాలు ఏవో వచ్చాయి కానీ ఆమెకు నటన పై శ్రద్ధ లేదు. కిరణ్‌కుమార్‌ను పెళ్లి చేసుకుందామనే ధ్యాస ఆమెకు.

కానీ కిరణ్‌కుమార్ హఠాత్తుగా రేఖా వెంటపడసాగాడు. రేఖా కూడా కిరణ్‌ను ఆదరించింది. దాంతో అప్పటిదాకా యోగితాబాలితో సాగించిన ప్రణయకలాపానికి స్వస్తి చెప్పి కిరణ్ ఆమె ప్రేమసౌధాన్ని పేకమేడలా కూల్చి పారేశాడు. యోగితా కంటె రేఖాయే పెద్ద స్టార్ అవుతుందని కిరణ్ అంచనా వేశాడు. ఆ మాట కరక్టే కానీ రేఖా అతి త్వరగా అనేకమంది ప్రియుల్ని మార్చి అంచెలంచెలుగా పైకి ఎగబాకింది.

ఆ సమయానికి రేఖా ప్రియుడిగా కిరణ్‌కు ఎక్కువ న్యూస్ వాల్యూ దొరికింది. అది చాలు అతనికి. ఫైనల్‌గా కిరణ్‌కుమార్ కూడా హీరో వేషాలలో నిలదొక్కుకోలేక కారెక్టర్ వేషాలు వేయసాగాడు. కానీ ఆ పీరియడ్‌లో మాత్రం యోగితాను వదిలేశాడు. అప్పుడు ఆమె జీవితంలోకి కిశోర్ కుమార్ ప్రవేశించాడు.

అప్పటికి, అంటే 1974 నాటికి, కిశోర్ జీవితంలో బొరెక్కి ఉన్నాడు. రెండోభార్య మధుబాల మరణించింది. ఒంటరిజీవితం గడుపుతున్నాడు. 'ఆరాధనా' తర్వాత ప్లేబ్యాక్ సింగింగ్ ద్వారా మళ్లీ ప్రఖ్యాతుడయ్యాడు. స్టేజిషోల ద్వారా బాగా గడిస్తున్నాడు.

(మిగతా తరువాతి పేజీలో)

పెట్టాడు. ప్రభుత్వోద్యోగి ఒకరు ఆమె ఎన్నికల ప్రచారంలో పాల్గొన్నారన్న ఒక చిన్న సాంకేతిక కారణం వల్ల ఆమె ఎన్నిక చెల్లదని తీర్పు వెలువడింది. మరొకరు ఎవరైనా అయితే కోర్టులో ఆ వివాదం ముగిసేవరకు (ఇటీవల జయలలిత చేసినట్టు) విధేయులైన వేరెవరినైనా గద్దె మీద కూర్చోబెట్టి కేసు నెగ్గాక పగ్గాలు తిరిగి చేపట్టేవారు.

కానీ సంజయ్‌గాంధీ ప్రోద్బలంతో ఇందిర వేరేమార్గాన్ని ఎంచుకున్నారు. 1975 జూన్ 26 రాత్రికి రాత్రి ఆంతరంగిక అత్యవసర పరిస్థితి ప్రకటించారు. యుద్ధం వచ్చినప్పుడు మాత్రమే ఎమర్జన్సీ ప్రకటించడం న్యాయం. కానీ తన పదవికి ముప్పు రాగానే దేశం అంతా అల్లకల్లోలంగా ఉన్నట్టు అడావుడి చేసి ఎమర్జన్సీ ప్రకటించడం ఘోరం. ప్రతిపక్ష నాయకులను జైళ్లలో కుక్కి, పత్రికలపై సెన్సార్‌షిప్ విధించి, నోరెత్తినవారిని జైలుపాలు చేసి 19 నెలల పాటు దేశంలో అరాచక పాలన సాగించింది ఆనాటి ప్రభుత్వం. భారతదేశ ప్రజాస్వామ్య చరిత్రలోనే ఒక కళంకంగా



'మిస్టర్ x ఇన్ బోంబే'లో కుమ్‌కుమ్‌తో

మిగిలింది ఆ 19 నెలలకాలం!

ఈ హఠాత్పరిణామాలకు ప్రజలు భీతి చెందారు. ఎప్పుడు ఎవరు జైలు పాలు కావలసివస్తుందో తెలియదు. జైల్లో పడినవారి అతీ, గతీ కనుక్కుందామన్నా ప్రచారసాధనాల గొంతు నొక్కేశారు కాబట్టి ఏమీ తెలిసేది కాదు. బ్రిటిషు పరిపాలన కంటె అన్యాయంగా సెన్సార్‌షిప్ అమలు జరిగింది. రేడియోలో ప్రభుత్వ ప్రచారమే తప్ప, సరైన సమాచారం లభించేది కాదు. టీవీలు అప్పటికింకా రాలేదు. బిబిసి వార్తలు వినకుండా చేసేవారు.

ఇప్పుడు చరిత్ర చెప్పుకుంటున్నాం కాబట్టి ఆ 19 నెలలు అని చులాగ్గా అంటున్నాం కానీ ఆ సమయంలో అది ఎన్నాళ్ళు నడుస్తుందో ఎవరికీ తెలియదు. నిజానికి తను ప్రజాస్వామ్యవాది అని ప్రపంచం అనుకోవాలన్న తపనతో ఇందిర 1977 లో ఎన్నికలు ప్రకటించి చేజేతులా పరాజయం కొనితెచ్చుకోవటం వల్ల ఆ చీకటి అధ్యాయం 19 నెలలలో ముగిసింది కానీ లేకపోతే అది ఎంత కాలం కొనసాగేదో ఎవరికీ తెలియదు. ఆ రోజుల్లో ప్రభుత్వాన్ని నడిపిన వారిని ఎదిరించి నిలిచిన వారందరూ హీరోలనే చెప్పాలి. వారిలో కిశోర్ కూడా ఒకడు.

ఎమర్జన్సీ కాలంలో పేరుకు ఇందిరాగాంధీ పాలించినా పెత్తనమంతా సంజయ్‌గాంధీదే! అతని చుట్టూ ఒక 'కోటరీ' ఉండేది. వారిలో అతి ముఖ్యుడు ఆనాటి సమాచార శాఖామంత్రి



(క్రితం పేజీ తరువాయి)

ఫారిన్‌టూర్లు కూడా వెళుతున్నాడు. యోగితా కంటె వయసులో బాగా పెద్దవాడైనా నరే ఆమెను చేసుకుందామనుకున్నాడు.

కిరణ్‌కుమార్ మీద కోపంతో యోగితా వెంటనే సరేనంది. 1975లో యోగితా ఫ్లాటులో సిఖ్ మతాచారానుసారంగా గురుగ్రంథ సాహెబ్‌ను ఎదురుగా పెట్టుకుని పెళ్లి జరిగింది. పిన్ని భర్తయిన షమ్మీకపూర్ కన్యాదానం చేశాడు. కిశోర్‌కి అప్పటికే తండ్రి పోయాడు. ఎవరో ఒకరు అతని తరపున పెద్దలు కావాలి. మెహమూద్ దగ్గరకు పరిగెత్తుకుని వెళ్లాడు. మెహమూద్ ఆ సమయానికి హాయిగా నిద్రపోతున్నాడు. కిశోర్ అతన్ని లేపి లాక్కొచ్చాడు. బట్టలు మార్చుకునే వ్యవధికూడా లేకపోవడంతో మెహమూద్ లుంగీతోనే పీటలమీద కూచున్నాడు. మతసామరస్యం అంటే ఇదే కాబోలు. పెళ్లికొడుకు హిందూ, తండ్రిగా ముస్లిమ్. వధువు సిఖ్.

ఆ సాయంత్రమే కిశోర్ ఇంట్లో బెంగాలీ స్టయిల్ పెళ్లి జరిగింది. యోగితా బెంగాలీ వధువు వేషంలో మళ్లీ తయారయింది.

పెళ్లిరోజునే హంసపాదు పడింది. 'నువ్వు నాకు సంబంధించినది ఏదైనా వాడుకో గానీ టాయిలెట్ మాత్రం వాడకు. వేరే ఎవరైనా వాడితే నాలుగురోజులదాకా ఆ జోలికి వెళ్లలేను నేను.' అన్నాడు కిశోర్. మొగుడుపెళ్లాల మధ్య ఇంత దూరమేమిటి? అంటుంది యోగితా. అప్పటినుండే కీచులాటలు మొదలయ్యాయి.

పెళ్లి కాగానే భార్యాభర్తలిద్దరూ హనీమూన్‌కు వెళదామనుకున్నారు. కానీ కుదరలేదు. ఎందుకంటే యోగితాబాలి తల్లి కూడా వాళ్లతో వస్తానని పట్టుబట్టింది. ఆవిడకీ, కూతురుకూ మరీ ఎక్కువ ఎటాచ్‌మెంట్ ఉండడం పోట్లాటలకు సగం కారణం. కిశోర్ నచ్చచెప్పడానికి ప్రయత్నించి చివరకు విసుగెత్తి హనీమూన్ కాన్సిల్ చేసేశాడు.

చివరకు భార్యాభర్తలు విడిగా వెళ్లారు. ఎక్కడికో తెలుసా, దక్షిణ ఆఫ్రికాకు! ఎందుకంటే కిశోర్‌కి అక్కడ స్టేజిషో వుంది. 'బిజినెస్ కమ్ ప్లెజర్' అంటే ఇదే కాబోలు! అక్కణ్నుంచి అమెరికా వెళ్లారు. అక్కడా అతని షోలు ఉన్నాయి.

అన్నీ యథావిధిగా జరిగినా పెళ్లి మాత్రం 18 నెలలకంటె సాగలేదు. కిశోర్ కుమార్ లోభత్వం యోగితాకు నచ్చలేదు. పెళ్లి తను అనుకున్నంత రసవత్తరంగా లేదనిపించి మాటిమాటికి పుట్టింటికి వెళ్లిపోతూ ఉండేది. కిశోర్ ఆమెను హింసలు పెట్టాడని ఎన్నడూ అనలేదు. కానీ ఆమె సుఖంగా ఫీలవలేదని మాత్రం చెప్పాలి. కిశోర్‌కి కూడా అదే ఫీలింగేమో, పుట్టింటికి వెళ్లవద్దని, తన వద్దనే ఉండమనీ అతనూ పట్టుబట్టేవాడు కాదు.

నిజానికి రూమా, మధుబాల కూడా మంచి కళాకారిణులు. వారితో కిశోర్ వేవ్‌లెంగ్త్ కుదిరేది. యోగితా విషయంలో యవ్వనం, అందమైన శరీరం తప్ప మేధోపరంగా కిశోర్‌ను ఆకర్షించిన అంశం ఏమీలేదు. పైగా యోగితా అంత పట్టుదల మనిషి అని అతను అనుకోలేదు. సెక్సీడాల్ అనుకున్న అమ్మాయి తల్లి మాట మాత్రం వినే జగమొండి కావడం అతను జీర్ణించుకోలేకపోయాడు.

వి.సి.శుక్లా. ప్రచారసాధనాలను గుప్పిట్లో పెట్టుకుంటే తప్ప నియంతృత్వం సాగదు. ఈ శుక్లా సినిమారంగ ప్రముఖులను ఎమర్జన్సీ విధానానికి అనుకూలంగా మలచడానికి అన్ని శక్తియుక్తులూ ఉపయోగించేవ డు. మామూలు ప్రజలకన్నా సినిమావాళ్లను వంచడం మరింత తేలిక. పెద్ద, పెద్ద నాయకులు కూడా లొంగుబాటు తత్త్వాన్ని ప్రదర్శించిన వేళ అది. ఒంగోమంటే మోకాళ్ల మీద పాకడానికి పోటీలాడిన మహనీయులెందరో ఆ నాడు!

భావి ప్రధానిగా సంజయ్‌ను చూపే ప్రయత్నంలో భాగంగానే శుక్లా 1975 డిసెంబర్లో ఢిల్లీలో ఓ ప్రదర్శన ఏర్పాటు చేసి సినిమా కళాకారులందరినీ వచ్చి ప్రదర్శనలు ఇమ్మనమని హుకుం జారీ చేశాడు. సంజయ్‌గాంధీ ప్రతిపాదించిన ఐదు సూత్రాల పథకానికి పబ్లిసిటి యిచ్చే కార్యక్రమం అది. తక్కిన కళాకారులందరూ శుక్లా మాట జవదాటకపోయినా, కిశోర్ మాత్రం ఖాతరు



ఎమర్జన్సీ శకంలో ప్రభుత్వం
అతని గొంతు నొక్కబోయింది

చేయలేదు. అక్కడకు వెళ్లనేలేదు. అక్కడ పోగైన ప్రజలు కిశోర్‌కుమార్ వచ్చి పాడకపోవడంతో నిరాశచెందారు.

తమ ఆదేశాన్ని ధిక్కరించిన కిశోర్‌ను క్షమించదలచుకోలేదు శుక్లా. ప్రభుత్వాధీనంలో ఉన్న రేడియో, టీవిలలో కిశోర్ పాటలు వినిపించరాదన్న ఆజ్ఞలు జారీచేశాడు. దానికి కుంటిసాకు ఏమిటంటే- అతని పాటలు అశ్లీలంగా ఉంటాయట! (మరి అలాటి గాయకుడిని ఫంక్షన్‌కి ఎందుకు ఆహ్వానించారో మరి!) ప్రైవేట్ రేడియోలు, టీవిలు అప్పట్లోలేవు కాబట్టి కిశోర్‌కుమార్‌కి శ్రోతలకూ మధ్య ప్రభుత్వం అడ్డుగోడ కట్టేసినట్టే! క్యాసెట్స్, టేప్‌రికార్డర్లు ప్రజలకు అందుబాటు ధరలో ఉండేవికావు ఆ రోజుల్లో. గాయకుడిగా కిశోర్‌కి సమాధి కట్టడానికే సమకట్టిందా కర్కశ ప్రభుత్వం.

ఇన్‌కంటాక్స్ దాడి కంటే ఇది కిశోర్‌ను ఎక్కువగా బాధించింది. ప్రజలకు దూరం కావడం ఏ కళాకారుడికైనా దుస్సహమైనదే కానీ అతనా బాధ భరించాడు. 1977 మార్చి ఎన్నికలలో శుక్లావంటి వారెందరో మట్టికరిచారు. నిరంకుశ పాలన అంతమయింది. కాళరాత్రి ముగిసింది చివరికి శుక్లా పబ్లిక్‌గా క్షమాపణ చెప్పవలసి వచ్చింది.

(ఇంకావుంది)

యోగితాకు కూడా కిశోర్‌లో గ్లామర్ కనబడడం మానేసింది. అనుమానస్తుడైన ముసలిభర్తలా అనిపించాడు. ఈ పెళ్లంటే ఆమెకు ఎంత విసుగుపుట్టిందంటే 'నాకు భరణం వద్దూ , ఏమీ వద్దు, ఇద్దరం విడాకులు పుచ్చుకుందాం, అదే పదివేలు' అంది. కిశోర్ సరేనన్నాడు. పెళ్లయిన 18 నెలలకు ఇద్దరూ విడాకులు పుచ్చేసుకున్నారు. ఈ ఏడాదిన్నరలో యోగితా కిశోర్‌తో కాపురం చేసింది తక్కువ, తల్లి, సోదరుడితో గడిపింది ఎక్కువ.



కిశోర్, యోగితా కలిసి నటించిన సినిమాలు రెండు - అకల్‌మంద్ (1966), శభాష్ డాడీ (1978). శభాష్‌డాడీ నాటికి ఇద్దరూ విడిపోయారు. విడిపోయిన భార్యాభర్తలు తెరపై కలిసి నటించడం అరుదు. అదీ భర్త స్వంత సినిమాలో!

జరిగినదేమిటంటే వారి విడాకులు తీసుకునేపాటికి యోగితాబాలి కుటుంబం ఆర్థికంగా చాలా చితికిపోయి వుంది. ఈ విషయం యోగితా తన వద్ద ప్రస్తావించినప్పుడు కిశోర్ 'అయ్యో అలాగా అయితే కొంత డబ్బు ఇస్తాను తీసుకో' అన్నాడు. కానీ ఆత్మాభిమానం గల యోగితాబాలి అందుకు అంగీకరించలేదు. 'కావాలంటే నాకేదైనా సినిమాలో వేషం ఇయ్యి. దానికి గాను డబ్బియ్యి.' అంది. కిశోర్ సరేనన్నాడు. శభాష్ డాడీ లో వేషం ఇచ్చాడు. దానికి పారితోషికం ఇచ్చి ఆమెకు ఉపయోగపడ్డాడు.

ఈ విధంగా కిశోర్, యోగితాబాలి సఖ్యంగానే విడిపోయారని చెప్పాలి.

కిశోర్‌తో విడాకులు పుచ్చుకున్నాక యోగితా జీవితం ఎటుసాగిందోనన్న ఉత్సుకత ఉండడం సహజం. ఆమెకు మిథున్ చక్రవర్తి పరిచయమయ్యాడు. 'బేషక్' అనే సినిమాలో ఇద్దరూ కలిసినటించారు. అప్పట్లో హిందీసీమలో ఓ జోక్ ఉండేది. తన పడుచుభార్య మిథున్ వలలో పడిందేమో గమనించమని కిశోర్ ఒక డిటెక్టివ్ ని నియమించాడని చెప్పుకొనేవారు. మిథున్‌కి అప్పటికే పెళ్లయింది. హెలెన్ ల్యూక్ అనే ఓ నటీమణి (రామానంద సాగర్ సినిమా ఒకదాంట్లో వ్యాంప్ వేషం వేసింది)తో వివాహం కావడం, అది సవ్యంగా సాగక ఇద్దరూ విడిపోవడం కూడా జరిగింది. అతనికి అప్పట్లో మంచి మార్కెట్ ఉండేది. సినిమా వేషాలకై తాపత్రయ పడకుండా ఇంటిపట్టున ఉండే అమ్మాయి కోసం అతను చూస్తున్నాడు.

యోగితాకు కూడా సినిమా జీవితం బోరు కొట్టేసింది. కిశోర్‌తో పెళ్లి కూడా బెడిసికొట్టింది. హాయిగా సినిమాలు మానేసి ఇంట్లో ఉండి పిల్లాపాపాను చూసుకుంటే బాగుండును అనిపించింది. ఆ రకమైన జీవితం మిథున్ ఇవ్వగలడన్న నమ్మకం చిక్కింది ఆమెకు.

పరిచయయిన కొద్ది నెలల్లోనే ఇద్దరికీ ఒకరిపై మరొకరికి నమ్మకం, ప్రేమ ఏర్పడ్డాయి. పెళ్లి చేసుకున్నారు. ఇద్దరి మొదటిపెళ్లిళ్లూ దెబ్బతిన్నాయి కాబట్టి జాగ్రత్తగా మసలుకోవాలని ముందే అనుకున్నారో ఏమో వారి వైవాహిక జీవితం బాగానే సాగుతోంది. వాళ్లకు ఇద్దరు కుమారులు. మిథున్‌కి ఊటీలో హోటల్ మోనార్క్ అని ఒక హోటల్ ఉంది, బొంబాయిలో ఓ ఫామ్ హౌస్ ఉంది. యోగితా అక్కడా, ఇక్కడా తిరుగుతూ అజమాయిషీ చేస్తూ ఉంటుంది. నేడో, రేపో కొడుకులను హీరోలుగా పెట్టి సినిమా తీసినా ఆశ్చర్యం లేదు. ఆమె స్మృతిపథంలో నుండి కిశోర్ అధ్యాయం పూర్తిగా తుడిచిపెట్టుకుపోయినా ఆశ్చర్యం లేదు. ■




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



# "వి.శివరామ్ మేరా షార్ప్ నాక్"

కె.బాలచందర్ సినిమాల్లోని టైటిల్స్‌లో "కథ, మాటలు : కె.బాలచందర్" అన్న చోట - అంతవరకూ వినిపించిన నేపథ్య సంగీతం ఒక్కసారి ఆగిపోతుంది. "నేపథ్య సంగీతానికి స్థానం లేని చోటు అదొక్కటే" అంటారు బాలచందర్. సాధారణంగా దర్శకుడి పేరు చివర్లో - ఆంధ్రాంగ్ల భాషల్లో వస్తుంది. అంతవరకూ తెలుగులోనే సాగిన టైటిళ్లు దర్శకుడు, నిర్మాతల పేర్లు రాగానే - ఇంగ్లీషులో కూడా ఎందుకు రాస్తారు? అన్నది ప్రశ్నే. ప్రేక్షకుల్లో తెలుగేతరులుంటే, ఆ రెండు పేర్లయినా చదువుకుని "ఆహా!" అనుకుంటారనీ, ఆనందిస్తారనీ, ఈ పేర్లు రాగానే నేపథ్య సంగీతం "ధామ్‌ధామ్" అని పెద్ద ఊపు అందుకుని, ఆగిపోతుంది. ఇది సహజం. కె.విశ్వనాథ్, బాపు మొదలైన కొంత మంది పేర్లు వచ్చినపుడు - ఆ సంగీతం మామూలుగానే, ఆర్భాటం లేకుండా సాగిపోతుంది, ఆగిపోతుంది. ఇలాంటి ఎన్నో నేపథ్య సంగీతాల్ని రికార్డు చేసిన ఒక సౌండ్ ఇంజనీర్ ఒక మాట అన్నారు:

"తీరిక సమయాల్లో మీరేం చేస్తారు?" అని అడిగే ప్రశ్నకి "సంగీతం వింటాను. పనిలో వున్నప్పుడు కూడా, వృత్తి చేస్తున్నప్పుడు కూడా సంగీతమే వింటాను" అన్నారా ఇంజనీరు. అలా చమత్కరించినది - పలు సంవత్సరాలు 'వాహిని'లో శబ్ద గ్రహణ శాఖాధిపతిగా పనిచేసిన వల్లభజోశ్యుల శివరామ్. ఇటీవలే ఈ శబ్ద ప్రపంచం నుంచి నిశ్శబ్ద లోకానికి నిష్క్రమించిన శివరామ్.



ఆయన నిత్య తాంబూల సేవకుడు. అంటే ఎప్పుడూ తమలపాకులు సేవిస్తూ వుండేవారు. రికార్డింగ్ మిక్సర్ మీద ఆయనకు కుడిచేతి వేపు ఒక డబ్బా వుండేది. అందులో సున్నం, ఆకులూ వగైరాలు. "అది అలవాటయిపోయింది. మన తెలుగువాళ్ళ కంటె, తమిళ సోదరులకీ అలవాటు ఎక్కువ. వాళ్ళని చూసే నేనూ నేర్చుకుని వుంటాను. జంతువులూ, మనుషులూ ఒకటే. అందుకే వాటిలాగా నేనూ నెమరు వేస్తూ వుంటాను." అన్నారు శివరామ్. జంతువులూ మనుషులూ ఒకటే అనడానికి నిదర్శనం వుంది. నోరులేని జీవాలంటే - ముఖ్యంగా వీధి కుక్కలంటే ఆయనకి మక్కువ ఎక్కువ. పిల్లులూ పక్షులూ కూడా. శివరామ్ గారు సందు సందుల్లో మూలుగుతూ పడి వున్న కుక్క పిల్లల్ని ఇంటికి తెచ్చి పాలు పోసి, మందులిచ్చి పెంచేవారు. ఆయనకు కోడంబాకంలో పెద్ద ఇల్లుండేది. ఆ ఇంట్లో వున్న మనుషుల కంటే ఈ జీవాలే ఎక్కువగా నివసించేవి. కుక్కల్నీ, పిల్లుల్నీ ఒక చోట చేర్చి సహజీవనం సాగించిన ఘనత కూడా శివరామ్ గారికి వుండేది. వాటికి అన్నం ముద్దలు పెడుతూ, "ఏరా నాన్నా - అలిగావా?... తిన్రా బాబూ" అని బుజ్జగిస్తూ తినిపించడం చూసిన కొత్తవాళ్ళకి ఆశ్చర్యంగా వుండేది.

ఆయన పాటగాడు. పద్యాలు, రాగాలూ తెలుసు. వాళ్ళ కుటుంబ సభ్యులంతా సంగీత ప్రియులే. "నీకు పాటవచ్చు. అందంగా కూడా వుంటావు. నాటకానుభవం వుంది. సినిమాల్లో ప్రయత్నించకూడదా? ఉద్యోగాల మాటకేం" అని ఆ గ్రాడ్యుయేటుని మిత్రులు ప్రోత్సహించారు. అతనికీ ఉత్సాహం ఉండడంతో, ప్రయత్నాలు చేస్తే అవి ఫలించి, 'భక్త పోతన' చిత్రంలో మల్లన వేషం లభించింది.

"అప్పటికి ప్లేబాక్ విధానం వచ్చింది. 'పోతన'లోని పాటలన్నీ ముందుగా రికార్డు చేసినవే. కాని పద్యాలు మాత్రం అక్కడికక్కడే రికార్డింగు. నేను చదివిన 'బాలరసాలసాల' పద్యం ఒక పొలంలో తీశారు. ఒక పక్క ఆర్కెస్ట్రా... ఒక దగ్గర నేనూ... వాళ్లకో మైకూ, నాకో మైకూ పెట్టారు. పద్యం అంతా ఒకే షాటులో తీశారు కె.వి.రెడ్డి గారు. ఇప్పటికీ నాకు ఆశ్చర్యం ఏమిటంటే, ఆ అవుడ్డోర్‌లో - ఏ ఇతర శబ్దాన్నీ మైకులోకి రానీయకుండా - ఒక్క మైకుతో



సుస్పష్టంగా రికార్డు చెయ్యడం! ఇవాళ ఇన్ని మైకులూ, ఇంత టెక్నిక్కూ పెరిగినా అంత క్వాలిటీ ఇవ్వలేకపోతున్నామే అని బాధ" అని చెప్పారు శివరామ్‌గారొకసారి. "మెషిన్లని అని ఏం ప్రయోజనం! మన శ్రద్ధలో లోపం" అన్నారు ఆయనే పకపక నవ్వుతూ. ఆయనకు నవ్వు ఒక ఆభరణం. నవ్వుతూ మాట్లాడ్డం, నవ్వుతూ పలకరించడం, నవ్వడం-ఆయన అలవాటు.

పోతన తర్వాత, మాయామచ్ఛీంద్ర, గుణసుందరికథ, షావుకారు, దీక్ష, విప్రనారాయణ, మంచీ చెడు, రంగుల రాట్నం మొదలైన సినిమాల్లో పాత్రధారణ చేశారు శివరామ్. 'గుణసుందరి కథ'లోని ఆయన రాకుమారుడిగా వస్తూ - "ఓహో చారుశీలా - లేజవరాలా" అన్న పాటని పాడారు. "అందులో పాశ్చాత్య పోకడలున్నాయి. ఓ పద్ధతిలో వుండదు పాట. కిందికీ పైకీ కిందికీ పోతూ వుంటుంది. కొంచెం ఇబ్బందైన పాటే. శ్రమ పడి పాడాను." అని చెప్పారు. అప్పటికి ఆయన శబ్ద గ్రహణ శాఖలో చేరారు - కృష్ణయ్యర్ దగ్గర.

"ఆ పాట అయ్యర్‌గారు రికార్డు చేశారు. టైమ్ పట్టింది. "నీకెందుకయ్యా పాటా అదీనూ,



'షావుకారు'లో ఎన్.టి.ఆర్.తో

సౌండ్‌లో కూచోక" అన్నారు అయ్యర్‌గారు నా అవస్థ చూసి - సరదాగా. "నేను రికార్డిస్టునయితే, ఎంతమంది పాటలో రికార్డు చెయ్యాలి సార్ - నేనివాళ అవస్థ పడితేనే గదా, రేపు వాళ్ల అవస్థేదో గ్రహించగలను" అన్నాను నేనూ సరదాగానే- అంటూ చెప్పారాయన ఆ పాట గురించి.

'పాతాళభైరవి' నుంచి శివరామ్ గారే రికార్డిస్టు. కృష్ణయ్యర్‌తోకలిసి, రీ రికార్డింగ్ కూడా చేసేవారు.

"పాతాళ భైరవి'లో మాంత్రికుడు, తోట రాముడిని పాతాళభైరవి దగ్గరకి తీసుకెళతాడు. అక్కడో పెద్ద వృక్షం వుంటుంది. అక్కడా గుహలోపలికి వెళ్ళిన తర్వాతా, "ఓ" అని ఒక భయంకరమైన కూత వినిపిస్తుంది. ఆ కూత సరిగా రావడానికి వారం రోజులు పట్టింది. ఆఖరికి కుండ తీసుకుని కుండలో ఆ శబ్దాన్ని సృష్టించి ఓకే అనిపించుకున్నాం. ఆ కూతని



చివరికి నన్నే కుయ్యమన్నారు. ఏం చేస్తాను? కూశాను. ఇలాంటి ఎఫెక్ట్ కావాలి, అని శబ్దగ్రాహకుడు చెప్తే వాళ్ళు చెయ్యలేకపోతే 'చెప్పినవాడే చెయ్యాలన్నమాట' అనుకున్నాను. ఒక చిన్న ఎఫెక్ట్ కోసం ఎంతో శ్రమ పడిన రోజులవి." అంటూ వివరించారు.

శివరామ్ గారి పాట, మాట ఎలా వున్నా, మాట స్పీడు, ఆ స్పీడులో కొన్ని అక్షరాలు తెలీవు. "కాని, అవతలి వాళ్ళు పాడుతున్నప్పుడు అక్షరాలు తెలియకపోతే ఒప్పుకోను. క్లారిటీ కావాలిగదా. చెప్పే వాడిలో క్లారిటీ లేక పోవచ్చుగాని, పాడేవాళ్లకీ, వినేవాళ్ళకీ క్లారిటీ లేకపోతే ఎట్టా!"... ఇదీ ఆయన ఫిలాసఫీ

దీటైన ముక్కు, నీటైన ముఖం. ముఖం మధ్య మీసం, ఒత్తయిన క్రాపు, ఎత్తయిన విగ్రహం - శివరామ్ అనబడే ఆ శివరామకృష్ణారావుది. "పేరు పెద్దదయిపోలా! అంత పేరు పలకాలంటే మధ్యలో ఏ రెండక్షరాలో రాలిపోతాయి. నా పేరు అడిగితే, నేనే క్లియర్‌గా చెప్పలేను. అంచేత, సులభోపాయంగా వుంటుందని 'శివరామ్'కి తగ్గించాను" అని చెప్పారాయన. శివరామ్‌గారి అన్నగారు రామస్వామి శర్మగారు. ఆయన కూడా 'పోతన'లో నటించారు - సింగభూపాలుడి పాత్రలో. శివరామ్ గారికి ఒక్కత్తే కూతురు. ఆ అమ్మాయి చిన్నతనంలో "శోభ" సినిమాలో హీరోయిన్ చిన్నప్పటి వేషం వేసింది - సరదాకి. ఆయన అల్లుడూ కూతురూ ఇప్పుడు అమెరికా వాసులు. శివరామ్ గారు మద్రాసు నుంచి హైదరాబాదుకీ, హైదరాబాదు నుంచి అమెరికాకీ మకాం మార్చి, ఇటీవల అమెరికాలోనే అస్తమించారు.

వాహినిలో పనిచేసిన చివరిరోజుల్లో ఆయన నిరుత్సాహంగా వుండేవారు. "అంతా రొటీన్.

**'గుణసుందరి కథ'చిత్రంలో**
**వల్లభజోస్యుల శివరామ్ స్వయంగా పాడి**
**అభినయించిన పాట**

ఓ... ఓహో... చారుశీలా... లేజవరాలా... సొగసుభళా...
ఓ... రూపబాలా విందగు వలపులొలుకు గొలుపు గులుగులా
కన్నుల్లో వెన్నెలై వెన్నెల్లో వసంతమై ॥2॥
ఎన్నెన్ని హొయలు గుబుల్ గుభాళించెనా హో జోహారులే
చెంగావి చీరవడిలో రంగారే నీ యెదభంగి
రంగేళి పద యుగళ్ జంపాలాడే
లల్లల్ల లాలాల ॥2॥
లల్లల్ల లాలాలా లల్లల్ల లాలలా
లల్లల్ల లాలలా ॥2॥
లల్లల్ల లాలాల లల్లల్లలా
కుశాల్‌బోణి రసికరమణి
కుశాల్‌బోణి రసికరమణి
వగల్‌జంది వరించేవు
ఓహో ఓహో ॥3॥
నా మెళ్ళోదండై
తల్లో పువ్వై...నెగెడె
ముల్లోకాలే కేళికి ॥2॥
రావోలే బాల బేల నోనో



'షావుకారు'లో

ఆర్కెస్ట్రా హెవీ... అన్ని వాద్యాలూ వినిపించాలంటారు. పాట ముఖ్యం. పాటలో సాహిత్యం ముఖ్యం - అని నేను చెబితే కొందరు వినేవారు. ఎన్నో భాషల్లో వేలాది పాటలు రికార్డు చేశాను. ఘంటసాల పాడుతూ వుంటే రికార్డు చెయ్యడంలో ఎంతో ఆనందం వుండేది" అని శివరామ్ గారు చెప్పేవారు - అప్పటికే, ఈ కంప్యూటరైజ్‌డ్ రికార్డింగ్ రాకముందే. రీ రికార్డింగ్, పాట రికార్డింగ్‌ల్లో వల్లభుడనిపించుకున్న వల్లభజోశ్యుల శివరామ్ ఘంటసాల పోయిన రోజునే (ఫిబ్రవరి 11) ఈయనా పోయి, మిత్రుని కలుసుకోడం ఆయన పాటలు ఎన్నెన్నో రికార్డు చేసి మైత్రి కట్టుకున్నందువల్ల నేమో!

# శ్రేయో జనవాక్యం



పాఠకుల మనోభావాలకు సముచిత స్థానం కల్పిస్తూ, విజయ పథంలో సాగుతున్న 'హాసం'కు శుభాకాంక్షలు. 'హాసం' 16-31 మార్చి సంచిక చదివాను. బంధుమిత్రులకు 'హాసం'ను పరిచయం చేస్తు తెలుగు నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేయటం వినూత్నంగా వుంది. ఈ నదవకాశాన్నిపొందిన వేలాది పాఠకులలో నేనూ భాగస్వామిని కావడం చాలా ఆనందంగా వుంది. 'హాసం'కు అభినందనలతో...

**-శ్రీనివాసరావు మిరియాల, కాకినాడ.**

నేను 'హాసా'న్ని చూసినప్పటినుండి ప్రతిపక్షం తప్పకుండా కొని ఆస్వాదిస్తున్నాను. తెలుగులో ఇంత చక్కని హాస్యాన్ని, సంగీత అవగాహనను మాకందిస్తున్న 'హాసం'కు మా ధన్యవాదాలు. మీరు ప్రయోగాత్మకంగా ప్రారంభించిన 'తెలుగు సినీ గీతకోశం' చాలా బాగుంది. ఆచార్య తిరుమల గారి నవ్వుటద్దాలు చాలా బాగుంటున్నాయి. హాస్యాన్ని, సంగీతాన్ని ఆస్వాదించే రసహృదయులందరికీ 'హాసం' ఒక వరం. ఈ పుస్తకరాజం చిరకాలం నిలవాలని ఆశిస్తూ...

**-పి.యస్.యస్.పవన్‌గణేష్, సోమేశ్వరం.**

పత్రికా రంగంలో...'హాసం' ఓ తాజా సంచలనం. అటు హాస్యాన్ని, ఇటు సంగీతాన్ని చెరో నయనంగా మలచుకుని , అన్ని వర్గాల పాఠకులను అలరిస్తూ...వారి హృదయాంత రాళాల్లోనికి చూపుసారిస్తూ... వడివడిగా దూసుకుపోతున్న సంగీత సాహిత్య కిరణం... 'హాసం'!

కొత్తసంచిక ఎప్పుడెప్పుడు వస్తుందా... అని ఎదురుచూడగలిగేట్లు సర్వులనూ మెస్మరైజ్ చేసిన 'హాసా'నికి అభినందనలతో....

**-కండ్లకుంట శరత్‌చంద్ర, మెహబూబ్‌నగర్.**

వెనుకటి రోజులలో సినిమాలు విడుదల యినపుడు ఆయా చిత్రాల పాటల పుస్తకాలు వాటి వివరాలు, చిత్రకథ క్లుప్తంగా వివరించేవారు. నటీనటుల బొమ్మలు రంగులలో చిత్రించి ప్రచురించేవారు. తరువాత కాలములో పాటల పుస్తకాలు విడుదల ఆగిపోవుటవలన సినిమాలు చూసినా సరియైన వివరాలు లభించేవికావు. పాతకాలం అభిమానులు అప్పట్లో వాటిని సేకరించి దాచుకొని ఉండవచ్చును... నేటి తరం అభిమానులకు వాటిని చూసే అదృష్టం కలగక పోవచ్చు.

కాని, ఇన్ని సంవత్సరములు తరువాత 'హాసం' పత్రికలో మీరు ప్రచురిస్తున్న 'ఆ పాత(ట) మధురం' శీర్షికలో పాత చిత్రాల పాటలను, నటీనటులు, గాయనీగాయకుల వివరాలతో, సంగీతం, సాహిత్యం మరియు సన్నివేశసందర్భం, ఇంకా బొమ్మలతో సహా ఇవ్వటము వలన నాలాంటి ఎందరో పాతతరం అభిమానులకు ఉపయోగకరంగా వుంటు న్నాయి. ఒక విధంగా పాత సినిమాల పాటలను ఇంత వివరంగా ఇవ్వటం వలన ఆనాటి పాటల పుస్తకాలు దొరకని/చూడని వారికి, వాటికంటే ఇంకా ఎక్కువ వివరాలతో దొచుకునేట్లుగా ఉన్నాయి.

కేవలం ఒకే వ్యక్తి ప్రతి పాత సినిమాలోని పాటల అన్ని వివరాలను ఇంత వివరంగా అభిమానులకు అందించటం అంటే సామాన్య మైన విషయం కాదు. దీని వెనుక ఎంతో కృషి, పట్టుదల మరియు ఆత్మస్థైర్యం ఉండాలని నా నమ్మకం. ఈ శీర్షికన ఇంకా ఎన్నో పాత సినిమాల వివరాలను ఇవ్వగలరని ఆశిస్తున్నాను.

**-ఎస్. సూర్యనారాయణ, హైద్రాబాద్**

**ఫ్రీగా వచ్చిన కొబ్బరికాయని గుళ్లో కొట్టడం - మంచి పత్రికని కొనకుండా చదవడం - రెండూ ఒకటే!**

**సో, చెక్ పంపిస్తున్నాను. అఫీషియల్ సబ్‌స్క్రైబర్ హోదాలో 'హాసా'న్ని డిమాండ్ చేస్తున్నాను.**

**-ఆత్మీయంగా**

**అజయ్‌శాంతి, హెడ్ ఆఫ్ ద స్టోరీ డిపార్ట్‌మెంట్, రామోజీఫిల్మ్‌సిటీ, ఉషాకిరణ్ మూవీస్ లిమిటెడ్, హైదరాబాద్.**

ప్రస్తుతం మీరు "బి" అక్షరముతో మొదలయ్యే సినిమా పాటలను ప్రచురిస్తున్నారు. ఇప్పటి వరకూ మీరు ప్రచురించని "ఎ" అక్షరముతో మొదలయ్యే సినిమాలు సుమారు 180 వరకూ పాటల పూర్తి వివరములతో మా వద్దనున్నాయి. పంపితే ప్రచురిస్తారా?

**-అమ్మూరి సూర్యారావు, విశాఖపట్నం.**

**(తప్పకుండా ప్రచురిస్తాం - ఎడిటర్)**

ఆబాల గోపాల వరప్రసాదం
ఈ అలోక ఆనంద దివ్య హాసం
నీటి చుక్కకు, అక్షరం ముక్కకు
కరువౌతున్న తెలుగు గడ్డపై
ఆనందామృత వర్షాన్ని చిలకరిస్తున్న
మీకు మిత్ర బృందానికీ-
సకల శ్రేయస్సులు కలగాలని
మనసా పితృపాదాల స్మరిస్తూ
నూతన సంవత్సర శుభాకాంక్షలను
అందజేస్తున్నాను.

**-మల్లాది నరసింహశాస్త్రి,హైద్రాబాద్.**

పాత నుండి కొత్త వరకు మెలొడీకి సంబంధించి నంత వరకూ - సాహిత్యపరంగానూ ఎన్నో మంచి చిత్రాలలోని పాటలను ఆడియో కేసట్లలో సేకరించి భద్రపరుస్తున్న మేము - 'హాసం' స్ఫూర్తితో - తెలుగు - హిందీ చిత్రాలలోని అన్ని మంచి పాటలతో కూడిన ఆడియో కేసట్ల షాపును కూకట్‌పల్లి హౌసింగ్ బోర్డు కాలనీలోని 'బాంక్ అఫ్ మహారాష్ట్ర' ఎదురుగా ఈ మధ్యనే ప్రారంభించాం. షాపుకు వస్తున్న సంగీతాభిమానులకు "హాసం"ను చూసి ఈ షాపు ప్రారంభించామని గర్వంగా చెపుతున్నాం.

ఇక లేటెస్ట్ 'హాసం'లోని "రాఘవేంద్ర" ఆడియోరివ్యూ గురించి - మీరు రాసిన అభిప్రాయాలు ఎంతో చక్కగా ఉన్నాయి. సద్విమర్శ అనేది ఎలా వుండాలో నిజంగా అలాగే వుంది. "ఎక్కడుంది లోపం?" అంటూ మీరు వ్యక్తపరిచిన వాక్యాలు - ఎంతో ఆవేదనతో-నేటి సంగీత పరిశ్రమలోని వారందరూ ఆలోచించుకునేలా ఉన్నాయి. మీ కృషికీ - మీ బాధ్యతకూ మా అభినందనలు!! 'రాఘవేంద్ర' లోని 'బూతులు తిట్టకురా' పాటను మొదటిసారి క్యాసెట్లో విని 'సాహిత్యం' గురించి ఉలిక్కి పడేలా చేసింది. ఒక పాట వింటూ 'నేను విన్నది ఈ మాటేనా' అని ఉలిక్కి పడేలా చేసిన ఘనత కూడా ఈ పాటకే దక్కుతుంది.

**-జి.రంగారావు, హైద్రాబాద్**

ఆ మధ్య 2 సంచికల కిందట 'మిస్టర్ × ఇన్ బొంబే'లోని డ్యూయెట్ మొత్తం ప్రచురించి మాలాంటి అభిమానులకు ఎంతో ఆనందం కలిగించారు. నిజానికి లతా-కిషోర్ పాడిన ఈ డ్యూయెట్ (బహుశా 1964 కావచ్చు కదా) ఈ నాటికీ ఏనాటికీ ఎంతో హుషారుగా ఉంటుంది. ఈ పాట వింటున్నప్పుడల్లా - 'సాహిత్యం' గురించి ఏ మాత్రం తెలియకపోయినా -'గైడ్' లోని 'గాతారహే మేరా దిల్ కంటే కూడా నాకెంతో నచ్చుతుందీపాట.

'కిషోర్' గురించి ఎన్నో విషయాలు తెలుసు కుంటున్నాం. ఈ సీరియల్ రాస్తున్న వారికి మా అభినందనలు చెప్పండి. ఏదో వరుసగా చదువుతున్నట్లుగా కాక - ఆయన గురించి ఎన్నో విషయాలు, విశేషాలు ఎవరో ఎదురుగా ఉండి 'ఆసక్తికరంగా' చెపుతున్నట్లుగా ఈ సీరియల్ ఉంటున్నది. రచనా వ్యాసంగంలో ఇదో రకమైన ప్రత్యేకతేనని అనుకుంటున్నాను.

**-జి.విమల,హైదరాబాద్**

# తెలుగు సినీ గీత కోశం

| నెం. | పాట | చిత్రం పేరు | సం|| | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 322 | బ్రహ్మదేవ శుభ భాగ్య విధాత | భీష్మ | 1962 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | ఘంటసాల, సుశీల |
| 323 | చేసిన కర్మయే | భీష్మ | 1962 | ఎస్.రాజేశ్వరరావు | భారతం | పి.బి.శ్రీనివాస్, ఆకుల |
| 324 | భావి భారత | భీష్మ | 1962 | ఎస్.రాజేశ్వరరావు | - | ఆకుల |
| 325 | దేవ దేవ (పద్యం) | భీష్మ | 1962 | ఎస్.రాజేశ్వరరావు | భారతం | ఘంటసాల, |
| 326 | దురాశచే (తెలియగలేరే) | భీష్మ | 1962 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | ఘంటసాల |
| 327 | హైలో హైలేసా | భీష్మ | 1962 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | జమునారాణి |
| 328 | జో జో జోల | భీష్మ | 1962 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | సుశీల |
| 329 | కుప్పించి ఎగిసిన (పద్యం) | భీష్మ | 1962 | ఎస్.రాజేశ్వరరావు | భాగవతం | ఘంటసాల |
| 330 | మహాదేవ శంభో | భీష్మ | 1962 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | సుశీల |
| 331 | మనసులోని కోరిక | భీష్మ | 1962 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | పి.బి.శ్రీనివాస్, సుశీల |
| 332 | నా జన్మంబు తరింప (పద్యం) | భీష్మ | 1962 | ఎస్.రాజేశ్వరరావు | --- | ఘంటసాల |
| 333 | నన్ను నెవ్వానిగ (పద్యం) | భీష్మ | 1962 | ఎస్.రాజేశ్వరరావు | భారతము | పి.బి.శ్రీనివాస్ |
| 334 | నీ రాధను నేనే | భీష్మ | 1962 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | సుశీల, ఎస్.జానకి |
| 335 | పోరు నష్టంబు (పద్యం) | భీష్మ | 1962 | ఎస్.రాజేశ్వరరావు | భారతము | పి.బి.శ్రీనివాస్ |
| 336 | సమరమటంచు (పద్యం) | భీష్మ | 1962 | ఎస్.రాజేశ్వరరావు | --- | పి.బి.శ్రీనివాస్ |
| 337 | తెలియగలేరే నీ లీలలు | భీష్మ | 1962 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | ఘంటసాల |
| 338 | ఏమనువారు (పద్యం) | భీష్మ | 1962 | ఎస్.రాజేశ్వరరావు | భారతము | మాధవపెద్ది |
| 339 | బావా! కర్ణుడె (పద్యం) | భీష్మ | 1962 | ఎస్.రాజేశ్వరరావు | ---- | పి.బి.శ్రీనివాస్ |
| 340 | పాండవులును కుంతి(పద్యం) | భీష్మ | 1962 | ఎస్.రాజేశ్వరరావు | ---- | పి.బి.శ్రీనివాస్ |
| 341 | ఆడవే ఆడవే గుర్రమా | భూలోకంలో యమలోకం | 1966 | ఎస్.పి.కోదండపాణి | కొసరాజు | మాధవపెద్ది, పట్టాభి |
| 342 | అడగవే జాబిల్లి అడగవే | భూలోకంలో యమలోకం | 1966 | ఎస్.పి.కోదండపాణి | దాశరథి | ఘంటసాల, ఎస్.జానకి |
| 343 | గున్నమావి తోటుంది | భూలోకంలో యమలోకం | 1966 | ఎస్.పి.కోదండపాణి | సి.నారాయణరెడ్డి | ఎస్.జానకి |
| 344 | ఓ మీసమున్న మొనగాడ | భూలోకంలో యమలోకం | 1966 | ఎస్.పి.కోదండపాణి | దాశరథి | ఘంటసాల, ఎస్.జానకి |
| 345 | రారా నేనేరా నీ కల్పనలో | భూలోకంలో యమలోకం | 1966 | ఎస్.పి.కోదండపాణి | జి. కృష్ణమూర్తి | పి.బి.శ్రీనివాస్, సుశీల |
| 346 | ఏదో వింత పులకింత | భూలోకంలో యమలోకం | 1966 | ఎస్.పి.కోదండపాణి | సి.నారాయణరెడ్డి | ఎస్.జానకి |
| 347 | చల్లని నీ దయ జల్లవయ్యా | బికారి రాముడు | 1961 | బి.గోపాలం | పి.పద్మరాజు | ఘంటసాల, శ్రీరంగం గోపాలరత్నం |
| 348 | నిదురమ్మా | బికారి రాముడు | 1961 | బి.గోపాలం | పి.పద్మరాజు | ఎస్.గోపాలరత్నం |
| 349 | రంగేళి లీలల నా రాజా | బికారి రాముడు | 1961 | బి.గోపాలం | మల్లాది | ఎస్.జానకి |
| 350 | వాడెనే చెలి వాడెనే | బికారి రాముడు | 1961 | బి.గోపాలం | పి.పద్మరాజు | సుశీల |
| 351 | ఏ పాపమెరుగని పసిపాప | బికారి రాముడు | 1961 | బి.గోపాలం | పి.పద్మరాజు | ఘంటసాల, శ్రీరంగం గోపాలరత్నం |
| 352 | ఎచటనుండి వచ్చేవో | బికారి రాముడు | 1961 | బి.గోపాలం | పి.పద్మరాజు | శ్రీరంగం గోపాలరత్నం |
| 353 | ఈ దినం నా మనము | బికారి రాముడు | 1961 | బి.గోపాలం | పి.పద్మరాజు | ఎస్.జానకి |
| 354 | ఇదేమి లోకం గురు | బికారి రాముడు | 1961 | బి.గోపాలం | ఆరుద్ర | బి.గోపాలం |
| 355 | అల్లరి పెడతారే పిల్లా | బుద్ధిమంతుడు | 1969 | కె.వి.మహదేవన్ | కొసరాజు | పిఠాపురం, స్వర్ణలత |
| 356 | బడిలో ఏముంది గుడిలోనేవుంది | బుద్ధిమంతుడు | 1969 | కె.వి.మహదేవన్ | కొసరాజు | ఘంటసాల |
| 357 | భూమ్మీద సుఖపడితే | బుద్ధిమంతుడు | 1969 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | ఘంటసాల |
| 358 | గుట్టమీద గువ్వ కూసింది | బుద్ధిమంతుడు | 1969 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | ఘంటసాల, సుశీల |
| 359 | హవ్వారే హవ్వా హైలెస్సో | బుద్ధిమంతుడు | 1969 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | ఘంటసాల |
| 360 | నను పాలింపగ నడిచి వచ్చితివా | బుద్ధిమంతుడు | 1969 | కె.వి.మహదేవన్ | దాశరథి | ఘంటసాల |
| 361 | టాటా వీడుకోలు | బుద్ధిమంతుడు | 1969 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | ఘంటసాల |
| 362 | తోటలోకి రాకురా | బుద్ధిమంతుడు | 1969 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 363 | అమ్మ బాబో అబ్బ సోకుమాడ | చలాకీ రాణి కిలాడీ రాజా | 1971 | సత్యం | వేటూరి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 364 | భలే కుర్రదాన | చలాకీ రాణి కిలాడీ రాజా | 1971 | సత్యం | దాశరథి | ఎస్.పి.బాలు |
| 365 | బుల్లి మామ మళ్ళీ వస్తావా | చలాకీ రాణి కిలాడీ రాజా | 1971 | సత్యం | కొసరాజు | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 366 | జతగాడ ఇటురారా | చలాకీ రాణి కిలాడీ రాజా | 1971 | సత్యం | కొసరాజు | ఎల్.ఆర్.ఈశ్వరి |

# తెలుగు సినీ గీత కోశం

| నెం. | పాట | చిత్రం పేరు | సం|| | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 367 | వస్తావా వయ్యారముంది | చలాకి రాణీ కిలాడి రాజా | 1971 | సత్యం | ఆరుద్ర | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 368 | భయ ఇస్కిందరే | చాణక్య చంద్రగుప్త | 1977 | పెండ్యాల | సి.నారాయణరెడ్డి | వాణిజయరాం, కోరస్ |
| 369 | చిరు నవ్వుల తొలకరిలో | చాణక్య చంద్రగుప్త | 1977 | పెండ్యాల | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 370 | ఒకటా రెండా తొమ్మిది | చాణక్య చంద్రగుప్త | 1977 | పెండ్యాల | సి.నారాయణరెడ్డి | ఎస్.జానకి |
| 371 | సిరి సిరి సిన్నోడ | చాణక్య చంద్రగుప్త | 1977 | పెండ్యాల | సి.నారాయణరెడ్డి | వాణిజయరాం |
| 372 | ఎవరో ఆ చంద్రుడెవరో | చాణక్య చంద్రగుప్త | 1977 | పెండ్యాల | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 373 | ఇది తొలి రేయి | చాణక్య చంద్రగుప్త | 1977 | పెండ్యాల | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 374 | బూరి బుగ్గల | చిరంజీవి | 1969 | టి.చలపతిరావు | కొసరాజు | జయదేవ్ |
| 375 | చల్లని గాలి | చిరంజీవి | 1969 | టి.చలపతిరావు | సి.నారాయణరెడ్డి | పి.సుశీల |
| 376 | జీవితమెంతో తియ్యనది | చిరంజీవి | 1969 | టి.చలపతిరావు | గోపి | ఎస్.పి బాలు |
| 377 | నడుము ఉందో లేదో | చిరంజీవి | 1969 | టి.చలపతిరావు | ఆరుద్ర | జయదేవ్, ఎస్.జానకి |
| 378 | అడగాలి అడగాలిఅడిగేదెవరో | చిట్టి తమ్ముడు | 1962 | పెండ్యాల | ఆరుద్ర | సుశీల, ఎస్.జానకి |
| 379 | అయ్యో రామ లంబారాస్తా | చిట్టి తమ్ముడు | 1962 | పెండ్యాల | ఆరుద్ర | మాధవపెద్ది, స్వర్ణలత |
| 380 | దిక్కులేనివారికి దేముడే దిక్కు | చిట్టి తమ్ముడు | 1962 | పెండ్యాల | ఆరుద్ర | సుశీల |
| 381 | మాయాబజార్ లోకం | చిట్టి తమ్ముడు | 1962 | పెండ్యాల | ఆరుద్ర | సుశీల |
| 382 | మెరుపు మెరిసిందోయ్ మావ | చిట్టి తమ్ముడు | 1962 | పెండ్యాల | ఆరుద్ర | సుశీల |
| 383 | నీవూ నేనూ జాబిలీ | చిట్టి తమ్ముడు | 1962 | పెండ్యాల | ఆరుద్ర | ఘంటసాల, సుశీల |
| 384 | ఏస్కో నా రాజా ఏస్కో | చిట్టి తమ్ముడు | 1962 | పెండ్యాల | ఆరుద్ర | సుశీల, మద్దాలి |
| 385 | ఆడవా ఆట ఆడవా | చుట్టరికాలు | 1968 | ఘంటసాల | కొసరాజు | సుశీల, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 386 | గాలి వీచెను అలలు లేచెను | చుట్టరికాలు | 1968 | ఘంటసాల | దాశరథి | ఘంటసాల, కోరస్ |
| 387 | నీవే నా కనులలో | చుట్టరికాలు | 1968 | ఘంటసాల | దాశరథి | ఘంటసాల, సుశీల |
| 388 | ఓ జలతారు పరదాల | చుట్టరికాలు | 1968 | ఘంటసాల | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల |
| 389 | షీలా మాటలు విను | చుట్టరికాలు | 1968 | ఘంటసాల | శ్రీశ్రీ | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 390 | వచ్చిందిరా బాబు వచ్చింది | చుట్టరికాలు | 1968 | ఘంటసాల | కొసరాజు | రాఘవులు, జిక్కి |
| 391 | అనుభవమే ఇపుడైతే | డబ్బాయుడు సుబ్బాయుడు | | బి.గోపాలం | వి.వి.స్వామి | సుశీల, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 392 | నాలో ఏమో కోరికలూరి | డబ్బాయుడు సుబ్బాయుడు | | బి.గోపాలం | వి.వి.స్వామి | సుశీల |
| 393 | వలచె చెలి హృదయం | డబ్బాయుడు సుబ్బాయుడు | | బి.గోపాలం | వి.వి.స్వామి | పి.బి.శ్రీనివాస్, సుశీల |
| 394 | ఎందుకే చిన్నదాన | డబ్బాయుడు సుబ్బాయుడు | | బి.గోపాలం | వి.వి.స్వామి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 395 | అడగక ఇచ్చిన ముద్దే ముద్దు | దాగుడు మూతలు | 1964 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఘంటసాల, సుశీల |
| 396 | అందలం ఎక్కాడమ్మా | దాగుడు మూతలు | 1964 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఘంటసాల, సుశీల |
| 397 | దేవుడనేవాడున్నాడా అని మనిషికి | దాగుడు మూతలు | 1964 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఘంటసాల, సుశీల |
| 398 | డిప్పీ డిప్పీ డివ్విట్టం | దాగుడు మూతలు | 1964 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | పిఠాపురం, స్వర్ణలత |
| 399 | గోరొంక గూటికే చేరావు చిలక | దాగుడు మూతలు | 1964 | కె.వి.మహదేవన్ | దాశరథి | ఘంటసాల |
| 400 | గోరింకకెందుకో కొండంత అలక | దాగుడు మూతలు | 1964 | కె.వి.మహదేవన్ | దాశరథి | సుశీల |
| 401 | మెల్ల మెల్ల మెల్లగా | దాగుడు మూతలు | 1964 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఘంటసాల, సుశీల |
| 402 | ఎంకొచ్చిందోయ్ మామ | దాగుడు మూతలు | 1964 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | సుశీల |

**సేకరణ: పున్నమరాజు శేషగిరిరావు, విశాఖపట్నం.**

వచ్చే సంచికలో మరికొన్ని

1-15 ఏప్రిల్ హాసం సినీ గీతకోశంలో నం.275 పాట "వేయకురా చిందులు" అని వ్రాశారు. కాని "చిందులు వేయకురా" అని పాటలో వస్తుంది. అలాగే నెం. 270లో "పూజకు వేళాయెరా" అనే పాటలో సుశీలతో పాటు చివరిలో ఘంటసాల గారు పాడే చరణాలు వుంటాయి. సీరియల్ నెంబర్లు 270 నుంచి 275 వరకు తిరిగి 267 నుంచి 293 వరకు 294 కి 394 అని మొదలు అయింది.

-ఎస్. సూర్యనారాయణ, హైద్రాబాద్.

మార్చి 16-31 2003 సంచికలో "తెలుగు సినీ గీతకోశం"లో "బంగారు తల్లి" (1971) సినిమాలో పాటలు యిచ్చారు. అందులో మరో పాట వుంది "వెళ్ళిపోతారా" అంటూ పి. సుశీల పాడిన విషాద గీతం అది. ఈ పాటకు రచన ఆత్రేయ.

"భలే అల్లుడు" (1971) చిత్రంలో కొసరాజు రాసిన "జంతర్ మంతర్" పాటకు యస్.పి.బాలుతో బాటు రమణ, రుక్మిణి కూడా పాడారు.

అమ్మూరి సూర్యారావు, విశాఖపట్నం.

# అంతేరా... బామ్మర్ది

ఆదివిష్ణు



### జరిగిన కథ

భాగ్యనగరంలోని ప్రముఖ పారిశ్రామికవేత్త బసవరాజు, జానకిల కూతురు ఉమ. కొడుకు మురళి మనీ పర్సు గురించి తండ్రికి భారీగా లెక్చరిస్తాడు. అదే సమయంలో ఉమ తండ్రి వద్దకు తన ఫ్రెండ్ వనజ పెళ్ళికి వెళ్ళడానికి పర్మిషన్ అడుగుతుంది.

(ఇక చదవండి)

బసవరాజుగారి మేడ!

పూజగదిలో -

జానకి పూజ పూర్తి చేసుకుంది. జానకీ... జానకీ అంటూ ఆర్తనాదం చేస్తున్న భర్తకి ఏమి అవసరమయ్యిందోనని - గది బయటకు వచ్చి అడిగింది -

"ఎందుకు అరుస్తున్నారు? ఏమైంది?"

"ఏమైందా? వనజ పెళ్ళవుతోంది!"

"మంచిదేగా? ఆ మాట అరిచి చెప్పాలా చోద్యం కాకపోతే?"

"చోద్యం కాదే! నీ కూతురి పెళ్లెప్పుడు చేస్తావని అడుగుతున్నాను! అచ్చెప్పు నాకు!"

"దాని పెళ్లికేం తొందర?"

ఆ మాట వినగానే బసవరాజు ఉగ్రుడయ్యేడు. అంచేత తారస్థాయిలో గొంతు పెంచేడు -

"అంతేనే! అంతే! వనజా వాళ్ళు తొందరపడి పెళ్ళిళ్లు చేసేసు కుంటారు. మనం మన అమ్మాయికి మాత్రం - తొందర పడకుండా.. తాపీగా.. పదీ పదిహేనేళ్ళు ఆగి.. ఆ తర్వాత చేద్దాం! అంతేనా?"

అప్పటికి అక్కడికి ఉమ కూడా వచ్చేసింది. ఉమని చూడగానే తల్లికి కోపమొచ్చింది. అంచేత ఉమతో కోపంగానే అన్నది -

"ఏమే! వనజ పెళ్ళి గురించి నాన్నగార్తో ఎందుకు చెప్పేవ్?"

"ఆ పెళ్ళికి వెళ్ళాలి కదా! పర్మిషను-"

"పర్మిషనా! నేను వెళ్ళమని చెప్పేనుగా! మళ్ళా ఆయన్నెందుకు అడగడం?"

ఆ మాట వినగానే బసవరాజు తట్టుకోలేకపోయేడు. తననొక ఆఫ్టరాల్ పెద్ద మనిషిగా జానకి భావిస్తోందని అర్థం చేసుకున్నాడు.

ఇల్లాంటి సందర్భాల్లో తెలివైన భర్త ఎట్లా రియాక్టవుతాడో, ఏం చేస్తాడో 'సంసారం... సంసారం' పుస్తకంలో చెప్పేవుంటారు!

ఆ పుస్తకం తనకి అందుబాటులో లేని కారణంగా సొంత బాణీ ఉపయోగిస్తూ అరిచేడు-

"అంటే? ఆడపిల్ల... అందునా పెళ్ళి కావల్సిన పిల్ల.. తండ్రిని సంప్రదించకుండా.. పర్మిషన్లవీ పొందకుండా.. ఇష్టమొచ్చినట్టు విహారయాత్రలు చేయమని నీకూతురికి సలహాయిస్తున్నావా? అచ్చెప్పునాకు!"

విహారయాత్రలనే మాట వినగానే జానక్కి కూడా రోషం తన్నుకు వచ్చేసింది! గట్టిగా అరవక పోయినా కొంచెం మంటగానే చెప్పింది-

"అదేమి విహార యాత్రలకు వెళ్ళడం లేదు. పెళ్ళికి - ఫ్రెండు పెళ్ళికి వెడుతోంది! అంతేగా?"

"నో! నాకిష్టం లేదు!"

"పెళ్ళికి వెళ్ళడం కూడా తప్పేనా?"

"తప్పే! నా దృష్టిలో తప్పే! తనకి పెళ్ళి కాకుండా - తన ఈడు పిల్ల పెళ్ళికి వెళ్ళడం తప్పున్నర తప్పు! ఈ విషయం సంసారం.. సంసారంలో చెప్పేవుంటారు. ముందు ఉమకి పెళ్ళి చెయ్యాలి! ఆ తర్వాతనే పెళ్ళిళ్ళకు పంపించాలి!"

"బాగానే వుంది చోద్యం! ఉమకి పెళ్ళి చేయాలంటే మంచి సంబంధం దొరకాలి! అల్లాంటి సంబంధం ఇప్పటికిప్పుడు ఎక్కడ దొరుకుతుంది?"

"ఎందుకు దొరకదు! తప్పకుండా దొరుకుతుంది! ఉమకి ఏమి తక్కువని? వెతకాలే గాని - బోలెడు సంబంధాలు! ఎవరో యోగ్యుడు రెడీగానే వుండి వుంటాడు! ఈ విషయమై అర్జంటుగా మీ అన్నకి ఉత్తరం రాయి - ఉత్తరాలూ టెలిగ్రామ్‌లూ వద్దులే! ఫోన్లో మాటాడు. అతను కూడా నీకు మల్లే - ఉమకి అప్పుడే పెళ్ళా అని ఆక్రందన చేస్తే - నాతో మాటాడమను!"

అని జానకి మాట వినిపించుకోకుండానే "రంగా... రంగా..." అంటూ కారుడ్రైవర్ని పిలుస్తూ ఇంట్లోంచి బయటపడుతున్నాడు!

తల్లీ కూతుళ్ళిద్దరూ మొహమొహాలు చూసుకుంటున్నారు!

- విషయం వరాన్వేషణ వేపు మళ్ళింది కనక - ఈ కథ కూడా వరుడ్ని పరిచయం చేయడానికి సిద్ధపడింది!

అతని పేరు వేణు!

అతను చాలా అందంగా వున్నాడు!

గొప్ప దర్జాగా వున్నాడు!

ఎంతో ఠీవీగా వున్నాడు!

ప్రస్తుతం వేణు ఆ రైల్లో టూ టైర్ ఏ.సి.లో ప్రయాణం చేస్తున్నాడు. కాఫీ తాగడం పూర్తి చేసేడు. డబ్బులిచ్చేందుకు పర్సు తీసేడు!

ఆ పర్సులోంచి పదినోటు లాగబోతుంటే - పర్సులో వున్న ఉమ ఫోటో కనిపించింది!

పదినోటు కాఫీ మనిషికిచ్చి ఉమ ఫోటోని చూసుకుంటో మురిసిపోతున్నాడు!

ఉమ!

అందమైన పేరు. ఆ పేరతనికిష్టం.

ఆ పేరు పెట్టుకున్న ఉమ ఎంతో యిష్టం!

పెళ్ళంటూ చేసుకుంటే -ఈ భూలోకంలో ఒక్క ఉమనే చేసుకుంటానని అద్దమ్ముందు నిలబడి ప్రతిరోజూ ప్రతిజ్ఞ చేయడం కూడా చాలా చాలా యిష్టం!

ఇన్ని ఇష్టాలతో పాటు - జానకిరాం బుక్‌హవుసిష్టం!

జనవరి ఇరవై అయిదిష్టం!

మిగతా యిష్టాల గురించి వివరించి చెప్పకపోయినా ఫర్లేదు గానీ - జానకిరాం బుక్ హవుసూ, జనవరి ఇరవై అయిదూ ఎందుకిష్టమో చెప్పకపోతే - ఆ రెండూ 'యిష్టాల లిస్టు'లో ఎందుకు చేరేయో తెలీకుండా పోతుంది!

వేణుకి కొందరు తెలుగు రచయితల పట్ల గౌరవమున్నట్టే - ఇంగ్లీషు రచయిత ఉడ్‌హవుస్ పట్ల అపారమైన అభిమానముంది!

అంచేత అతను ఉడ్‌హవుస్ రచనలను ఆణిముత్యాల్లాగా భావిస్తాడు! చదివిన పుస్తకమే మళ్ళామళ్ళా చదివి మళ్ళా మళ్ళా మురిసి పోతుంటాడు!

ఈ నేపథ్యంలో-

అతను భద్రంగా దాచుకున్న ఉడ్‌హవుస్ నవల! 'మనీ ఇన్ ది బేంక్' మిస్సయింది! ఎక్కడ మిస్సయిందో ఎట్లా మిస్సయ్యిందో తెలీడం లేదు!

ఆ నవల మిస్సయిందని తెలీగానే వేణు విలవిల్లాడి పోయేడు. 'మనీ ఇన్ ది బేంక్' మిస్సవ్వగానే -

తన దగ్గిరున్న బంగారు నిధిని కాకులెత్తుకుపోయినట్టు భావించి తట్టుకోలేకపోయేడు!

అర్జంటుగా ఆ పుస్తకం తన బుక్‌షెల్ఫ్‌లో చేరకపోతే - తనకి పిచ్చెక్కే ప్రమాదముందని గ్రహించేడు!

అంచేత ఆ పుస్తకం కొనుక్కునేందుకు అతను జానకిరాం బుక్ హవుస్‌కి పరుగెత్తేడు!

అతను ఆ బుక్ హవుస్‌లో అడుగు పెడుతూనే ఉమని చూసేడు.

ఉమని చూడగానే అతని మనసున మల్లెల మాలలూగేయి!

ఆమె అందానికి ముగ్ధుడయ్యేడు!

'ఓహో అందమా! ఇదా నీ చిరునామా?' అని గొణుక్కున్నాడు!

ఉమ గొడవలో పడి అంత పెద్ద ఉడ్‌హవుస్‌నీ ఆ కాసేపు మరచిపోయేడు!

"ఏంకావాలి సార్?" షాపతను అడిగేడు.

"అందం!" అన్నాడు వేణు?

ఆ టైటిల్ విని షాపు మనిషి బిక్క మొహం పెట్టేడు!

"రచయిత పేరు?" ఇంకో మనిషి - షాపుమనిషే - అడిగేడు.

"బ్రహ్మ!" అన్నాడు వేణు.

ఆ రచయిత పేరు విని ఇంకో మనిషి కూడా బిక్కమొహం పెట్టేడు!

ఇప్పుడు స్వయంగా షాపు ప్రొప్రయిటరే కలగజేసుకున్నాడు -

"ఆ పుస్తకం గురించి గానీ ఆ రచయిత గురించి గానీ మేము వినలేదు. అంచేత -"

"ఆ మాటకొస్తే క్షణం క్రితం - నేను కూడా మీలాటివాణ్నే! జస్టిప్పుడే తెలుసుకున్నాను!"

"అయ్‌సీ! మా షాపులో దొరకదు. మరోచోట వెతకండి!"

అప్పటిగ్గాని వేణు తేరుకోలేదు.

దొరకని పుస్తకం కోసం ఇంకోషాపుకి వెళ్ళిపోతే - ఇక్కడ దొరికిన అందాల రాశి మిస్సయిపోతుందనే బెంగతో - 'మనీ ఇన్ ది బేంక్' కావాలని చెప్పేడు!

సరిగ్గా ఆ పుస్తకం వెతికే పనిమీద ఒక మనిషి బిజీగా వున్నాడని

షాపు ప్రొప్రయిటరు చెప్పేడు.

"దొరికింది!" అని అరిచేడు ఆ పుస్తకాన్ని వెతికే మనిషి.

"థేంక్స్!" అన్నాడు వేణు.

"ఎందుకు థేంక్స్?" అడిగేడు షాపు మనిషి.

"ఆ పుస్తకం కోసమే వచ్చేను!" అన్నాడు వేణు

"ఒక్క కాపీయే వుంది!"

"నాకు కావల్సింది కూడా ఒక్క కాపీనే!"

"మీ కంటెముందు మేడం గారు అడిగేరు!" అంటూ షాపు మనిషి ఆ పుస్తకాన్ని ఉమకి యిచ్చేడు.

ఉమ ఆ పుస్తకం తీసుకుంటూ వేణుని ఉద్దేశించి అన్నది -

"నాకిష్టమైన పుస్తకం!"

"నేనూ మీటైపే! నాదీ మీ టేస్టే!" అన్నాడు వేణు.

"ఉడ్‌హవుస్ రాసిన 'కేరీ ఆన్ జీవ్స్' చదివేరా?"

"జీవ్స్ సిరీస్ అన్నీ చదివేను. మీ చేతిలో వున్న మనీ ఇన్ ది బేంక్ కూడా చదివేను!"

"అయ్‌సీ!"

"కాకపోతే - అన్‌ఫార్చునేట్లీ - ఆ పుస్తకం మిస్సయ్యింది!"

"చదివేసేరు గదా! మిస్సయినా ఫర్లేదు లెండి!"

"ఉడ్‌హవుస్ పుస్తకాల్ని నేను ఒకటికి పదిసార్లు - పదే పదే చదువుతాను!"

"వండ్రఫుల్! నేనూ మీ టైపే!" అకస్మాత్తుగా అనేసింది ఉమ.

ఆ తర్వాత సర్దుకుని అన్నది -

"నేను కూడా 'మనీ యిన్ ది బేంక్' - అయిదారుసార్లు చదివేను. విమల ముచ్చటపడి అడిగితే యిచ్చేను!"

"విమల ఎవరు?"

"నా క్లాసుమేటు. ఈ మధ్యనే విమలకి పెళ్లయింది. అత్తవారింటికి ఆ పుస్తకాన్ని వెంటబెట్టుకుపోయింది. అంచేత కొత్త పుస్తకం కొనుక్కుందామని వచ్చేను."

"చాలా మంచి విషయాలు చెప్పేరు! ఉడ్‌హవుస్ పుణ్యమాని.."

ఏం చెప్పాలో తోచక ఆగిపోయేడు.

వీళ్ల వరసని షాపులో ఉన్న వాళ్లంతా విడ్డూరంగా గమనిస్తున్నారు!

వాళ్లు తమని గమనిస్తున్నారని ఉమ కూడా గమనించింది!

ఉమ గమనించినట్టు వేణు గమనించని కారణంగా - ఉడ్‌హవుస్ పుణ్యమాని అనే మాటని పూర్తి చేసే ప్రయత్నంలో మినీ ఉపన్యాసమే ప్రారంభించేడు-

"ఆ మహనీయుడి జ్ఞాపకార్థం - 'ఉడ్‌హవుస్ హవుస్' అనే పేరుతో చిన్న సైజు లైబ్రరీ స్టార్ట్ చేయాలనుకుంటున్నాను. అందులో అన్నీ ఉడ్‌హవుస్ పుస్తకాలే వుంటాయి! వారానికో రోజు సభ్యులంతా ఉడ్‌హవుస్ హవుస్‌లోనే సమావేశమవుతారు. ఉడ్‌హవుస్ ప్రతిభ గురించి తలొకరు తలొక కోణం తీసుకుని మాటాడుతారు. ఇంత అందమైన కార్యక్రమానికి అందమైన మీ చేయూత చాలా అవసరం! అంచేత -"

అతని మాటలకి అడ్డం పడింది ఉమ.

"ఈ విషయాలన్నీ మరో తడవ ముచ్చటించుకుందాం. సెలవిప్పించండి!"

అంత త్వరగా సెలవడగడం వేణుకిష్టం లేకపోయినా - మరో తడవ అనే ఛాన్సుని స్వయంగా ఉమే యివ్వడం వల్ల - వేణు అపారంగా ఆనందిస్తూ తన విజిటింగ్ కార్డు ఆమెకిస్తూ -

"ఉడ్‌హవుస్ అభిమానులం గదా! నా కార్డు మీ దగ్గిరుండటం ధర్మం! ఇప్పట్నుంచీ మనం మంచి ఫ్రెండ్సన్నమాట!"

- ఈ గొడవ జానకిరాం బుక్ హవుస్‌లో జరిగింది గనక - అక్కడే ఉమని చూసి మనసు పారేసుకున్నాడు గనక - సదరు బుక్‌హవుస్‌ని అతను ఉడ్'హవుస్'గా భావించి బాగా యిష్టపడుతుంటాడు!

ఎంతో మధురమైన మనోహరమైన ఈ సంఘటన జనవరి ఇరవై అయిదున జరిగింది గనక - అతను ఆ తేదీ మీద వల్లమాలిన స్థాయిలో యిష్టం పెంచుకున్నాడు!

ఏతావాతా - కేవలం ఉడ్‌హవుస్ పుణ్యమాని - వేణు, ఉమల పరిచయం దినదినాభివృద్ధి చెందింది!

మొదట్లో వాళ్ళిద్దరూ ఉడ్‌హవుస్ గురించి మాత్రమే మాటాడుకునేవారు.

రానురాను తమ గురించి కూడా మాటాడుకోవడం ప్రారంభించేరు!

తత్ఫలితంగా ప్రేమలో పడిపోయేరు!

ఇక కథలోకి..

వేణు ఎక్కిన రైలు హైదరాబాదు వేపు పరుగెడుతోంది!

★ ★ ★

అది ఖరీదైన కారు!

అది ఖరీదైన రోడ్డు మీద పరుగెడుతోంది!

ఖరీదైన రోడ్లు రాష్ట్రమంతటా వున్నాయంటే ఎవరూ నమ్మరు!

హైదరాబాద్‌లో కొన్ని రోడ్లు ఖరీదుగా వుంటాయని చెబితే కాబోసనుకుంటారు!

కాబోసనుకునే రోడ్లలో అదొకటన్నమాట!

కారు ఆ రోడ్డు మీద పరుగెడుతోంది!

ఆ కార్లో బసవరాజున్నాడు. అతను కార్లో వున్నా - అతని మనసంతా ఉమ మీద వున్నది!

ఉమని పెళ్లికి వెళ్ళొద్దని చెప్పడం సబబా కాదా అని ఆలోచిస్తున్నాడు!

క్షణం సేపు సబబనిపిస్తోంది. క్షణం తర్వాత కాదనిపిస్తోంది.

అవునూ కాదనే సమయాల్లో అతను బొమ్మా బొరుసు మీద ఆధారపడతాడు. ఈ అలవాటు అతనికి పాతికేళ్ల క్రితం తగులుకుంది!

పాతికేళ్ళ క్రితం -

బసవరాజు జానకిని పెళ్ళాడే ముందు - ఈపెళ్ళి తన జీవితాన్ని సుఖమయం చేస్తుందో, ముదనష్టం చేస్తుందో తెలుసుకుందామని - జేబులోంచి రూపాయి బిళ్ళని తీసుకున్నాడు!

బొమ్మ పడితే సుఖమయం - బొరుసు పడితే ముదనష్టం అనుకుని టాస్ వేసేడు!

బొమ్మ పడింది!

జానకిని పెళ్ళాడటానికి గల అనేకమైన కారణాల్లో - బొమ్మ పడటం ముఖ్యమైన కారణంగా చెప్పుకుంటాడు!

ఆనాడు బొమ్మ పడింది గనక తన వైవాహిక జీవితం సుఖమయంగా నడుస్తోందని యిప్పటికీ అనుకుంటూ వుంటాడు!

అంచేత -

ఉమని పెళ్ళికి పంపించడమనే కార్యక్రమాన్ని బొమ్మ బొరుసుతో ముడిపెట్టి టాస్ వేసేడు!

బొమ్మే పడింది!

అందుచేత ఉమని పెళ్లికి పంపించడం ఉచితంగా వుంటుందని భావించేడు!

కారు బసవరాజు అండ్ కంపెనీ ముందు ఆగింది!

బసవరాజు కారు దిగేడు. దిగీ దిగంగానే డ్రైవర్తో అంటున్నాడు-

"రంగా! కారుని ఇంటికి తీసుకెళ్లు. ఉమని ఈ కార్లోనే పెళ్లికి తీసుకెళ్లు!"

ఆ మాటకి రంగడు ఆనందిస్తూ అన్నాడు -

"చిత్తం! ఈ ముక్క యింట్లోనే చెప్పి వుంటే బావుండేదేమో నండయ!"

"సలహాలొద్దు! చెప్పింది చెయ్యి! ఉమని జాగ్రత్తగా తీసుకెళ్లు!"

"చిత్తం! మల్లెపూవు మాదిరి తీసుకెళ్లి - మందార పువ్వు మాదిరి తీసుకొస్తానండయ!"

"వద్దు!"

"చిత్తం?"

"ఉమని ఉమ లాగానే తీసుకెళ్లి - ఉమ లాగానే తీసుకురా!"

అని బసవరాజు ఆఫీసులోకి వెళ్లిపోతున్నాడు. డ్రైవరు కారు స్టార్టు చేసేడు.

బసవరాజు ఆఫీసు ప్రవేశం చేస్తుండగా-

అక్కడ సిబ్బంది యావన్మందీ గౌరవ సూచకంగా లేచి నిలబడుతున్నారు. వాళ్లందర్నీ ఓరకంట చూస్తూ బసవరాజు 'ప్రొప్రటయిర్' అని బోర్డు తగిలించి వున్న గదిలోకి వెళ్ళిపోతున్నాడు!

(ఇంకావుంది)

# రాజా ఆడియో రివ్యూ




**విడుదల : సోహాన్**
**వెల : రూ.38/-**

హీరో శ్రీకాంత్, హాస్యనటుడు సునీల్ వంటి బిజీ ఆర్టిస్టుల డేట్‌లు చూసే వారి స్నేహితుడు, శ్రేయోభిలాషి అయిన శ్రీ కె.అనిల్‌కుమార్ నిర్మాతగా మారి పి.వి.వి. యస్.యన్.మూర్తి సమర్పణలో శ్రీ క్రియేషన్స్ పతాకంపై నిర్మించిన 'ఒట్టేసి చెబుతున్నా...' సినిమా ఆడియో క్యాసెట్ విడుదలయింది. ఇళయరాజా తర్వాత అంతటి ప్రతిభావంతుడుగా పరిశ్రమలోని వారెందరో భావించే విద్యాసాగర్ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

గోపాల్, శ్రీనిధి పాడిన "ఒట్టేసి చెబుతున్నా వింటున్నావా ఓమైనా నువ్వంటే నేనేనని" పాట సంగీతపరంగా మంచి సత్తా వున్న పాట. కొద్ది పాటి తేడాలతో ఒకేలా వుంటాయనిపించే శుద్ధసావేరి, ఆరభి, సామ రాగాలలోని జీవస్వరాల మిశ్రమాన్ని ఎంత చక్కగా వినియోగించుకున్నారో ఈ పాటలో గమనించ వచ్చు. చంద్రబోస్ సాహిత్యకర్తృత్వం వహించిన ఈ పాట - హాయిగా వుండేటప్పుడు వినదగ్గ పాట, హాయిగా ఉండాలనుకునేటప్పుడు పాడుకోదగ్గపాట!

భువనచంద్ర రాయగా ఉదిత్ నారాయణ్, సుజాత పాడిన 'ఏలో ఏలో ఏలూరోడా' పాట - పక్కా మాస్ మసాలాసాంగ్! ఈ పాట వింటున్నప్పుడు ఈమధ్య హిట్ అయిన కొన్ని సాంగ్స్ కనుక మనకి తడితే - వాటి ఒరిజినల్స్‌కి విద్యాసాగర్ ఆద్యుడని ఇటీవల ఒక పత్రికలో ఆయన ఇచ్చిన ఇంటర్వ్యూ ప్రకారం అనుకోవాలే తప్ప వేరేవిధంగా ఆలోచించకుండా వుంటేనే మంచిది. ఎందుకంటే - చాలా విషయాలని సాధారణ విషయాలుగా పరిగణించాల్సిన రోజులివి.

చంద్రబోస్ రాయగా దేవాశిష్, సుజాత పాడిన 'పదహారేళ్ళ పాపా నీకు ఏదిష్టం' పాట త్వరగా నోటికి పట్టుకునే పాట, యువతను ఆకట్టుకునే పాట! సాహిత్యపరంగా చూసుకుంటే ఈ పాటలో చంద్రబోస్ - తను అల్లుకున్న స్కీమ్‌లో తను పయనించిన విధానాన్ని టేకాఫ్, ట్రావెలింగ్, ల్యాండింగ్‌లుగా విభజించుకుంటే - మూడు చరణాలూ అందుకు చక్కగా ఉపయోగ పడ్డాయి. మణిరత్నం నిర్మించిన 'అమృత' సినిమాలో నందితాదాస్, జెడి చక్రవర్తి మధ్య - ఏటి ఒడ్డున ఇష్టానికి సంబంధించి జరిగే - సంభాషణలోని కొంతభాగం ఈ పాట స్కీమింగ్‌కి ప్రేరణ అయివుండవచ్చునని ఈ సమీక్షకుని వ్యక్తిగతాభిప్రాయం.

వేటూరి రాయగా బాలూ, సాధనసర్గమ్ పాడిన 'వెన్నెల్లో వేనవికాలం' పాటలో సాహిత్యానికే అగ్రతాంబూలం. అనుభవైక వేద్యాలైన వేసవికాలపు వెన్నెల, శీతాకాలపు ఎండ, ప్రేయసి ఒళ్ళో సాయంకాలం వీటిని పల్లవికి జత చేయటం పాటకి ప్లస్ పాయింటు. తొలి కార్తీకం, కసి తాంబూలం, ఏకంగా ఏలే రాజ్యం, ఎదలో పద్యం, ఆశల్లో ఆజ్యం, పెదాల తిమ్మిరి ఇవన్నీ వేటూరి ముద్రను పట్టియిచ్చే ప్రయోగాలు... కాగా... దాహమంతా కళ్ళలో దాగి ప్రేయసిని తాగటం, విరహాల ఏటి కెరటాలు దాటి మరుమల్లెపూల వరదల్లో తేలి ఒడి చేరుకున్న అనుభూతిగా ప్రేమని వర్ణించటం లాంటి ఎక్స్‌ప్రెషన్స్ - ఎన్నాళ్ళయినా వసివాడని వేటూరి 'కలంకారీ తనానికి' నిదర్శనం. ఈ పాటకు జతపడ్డ వరసలోని మెలొడి శ్రోతకు పట్టడానికి కొంచెం టైమ్ పడుతుంది.

వేటూరి రాయగా బాలూ పాడిన 'కన్నతల్లి భూదేవి ఉన్న తండ్రి ఆకాశం' పాట... సిట్యుయేషన్ సాంగ్. కథా గమనం, పాత్ర వ్యక్తిత్వాలు, వాటి ప్రవర్తనా శైలి... వీటన్నిటితో ముడి పెట్టుకుంటూ ఈ పాటని వింటే మరింత ఇంప్రెస్ అవడానికి అవకాశం వుంది. కనులనీరు చిందినా కాటిమంటలారునా/ఎండమావి నీటిలో ఏటి నావ సాగునా/బండరాతి బొమ్మకు ఏ మొక్కులు మొక్కినా/ గుండె వున్న మనిషికి ఏ దిక్కూ లేదురా/ కన్నీరే కాటేసే కర్మ నీకు తప్పునా వంటి వాక్యాలను అందుకు తగ్గట్టుగానే కాకుండా - భవిష్యత్తులో ఎప్పుడైనా, ఎవరైనా సందర్భాన్ని బట్టి కోట్ చేసుకోడానికి పనికొచ్చేట్టుగా కూడా వున్నాయి.

శంకర్ మహదేవన్, సుజాత పాడిన 'బందరు లాంటి బస్తీలో' పాట కూడా మాస్ ఓరియంటెడ్ సాంగే కనుక ట్యూన్ అందుకు తగ్గ హంగులతో రూపుదిద్దుకుంది. ప్రేయసిని పెదాలను పేరంటానికి పిలిచే చిలకగా వర్ణించటంలోనూ ప్రేమ పరిష్వంగపు గాఢతను తెలపటానికి కౌగిళ్ళు గాలికి ఆహారమయ్యాయని అభివ్యక్తీకరించటంలోనూ వేటూరి తన ప్రత్యేకతను మరోసారి ఋజువు చేసుకున్నారు. ■

## మార్కెట్లో ఉన్న కొత్త క్యాసెట్లు




**విడుదల : హెచ్.ఎం.వి.**
**వెల : 80/- (డబుల్ ప్యాక్)**




**విడుదల : హెచ్.ఎం.వి.**
**వెల : 40/-**

# డిసీజ్ ఖర్మ... దట్సాల్...!

సత్యమూర్తి BV



పెళ్ళిచూపుల నాడు 'నిన్నే నమ్మినురా' అనే పాటని వీణమీద అద్భుతంగా వాయిస్తుంది



'ఆరోజు నువ్వు చాలా అద్భుతంగా వాయించావ్. ఏదీ ఇంకో వేరే పాట వాయించు' అంటే 'నాకదొక్కటే వచ్చు' అంటే...



'మీకు ఎవరితలా అడ్డం లేకుండా, మీ సీట్లో నల్లులు లేకుండా బాగుందా?' అని గూండాగారు అడిగినప్పుడు 'బాగుంది' అంటారు.



'అయితే నువ్విటురా, నేను నీ సీట్లో కూర్చుంటాను' అని అంటే....



కాస్సేపు రిలాక్స్ ఔదామని సిగరెట్ అంటించడానికి అగ్గిపుల్ల గీస్తారు



గీసిన అగ్గిపుల్ల మండుతూ ఎగిరి ఎటో పడుతుంది










విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ.38/-

చలనచిత్రాలలో శ్రీరామునిపై వచ్చిన ఓ 17 గీతాలను తీసుకొని 'శ్రీరామగానం' పేరిట శ్రీరామనవమి సందర్భంగా హెచ్.ఎం.వి. వారు ఓ ఆడియో క్యాసెట్‌ను విడుదల చేశారు.

'శ్రీరామాంజనేయ యుద్ధం'లోని మేలుకో శ్రీరామా, రామనీల మేఘశ్యామ కోదండరామా, 'పల్లెటూరి చిన్నోడు'లోని 'ఓ... రామా నీ నామ మొకటే నిత్యమురా, 'భక్తశబరి'లోని 'అనరాదా శ్రీరామ అని' పాటలోని 'రామ చరణమె నావయని', 'రానై యున్నాడు' చరణాలు, 'ఏమిరామ కథ శబరీ శబరీ ఏదీ మరి యొకసారి', 'రామా మనోమోహనా; 'బంగారు పంజరం'లోని 'పదములె చాలు రామా', 'వాగ్దానం'లోని 'పాహిరామప్రభో... వెలుగు చూపవయ్యా', సీతాకళ్యాణం హరికథ, 'రాముడే దేముడు'లోని 'రామా... ఓ రామా రావా కనరావా; శ్రీకృష్ణాంజనేయ యుద్ధంలోని (ఇది శ్రీ కృష్ణార్జున యుద్ధంగా ఇన్‌లే కవర్‌పై ప్రింటయింది) రామా రఘురామా... ఎన్నాళ్ళు వేచేను ఓ రామా; 'పాదుకా పట్టాభిషేకం'లోని రామయతండ్రి; 'లవకుశ'లో రామన్న రాముడు కోదండ రాముడు; 'ఇలవేల్పు'లోని జనగణ మంగళ దాయక రామం (ఇది 'జనమన మంగళ దాయక' అంటూ ఇన్‌లే కవర్‌పై ప్రింటయింది); 'అందాలరాముడు'లోని పలుకే బంగార మాయెరా వంటి పాటలు; 'భాగ్యలక్ష్మి'లోని త్యాగరాజ కృతి 'ఉయ్యాల లూగవయ్యా' వున్నాయి ఈ క్యాసెట్‌లో.

నిస్సందేహంగా ఇది మెచ్చుకోదగ్గ ప్రయత్నం. ఈ ప్రయత్నంలో అరుదుగా లభించే రామామనోమోహనా (భక్త శబరి), రామయతండ్రి (పాదుకా పట్టాభిషేకం), జనగణ మంగళదాయక రామం (ఇలవేల్పు), వంటి పాటలు; భాగ్యలక్ష్మి (1943)లో నాగయ్య పాడిన 'ఉయ్యాల లూగవయ్యా' త్యాగరాయ కృతి వంటివి వెలుగు చూడడం శ్రోతలు ఆనందించదగ్గదీ, సేకరించి దాచుకునే అలవాటున్నవారు అభినందించ దగ్గదీ!

విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ.38/-

ఘంటసాల, ఎల్.ఆర్.ఈశ్వరి పాడిన శృంగార రసస్ఫోరకమైన హుషారు గీతాలలో ఓ 13 పాటలను తీసుకొని 'లవ్ మి నెరజాణ' అనే మకుటంతో ఆడియో క్యాసెట్‌గా హెచ్.ఎం.వి. వారు విడుదల చేశారు.

'రైతు కుటుంబం'లోని 'ఈ బుల్లోడు పాతికేళ్ళ బుజ్జాయిలే జిల్లాయిలే'., 'సిపాయి చిన్నయ్య'లోని 'అమ్మాయి ముద్దు తప్పా'., 'జరిగిన కథ'లో 'లవ్ లవ్ లవ్‌మి నెరజాణ' (క్యాసెట్ పేరు ఈ పల్లవిలోంచి తీసుకున్నదే)., 'సర్వర్ సుందరం' లోని 'నవయువతీ చక్కని ప్రియ నవయువతి'., 'ప్రేమనగర్' లోని 'లేలేలే నారాజా'., 'పాండవ వనవాసం'లోని 'మొగిలి రేకుల చినదానా'., 'పిడుగు రాముడు' లోని 'చినదానా చినదానా ఓ చిలిపి కనులదానా'., 'కలిసొచ్చిన అదృష్టం' లోని 'ఈ ప్రేమ పాఠం నీ ప్రేమ కోసం', 'అంతకోపమా వద్దు వద్దు', 'భలేరంగడు'లోని 'పగటి కలలు కంటున్న మామయ్య'., 'సుగుణసుందరి కథ' లోని 'అందమంటే నీదే లేరా'., 'భార్యా బిడ్డలు' లోని 'ఆకులు పోకలు ఇవ్వద్దూ'., 'ఉమ్మడి కుటుంబం' లోని 'హలో మై డియర్ హలో అలా గాలిలో చలో'., మొదలైన పాటలు ఉన్నాయి. ఈ క్యాసెట్‌లో ఇవన్నీ అలరించే పాటలే... ఇక ఈ ఆడియోలోగల సిపాయి చిన్నయ్య, తమిళ డబ్బింగ్ చిత్రం సర్వర్ సుందరం, కలిసొచ్చిన అదృష్టం, ఉమ్మడి కుటుంబం చిత్రాలలోని పాటలు ఎంతో కష్టపడితే గాని దొరకవు. ఈ రూపేణా శ్రోతలకు వాటిని అందించిన హెచ్.ఎం.వి. వారికి కృతజ్ఞతలు చెప్పుకోవాలి. ఇన్‌లే కవర్ పై ముద్రించిన ఘంటసాల వారి ఫోటోను చూస్తే- ఆయన ఫోటోలు ఎన్నో వుండగా ఈ ఫోటోను మాత్రమే ఎంపిక చేయటంలో గల 'శ్రద్ధ'ను ప్రత్యేకంగా పేర్కొనక తప్పదనిపిస్తుంది.

## మార్కెట్లో ఉన్న కొత్త క్యాసెట్లు




విడుదల : ఆదిత్య
వెల : 40/-




విడుదల : ఆదిత్య
వెల : 38/-




విడుదల : ఆదిత్య
వెల : 30/-

**రచన: చంద్రబోస్** (1) **గానం : గోపాల్, శ్రీనిధి**

అ: ఒట్టేసి చెపుతున్నా వింటున్నావా ఓమైనా నువ్వంటే నేనేనని
ఆ: అడుగేసి వస్తున్నా ఎందాకైనా ఏమైనా నీవెంటే ఉండాలని
అ: తీరిందమ్మా ఆరాటం దొరికిందమ్మా ఆధారం
నీవల్లే మారిందే నా జాతకం
ఆ: అందిందమ్మా అనుబంధం ఏవో జన్మల ఋణబంధం
నీవొళ్ళో వాలిందే నా జీవితం ॥ఒట్టేసి॥
అ: వెళ్ళేటి దారుల్లోన నీడుంటే చాలనుకుంటే
బంగరు మేడై కలిసొచ్చావే.....
ఆ: వేచేటి కన్నుల్లోన కలలుంటే చాలనుకుంటే
కమ్మని నిజమై కనిపించావే
అ: దీవెన చాలని అనుకుంటే దైవం అందెనే
ఆ: పూజకు రమ్మని పిలుపిస్తే ప్రాణం పంచెనే
అ: నా రాతే మార్చేసే నా గీతే దిద్దేసి
భామిని వుండగ బ్రహ్మెందుకో.... ॥ఒట్టేసి॥
అ: నీ లేత పాదాలంటే ధూళైతే చాలనుకుంటే
పాపిట తిలకమె చేశావమ్మా
ఆ: నీ పెరటి తోటల్లోన గాలైతే చాలనుకుంటే
ఊపిరిలో నను నిలిపావమ్మా
అ: నాలో నేడే వెలిగిందే ఆశాదీపము
ఆ: ప్రేమే మనకూ అందించే ఆశీర్వాదము
అ: నీ మెళ్ళో ముళ్ళేసి మల్లెల్లో ఇల్లేసి
జతపడి బ్రతకని జన్మెందుకో..... ॥ఒట్టేసి॥

**రచన: భువనచంద్ర** (2) **గానం : ఉదిత్‌నారాయణ్, సుజాత**

ఆ: ఏలో ఏలో ఏలూరోడా ఏస్కో ఏస్కో గోలీసోడా
అ: ఏస్తే ఏస్తే నీ జిమ్మడా
చూపిస్తావా చంచల్‌గూడా
ఆ: తయ్యారే పచ్చనోటు కొట్టావంటే తయ్యారే.... హోయ్
అ: అయ్యారే చంకనెక్కి పోతావుంది చిన్నారే... హోయ్
ఆ: వెన్నెల్లో పక్కేస్తాలే చుక్కా ముక్కా అందిస్తాలే..... ఏలో ఏలో ఏలూరోడా...
అ: చూపిస్తావా చంచల్‌గూడా
ఆ: సలసల కాగే సొగసు రారమ్మంటే రతిమగడా
అ: పిటపిటలాడే వయసు పెట్టెయ్ మనదా పెరుగు వడా
ఆ: ఓరయ్యో... ఓరయ్యో నీ మగసిరికే పట్టా ఇచ్చేశా



కనుల నీరు చిందినా కాటిమంటలారునా
ఎండమావి నీటిలో ఏటి నావ సాగునా
జాలిలేని శాపాలే నీకు దీవెనాయెనా..... ॥కన్నతల్లి॥
చ: మన్నులోన కలిసింది ఉన్న కుటుంబం
చుట్టరికం కలపనంది చుట్టు ప్రపంచం ॥మన్ను॥
జ్ఞాపకాల నీడలో తలను దాచుకోకురా
జీవితాల క్రీడలో తనకు తోడు ఏదిరా
గాలి నీకు నేస్తమై ప్రేమలాలి పాడితే..... ॥కన్నతల్లి॥
చ: మనసు వున్నచోట లేదులే మాంగల్యం
అందదాయె ఏనాడూ ఆశలతీరం ॥మనసు॥
బండరాతి బొమ్మకు ఏ మొక్కులు మొక్కినా
గుండెవున్న మనిషికి ఏ దిక్కూలేదురా
కన్నీరే కాటేసే కర్మ నీకు తప్పునా.... ॥కన్నతల్లి॥

**రచన: వేటూరి** (6) **గానం : శంకర్ మహదేవన్, సుజాత**

అ: బందరులాంటి బస్తీలో గడిపేస్తా నీ గస్తీలో
నిన్ను చూస్తే నిదరకాస్తే కోడికూస్తే ఎట్టమ్మో ॥బందరు॥
ఆ: బందరులాంటి బస్తీలో దోచేసే నీ దోస్తీలో
కన్నెకుస్తీ పట్టవస్తే కొంగులాగే కిట్టయ్యా ॥బందరు॥
అ: పెదాలనే పేరంటానికి పిలిచే చిలకా
పదే పదే గోరింటాకులు పెట్టే అలకా
ఆ: ఎడాపెడా ఏకాంతాల పట్టూ విడుపా
చలీ గిలీ సావాసాలే అడపాదడపా
అ: ఊసులెన్నో పూలకిచ్చి ఆశలన్నీ మాలకట్టి
ఆ: సూర్యుడొస్తే వాణ్ణి తిట్టి చంద్రుడొస్తే ముద్దుపెట్టి
అ: ఎన్నిరాత్రిళ్ళు ఈ జంట జాగారమో
ఆ: ఎన్ని కౌగిళ్ళు ఆ గాలికాహారమో..... ॥బందరు॥
అ: చలీచెలీ కవ్వింపుల్లో కథలే నడిపి
శృతిలయా లాలింపులో మతులేమరచి
ఆ: వయస్సులో వయ్యారాల వగలే తరచి
వసంతమే ఆడిస్తాలే ఒడినే పరచి
అ: కాదు అన్నా కన్నుగీటి జౌనుతోనే హద్దుదాటి
ఆ: కస్సుమన్నా కౌగిలించి యస్సులాగ స్వీకరించి
అ: ఎన్ని పొదరిళ్ళతో జంట పోరాటమో
ఆ: ఎన్ని ఒత్తిళ్ళలో కొంటె కోలాటమో.... ॥బందరు॥



**రచన: శక్తి** (1) **గానం : ఉదిత్‌నారాయణ్, సునీత**

ఆ: మెల్లంగరా... ఓ చిన్నికృష్ణుడా ఒళ్లు ఒళ్లంత అల్లుకో కొంటెకృష్ణుడా
జల్లు జల్లంటూ.... జల్లు జల్లంటూ జల్లు జల్లంటూ గిల్లు వానజల్లులాగా
లేతగుండెల్లో దూరు ఈతముల్లులాగా ॥2॥
అ: చిన్నంగనే వస్తా సుందరాంగి పండువెన్నెల్లో దొంగలా వొంగి వొంగి ॥2॥
జున్ను జున్నంత... జున్ను జున్నంత జున్ను జున్నంత జుర్రుకుంట సత్యభామా
కన్నెవెన్నంత దోచుకుంటా ఒప్పుకోమ్మా ॥2॥
ఆ: ఉప్పూ చేప వండి - ఉల్లిపాయ కోసి మెట్టాచేలోకొస్తే....
ముద్దుల్ని.... గోరు ముద్దల్ని
నోటికందించు అన్నా బాలుడులే
ఏటినీళ్లల్లో ఆడే తారకలే
అ: అల్లారల్లరి పిల్ల - గిల్లికజ్జాలాడి
కల్లోకొచ్చిందంటా..... అచ్చట్లు... తీపి ముచ్చట్లు....
ఊసులాడే వయ్యారి రాధికలా గోము చేసే అందాల గోపికలా
ఆ: నాయినో..... నాయినో... ప్రేమకుట్టిందిలే... నాయినో
అ: నాయినో... నాయినో... ఈడుగిచ్చిందిలే.... నాయినో ॥జున్ను॥జల్లు॥
ఆ: కొత్తకొత్తగ వుంది - మెత్తా మెత్తగ వుంది
మత్తెక్కిపోతుందోయ్ వత్తిళ్లూ... వేడి ఆవిర్లూ
ఓర్చుకోలేని తాపం ఈ వేళా తీర్చిపోతావా దాహం గోపాలా
అ: మొన్నా ఏమీ లేదు... నిన్నా కూడా లేదు
ఇవ్వాళే పుట్టిందా ప్రేమంటే... తీపి బాధంటా
లేదు పిల్లా దీనికి ఏమందూ ఓపికుంటే ఇచ్చుకో ఆ విందూ
ఆ: కోయిలా... కోయిలా... కూతకొచ్చానులే కోయిలా
అ: రా ఇలా... రా ఇలా..... కౌగిలిస్తానులే రా ఇలా... ॥జున్ను॥ ॥మెల్లంగరా॥

**రచన: చంద్రబోస్** (2) **గానం : మనో**

ప: వానాకాలాన్ని ఎండాకాలాన్ని కలిపేదే సోదరా ఇంటర్
స్కూల్ లైఫ్‌లోంచి లైఫ్ స్కూల్‌లోకి నడిపేదే సోదరా ఇంటర్
MPC, BiPC, HEC, CEC ఏదోటి చదివేసి ఎన్నెన్నో నేర్చేసి ॥2॥
రాగింగ్ చేసి టీజింగ్ చేసి కామెంట్ చేసి కాపీ చేసి
అహ అల్లరిచేసి అన్నీచేసి ఫ్యూచర్‌కేసి అడుగే వేసేయ్....
నీ కన్నవాళ్ల కలలన్నీ నిజం చేసి..... ॥వానా॥
చ: ఆడుకోడానికి క్యాంపసుంది ఇక్కడ ఆరగించడానికి క్యాంటీనుంది ఇక్కడ
బజ్జోడానికి బెంచీలున్నాయిక్కడ మేలుకొల్పడానికి మాస్టర్లున్నారిక్కడ
బీటువెయ్యడానికి పాపలున్నారిక్కడ ఫైటుచెయ్యడానికి గ్రూపులున్నాయిక్కడ





ఆ: మందేసుకుంటే నువ్వు... కో: ఓహో
సోడాని నేను ఔతా.... కో: ఓహో
అ: మోడ్లింగ్ చేస్తే నువ్వు... కో: ఓహో
కోడాకు నేను ఔతా.... కో: ఓహో
ఆ: స్నేక్‌లాగ దూకి నాపై చూపెయ్ సత్తా ॥ఏస్కో॥
అ: స్నానం చేస్తే నీకు నేనె... న్యూ లక్సౌతా
కిస్సాట మొదలైతే... కస్సాటౌతా
ఆ: ఆకలివేస్తే నీకు నేనె... రోకల్సౌతా
వీక్‌నెస్‌గా వుంటె నే.. హార్లిక్సౌతా
అ: సెల్‌ఫోను నువ్వు అయితే... కో: ఓహో
సిమ్‌కార్డు నేను ఔతా... కో: ఓహో
ఆ: జెన్స్పీడు నువ్వు అయితే కో: ఓహో
డన్‌లప్పు నేను ఔతా
అ: ఒప్పుకుంటే ఓపికంత ఒలికించేస్తా ॥ఏస్కో॥

**రచన: వేటూరి** (6) **గానం : చరణ్, నిత్యసంతోషిణి**

అ: వెన్నెలా కలా నిజమా వెచ్చనై రెచ్చగొట్టిందిలే
ఆ: అమ్మమ్మా ఇదేం గొడవ పున్నమే పూలు జల్లిందిలే
అ: నీ వూపిరి నా వేసవి రగిలించె హాయిగా
ఆ: ఇక ఏకాంత వేళల్లో ఈ కాంత నీదేనయా ॥వెన్నెలా॥
అ: సాయం కాలపుపొద్దు సాయం అడిగిన ముద్దు
ఎప్పటికి తీరకున్నవి దుప్పటినే కోరుకున్నవి
ఆ: ప్రేమలోపలి ఘాటు పెదవుల్లో చిరుకాటు
నిద్దర్నే చెరుపుతున్నవి ఇద్దర్ని కలుపుతున్నవి
అ: తాపంతీరే రూపమా చిరుదీపంపెట్టే అందమా
ఆ: చెయ్యెకలిపే స్నేహమా నీ చెలిమే తీరని దాహమా
అ: నీ పూలపై వాలనా గాలినై తేలనా
ఆ: మల్లెలు చల్లిన గంధం అల్లరి వలపుల గ్రంథం
పనిలేకే అలుగుతున్నవి పడకిల్లే అడుగుతున్నవి
అ: గాలే ఆడని బ్లౌజు కవ్విస్తున్నది ఈ రోజు
వయ్యారం పెరుగుతున్నది వాటేస్తే కరుగుతున్నది
ఆ: పావురమై ఎగిరింది పావడ విడిచిన పరువం
అ: కుర్రది ఎంతో మధురం ఎర్రగ పండిన అధరం
ఆ: నీ గుండెలో దాగనా వూపిరై వూగనా ॥వెన్నెల॥

అ: ఎవరేమన్నా ఏదేమైనా ॥2॥ నేనంటే పడిచచ్చే నీప్రాణం
అ: కన్యాదానం వేళ వరకట్నం కావాలి ఇస్తావా... నువ్విస్తావా.... ॥2॥
ఆ: ఏంకావాలి — అ: ఏదైనా
ఆ: ఏమివ్వాలి — అ: ఏదైనా
ఆ: నువ్వడిగేది — అ: ఏదైనా
ఆ: నువ్ కోరేది — అ: ఏదైనా
ఆ: నా అణువణువూ నువ్వయ్యాక ॥2॥ నాదంటూ నాలో ఇంకేముంది..

**రచన: వేటూరి — (4) — గానం : యస్.పి.బాలు, సాధనా సర్గమ్**

అ: వెన్నెల్లో వేసవికాలం ఎండల్లో శీతాకాలం
నీ ఒళ్లో సాయంకాలం హాయిలే హలా
ఆ: కన్నుల్లో తొలి కార్తీకం కౌగిట్లో కసి తాంబూలం
సరసంలో సంధ్యారాగం సాగునే ఇలా
అ: ఏకంగా ఏలే రాజ్యం ఎదలోనే రాసే పద్యం
ఆశల్లో పోసే ఆజ్యం కాదులే కలా
లాలి లాలి లాహిరి ఇదేమి లాహిరి
ఆ: లాలి ఎంత పాడినా ఇదేమి అల్లరి
అ: పండనీ పదే పదే పెదాల తిమ్మిరి ॥2॥ ॥వెన్నెల్లో॥
అ: నీ తోడు లేనిదే నాకు తోచదు
ఆ: నీ నీడ కానిదే ఊపిరాడదు ॥నీ తోడు॥
అ: కోకిలమ్మ పాడింది కొమ్మకొక్క సన్నాయి
ఆ: కొంగుముళ్ళ కోరింది కోకచాటు అమ్మాయి
అ: చెలి చూపు రాసె తొలి ప్రేమలేఖ
ఆ: పాలి మేర దాటె చలికాగలేక
అ: విరజాజిపూల వాసనే వంతెనేయగా..... ॥వెన్నెల్లో॥
ఆ: జాజి పూల గాలితో జాబులంపినా అ: జాబిలమ్మ గిల్లుడే ఆగనంటది ॥2॥
ఆ: ఆకలమ్మ ఏనాడో కడుపు దాటిపోయింది
అ: దాహమంత కళ్లల్లో దాగి నిన్ను తాగింది
ఆ: విరహాలయేటి కెరటాలుదాటి
అ: మరుమల్లెపూల వరదల్లో తేలి
ఆ: ఒడిచేరుకున్న ప్రేమలా వాలిపో ఇలా.... ॥వెన్నెల్లో॥

**రచన: వేటూరి — (5) — గానం : యస్.పి.బాలు**

ప: కన్నతల్లి భూదేవి ఉన్నతండ్రి ఆకాశం
నడుమ ఎవ్వరున్నారు నీకోసం.... ॥కన్నతల్లి॥



అ: పిలదానా నీ పైటకి నే సలాం కొట్టేశా
ఆ: పడుచోడా.... చెయ్యేస్తే చుట్టాన్నౌతా
చీరల్లే నిను చుట్టేస్కుంటా... ఏలో ఏలో ఏలూరోడా...
అ: చూపిస్తావా చంచల్‌గూడా
అ: పండే పువ్వై నన్ను కవ్విస్తోందే కసితనమా
ఆ: పెట్టే పుంజై గురువా కొక్కో అంటే కలవరమా
అ: ఓలమ్మో... ఓలమ్మో నీ నడుముకి ఓ గుడే కట్టిస్తా
ఆ: చెలికాడా.... నా చిలకని నీ ఒళ్లో కట్టేస్తా
అ: వగలాడీ... యవ్వారం ఎంతో ముద్దు
అయినా దాటను ఆ సరిహద్దు...
ఆ: ఏలో ఏలో ఏలూరోడా ఏస్కో ఏస్కో గోలీ సోడా
అ: ఏస్తే ఏందే నీ జిమ్మడా సద్దెయ్ ముందు పెట్టే బేడా
ఆ: ఆటేమో అయ్యిందిలే
అ: టాటా గుడ్‌బై చెప్పేస్తాలే....

**రచన: చంద్రబోస్ — (3) — గానం : దేవాషిష్, సుజాత**

అ: పదహారేళ్ల పాపా నీకు ఏదిష్టం ఏదిష్టం ఏదేదిష్టం ॥2॥
ఆ: నా పేరిష్టం — అ: తర్వాత
ఆ: మా ఊరిష్టం — అ: తర్వాత
ఆ: మా అమ్మిష్టం — అ: తర్వాత
ఆ: మా నాన్నిష్టం — అ: తర్వాత
ఆ: అన్నిటికన్నా అందరికన్నా ॥2॥ నువ్వంటే చాలా చాలా ఇష్టం..... ॥పద॥
అ: ఇండియాలోని అన్ని గుళ్లలోనూ ఏదిష్టం.... నీకేదిష్టం.... ॥2॥
ఆ: తిరుపతి ఇష్టం — అ: తర్వాత
ఆ: షిరిడీ ఇష్టం — అ: తర్వాత
ఆ: ఉడిపీ ఇష్టం — అ: తర్వాత
ఆ: మధురై ఇష్టం — అ: తర్వాత
ఆ: ఏ గుడికన్నా నాగుండెల్లో ॥2॥
నువు కట్టిన గుడి ఎంతెంతో ఇష్టం... ॥పద॥
ఆ: నాలో నీకేం నచ్చింది... అంతగానూ మెచ్చింది ఏముంది...
అసలేముంది.. ॥నాలో॥
అ: అందాల ధనం — ఆ: అంతేనా
అ: బంగారు గుణం — ఆ: అంతేనా
అ: పాపాయి తనం — ఆ: అంతేనా
అ: నీ పిచ్చితనం — ఆ: అంతేనా



**రచన: సాయి హర్ష — (4) — గానం : జె. ఏసుదాస్**

ప: అలకలు ఏలా రామచిలకా ఆటలాడాలి
కళ కళ లాడే కోకిలమ్మా పాట పాడాలి
పువ్వల్లే నవ్వుకుంటూ ఈ నేలని ఏలవే
గువ్వల్లే రివ్వుమంటూ ఆ నింగిని చేరవే
ఈ కళ్లు నీవులేమ్మా,,, కన్నీళ్లు న్యాయమేనా ॥అలకలు॥
బొమ్మలాటలా బ్రహ్మ తన బొమ్మరిల్లు మనకిచ్చే
మనసూ మమతా కలబోసే మమకారాలే ముడివేసే
ఇంటి రంగులే వేయా హరివిల్లు తుంచుకొని వచ్చే
పించం విప్పెను నెమలమ్మ ధన్యం ఆయెను తన జన్మ
మనతోట విరిసినా పూలన్నీ - అవి నేలరాలుటే మరిచే
మన ఇంట కురిసెలే ప్రేమంతా ఇది స్వర్గశాలనే మించే
అది చూసి ఆ దేవతలూ అమృతమే చేదంటారూ
మన ఇంటికి రావాలంటూ దివినుంచీ దిగివస్తారు
ఇటువంటి ఇల్లు మించీ ఇలపైన లేదులేమ్మా ॥అలకలు॥
వానవిల్లునే తెద్దాం విరితేనే జల్లు చూపెడదాం
మదిలో మెదిలే కలలింకా నిజమే చేద్దాం మనమింకా
చంద్ర వంకనే తెద్దాం మన వాగు వంకలో వేద్దాం
స్నానం పానం చేయిద్దాం చందనమద్దీ పంపిద్దాం
మరి అన్ని దిక్కులూ మనవందాం సరిహక్కుదారులం అవుదాం
మురిపాల పల్లకీ ఎక్కేద్దాం మన పాల పుంతనే చుట్టొద్దాం
ఈ నేలను నింగిని చేద్దాం ఆ నింగిని నేలనుకుందాం
కాలాన్నే కట్టేసేద్దాం కమ్మంగా బువ్వే పెడదాం
తాంబూలం ఇచ్చి తననీ కాసేపు ఆపివేద్దాం ॥అలకలు॥

**రచన: చిర్రావూరి విజయకుమార్ — (5) — గానం : కార్తీక్, రాధిక**

ఆ: ఏస్కో ఏస్కో ఏస్కో.... నామీద చెయ్యేస్కో
చేస్కో చేస్కో చేస్కో... నచ్చేది చేసేస్కో
అ: ఏస్త ఏస్త ఏస్త... నీమీద చెయ్యేస్తా చేస్త చేస్త చేస్త... నచ్చేది చేసేస్తా
ఆ: నూనూగూ మీసాలా నందమూరి వీరా
అరె ట్వెంటీలో టెంప్టైతే తప్పలేదు లేరా
ఆ: నువ్వంటే మోజంటూ రెచ్చగొట్టి తీరా
అరె నా కొంపే ముంచిందీ బొడ్డుకింద చీరా....
ఆ: స్మోకింగ్ చేస్తే నీకు నేనె... బీడినౌతా న్యూఫిల్మ్ చూస్తే నే... సి.డి.నౌతా
అ: డ్రెస్సింగైతే నీకు నేనె... చున్నీనౌతా షాపింగుకెళ్తే నీ... సన్నీనౌతా





ఇన్నీ నీకు బోరనిపిస్తే చదివేటందుకు బుక్సున్నాయి ఇక్కడే
నువ్వు ఎక్కేటందుకు స్టెప్సున్నాయి ఇక్కడే ఇక్కడే ॥వానా॥
చ: కోతలెన్నో కోసేవాళ్ళు లాయర్లండి ఇక్కడ
కోతివేషమేసేవాళ్ళు యాక్టర్లండి ఇక్కడ
గొంతు చించి అరిచేవాళ్లు గాయకులండి ఇక్కడ
గొడవలెన్నో చేసువాళ్ళు నాయకులండి ఇక్కడ
దమ్ములాగి దగ్గేవాళ్ళు డాక్టర్లండి ఇక్కడ
స్లిపు పెట్టి రాసేవాళ్లు రైటర్లండి ఇక్కడ
ఎన్నో కళల కాలేజిదీ ఎంతో ఎంతో టాలెంటుందీ ఇక్కడే
ప్రతి టాలెంటుకి టర్నింగ్ పాయింట్ ఇక్కడే ఇక్కడే... ॥వానా॥

**రచన: చంద్రబోస్ — (3) — గానం : టిప్పు, సుజాత**

ఆ: సరసమిక సండే - మధువులిక మండే
తగవులిక ట్యూస్‌డే - అన్నాడే చిన్నోడే వీడే వదలడు ఎవ్రీ డే
ఆటాడుకుంటే - హాయిహాయిడే వేటాడుకుంటే - వెచ్చవెచ్చడే
ఊరించుకుంటే - ఉత్తఉత్తడే ముద్దిచ్చుకుంటే - మత్తు మత్తుడే
అ: ॥సరసమిక॥
ఆ: పాపం పిల్లోడు అంటూ ప్రేమే పెంచేసుకుంటూ
ప్రాణం పంచేసుకుంటే ఫ్రైడే
రూపం మెచ్చాడు అంటూ - దీపం తగ్గించుకుంటూ
మొత్తం అందించుకుంటే - మేడే
అ: పువ్వే పెట్టేసుకుంటూ - కాయే కొట్టేసుకుంటూ
పండే పండించుకుంటే - 'ఫన్'డే
మ్యాచ్ అయ్యాను అంటూ - మ్యాచ్ ఆరంభమంటూ
క్యాచ్ పట్టేసుకుంటే - 'వన్'డే
ఆ: చేయి కలిపి చెవులు కొరికి చిలిపికథ చెబితే చిల్డ్రన్స్‌డే
అ: మథనుడేమో మనకు గురువై మధురిమలు నేర్పితే టీచర్స్ డే ॥ఆటాడు॥సర॥
ఆ: నువ్వే మావూరికొచ్చి నువ్వే మావాడకొచ్చి నువ్వే మా ఇంటికొస్తే 'నీ'డే
నేనే నీ దారికొచ్చి నేనే నీ వెంటకొచ్చి నేనే నీ ఇంటికొస్తే 'నా'డే
అ: బాలా నా చెంతకొచ్చి చాలా కవ్వింతరేపి
భాగం పంచివ్వకుంటే 'బ్యాడ్ డే'
పిట్టా నా పక్కకొచ్చి పట్టాపగ్గాలు తెంపి
గుట్టే విప్పేసుకుంటే 'గుడ్ డే'
ఆ: ఒకరికొకరై బ్రతుకుతుంటే ప్రతీనెల 14th లవర్స్ డే
అ: ప్రేమజెండా ఎగరవేస్తే ప్రతీనెల 15th ఫ్రీడమ్‌డే ॥ఆటాడు॥ ॥సరసమిక॥

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ | : ఉదయ్‌రాజ్ |
| మాటలు | : చింతపల్లి రమణ |
| కో-డైరెక్టర్ | : డి.డి.సి. కేశవప్రసాద్ |
| డాన్స్ | : ప్రసన్న, దినేష్ |
| ఫైట్స్ | : హార్స్‌మెన్‌బాబు |
| ఆర్ట్ | : డి.వై. సత్యనారాయణ |
| కాస్ట్యూమ్స్ | : మనోజ్ |
| మేకప్ | : సుంకర ఈశ్వర్ |
| ఎడిటింగ్ | : శ్రీకరప్రసాద్ |
| డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ | : సి. రాంప్రసాద్ |
| పాటలు | : వేటూరి, చంద్రబోస్, భువనచంద్ర |
| పబ్లిసిటి | : కృష్ణ డిజటల్స్ |
| పి.ఆర్.ఓ | : ఎల్.బాబూరావు |
| సంగీతం | : విద్యాసాగర్ |
| నిర్మాత | : కె. అనిల్ కుమార్ |
| స్క్రీన్‌ప్లే-దర్శకత్వం | : ఇ. సత్తిబాబు |

## తారాగణం

శ్రీకాంత్, స్రవంతి, శివాజీ, సునీల్, అనితా పటేల్, ఆశాషైనీ, యల్.బి.శ్రీరాం, యం. యస్. నారాయణ, బ్రహ్మానందం, బాబూమోహన్, రాజీవ్ కనకాల, ఉత్తేజ్, జయప్రకాష్‌రెడ్డి, కృష్ణ భగవాన్, మల్లికార్జునరావు, కొండవలస లక్ష్మణరావు, 'కళ్ళు' చిదంబరం, సుధ, కోవై సరళ,తెలంగాణా శకుంతల, సన, బెనర్జీ.

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

P.V.V.S.N. మూర్తి (బాబు) సమర్పించు
శ్రీ క్రియేషన్స్

# ఒట్టేసి చెపుతున్నా...

కె. అనిల్ కుమార్ ఇ. సత్తిబాబు విద్యాసాగర్


కె. అనిల్ కుమార్


ఇ. సత్తిబాబు


విద్యాసాగర్



## తారాగణం

నందమూరి తారకరత్న, షర్మిలి (నూతన పరిచయం), గిరిబాబు, ఎల్.బి.శ్రీరాం, మల్లికార్జునరావు, సునీల్, చిత్రంశీను, ఆలీ, బెనర్జీ, శివకృష్ణ, తనికెళ్ల భరణి, శ్రీనివాసరెడ్డి, కళ్లు కృష్ణారావు, నామాల మూర్తి, జూనియర్ రేలంగి, సుమన్‌శెట్టి(ఆలీబాబా)





మణిశర్మ


బాలశేఖరన్


ఆచంట గోపీనాథ్

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : పరుచూరి బ్రదర్స్ |
| సంగీతం | : మణిశర్మ |
| పాటలు | : వేటూరి, చంద్రబోస్, సాయిహర్ష, చిర్రావూరి, శక్తి |
| కెమెరా: | : పూర్ణ.కె |
| ఆర్ట్ | : చిన్నా |
| ఎడిటర్ | : కె. రవీంద్రబాబు |
| ఫైట్స్ | : హార్స్‌మెన్‌బాబు |
| కాస్ట్యూమ్స్ | : సూరిబాబు |
| మేకప్ | : మోహన్ |
| స్టిల్స్ | : రాజా |
| ప్రొడక్షన్ ఎక్జిక్యూటివ్ | : రాజు, రామకృష్ణ |
| ప్రొడక్షన్ మేనేజర్ | : రమేష్ |
| క్యాషియర్ & ఎకౌంటెంట్ | : బాషా |
| పి.ఆర్.ఓ | : ఎస్. జగన్ |
| పబ్లిసిటి డిజైన్స్ | : సురేష్ |
| అసిస్టెంట్ డైరెక్టర్స్ | : మల్లి కడియాల, ఉమేష్ చంద్ర |
| కో. డైరెక్టర్స్ | : నారాయణ శౌరి, లక్ష్మణకుమార్ |
| సహనిర్మాతలు | : బత్తుల గిరిబాబు, నేమాని శ్రీనివాస్ |
| నిర్మాత | : ఆచంట గోపినాథ్ |
| స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : బాలశేఖరన్ |

# న్యూస్ ఫ్లాష్

## ఢిల్లీ తెలుగు అకాడమీ ఉగాది పురస్కారాలు





స్వభాను ఉగాదిని పురస్కరించుకొని ఢిల్లీ తెలుగు అకాడమీ వివిధ రంగాల్లో తమ ప్రతిభను ఆవిష్కరిస్తున్న ప్రముఖులకు అవార్డులను అందించింది. ఈ కార్యక్రమం ఢిల్లీలోని 'ఫిక్కీ' ఆడిటోరియంలో మార్చి 30న జరిగింది. ఈ నేపథ్యంలో ప్రముఖ సినీ సంగీత దర్శకుడు చక్రి, యువగీత రచయిత భాస్కరభట్ల రవికుమార్, నేపథ్యగాయని కౌసల్యలను దుశ్శాలువాలతో సత్కరించి, జ్ఞాపికలను, అభినందన పత్రాలను సంస్థ అందించింది. వీరితో పాటుగా ప్రముఖ సినీ నటులు కైకాల సత్యనారాయణ, కోట శ్రీనివాసరావు, సునీల్, బాబూమోహన్, ప్రకాష్‌రాజ్‌లను కూడా సంస్థ సత్కరించింది. ఈ కార్యక్రమంలో సిక్కిం గవర్నర్ వి.రామారావు, కర్నాటక గవర్నర్ టి.ఎన్.చతుర్వేది, కేంద్ర కార్మిక శాఖ మంత్రి సాహెబ్‌సింగ్ వర్మ, ప్రసార భారతి చీఫ్ ఎగ్జిక్యూటివ్ అధికారి కె.ఎస్.శర్మ తదితరులు పాల్గొని ఉగాది పురస్కారాలను అందించారు. ఈ కార్యక్రమం చివరలో చక్రి, కౌసల్య, విజయలక్ష్మితో సంగీత విభావరి జరిగింది.

## సీతయ్య సినిమా ఎన్.టి.ఆర్. పుట్టిన రోజున ఆడియో 'అడవిరాముడు' రిలీజ్ రోజున



'సీతయ్య' లో హరికృష్ణ, సిమ్రాన్

హరికృష్ణ, సౌందర్య, సిమ్రాన్ కాంబినేషన్‌లో నిర్మాత - దర్శకుడు వై.వి.యస్.చౌదరి నిర్మించిన 'సీతయ్య' చిత్రం ఎన్.టి.ఆర్. జన్మదినమైన మే 28న విడుదల కానుంది. ఈ సినిమాలో 9 పాటలున్నాయి. మూడు పాటలను సి.నారాయణరెడ్డి, ఆరు పాటలను చంద్రబోస్ రాశారు. కీరవాణి సంగీత దర్శకుడు. 'తల్లా-పెళ్ళామా' చిత్రంలోని 'తెలుగుజాతి మనది' పాట స్థాయిలో 'సీతయ్య' చిత్రంలో కూడా ఓ పాట ఉండాలని చౌదరి సంకల్పించారు. కొంతకాలంగా సినీ గీతాలకు దూరంగా వున్న శ్రీ సినారెను కలిశారు. 'ఇది రాయలసీమ గడ్డ' అనే పల్లవితో ఆరు నిముషాల పాటను రాసిచ్చారాయన. 'పాట వ్యవధి ఆరు నిముషాలే అయినా కొండంత సంతృప్తిని పొందాను' అన్నారు సినారె పాత్రికేయగోష్టిలో. రెండు మూడు రీళ్ళలో చెప్పగలిగే విషయాన్ని కేవలం నాలుగైదు లైన్లలో సినారె చెప్పారని, చంద్రబోస్ రాసిన ఆరు పాటలలోని విషయం అతని వయసుకు మించినదే అయినా అత్యంత ప్రతిభతో ఆ ఆరు పాటలను రాశాడని వై.వి.యస్ చౌదరి తెలిపారు. కీరవాణి - చౌదరి కాంబినేషన్‌లో ఇప్పటివరకూ అన్నీ మంచి పాటలే వచ్చాయి కనుక శ్రోతలను 'సీతయ్య' ఆడియో కూడా అలరిస్తుందను కోవచ్చు. ఈ ఆడియో ఏప్రిల్ 28న... అంటే... ఎన్.టి.ఆర్. నటించిన 'అడవిరాముడు' రిలీజైన తేదీన విడుదలవుతోంది. ■

## చక్రి కి మరో అగ్ర కథానాయకుని చిత్రం 'ఆంధ్రావాలా'

మొదట్నుంచీ సంగీత దర్శకుడు చక్రికి దర్శకుడు పూరి జగన్నాథ్ మంచి అవకాశాలు ఇస్తూనే వున్నారు. ఇటీవల నాగార్జునతో శివమణి.... ఇప్పుడు ఎన్.టి.ఆర్.తో ఆంధ్రావాలా! ఈ 'ఆంధ్రావాలా' చిత్రం ఏప్రిల్ 11న శ్రీరామ నవమి నాడు అన్నపూర్ణా స్టూడియోలో ప్రారంభమయింది. ఇందులో 6 పాటలుంటాయి. తన స్టయిల్ ఆఫ్ కంపోజిషన్‌కి ఎన్.టి.ఆర్. పెర్ఫార్మెన్స్ బాగా సరిపోతుందని, ఆయనతో సినిమా చెయ్యాలనీ గత సంవత్సరం నుంచీ అనుకుంటున్నానని, ఈ సినిమాలో పాటలన్ని టినీ ఎన్.టి.ఆర్. తన కెరీర్‌లో గుర్తుంచుకునేలా సూపర్‌హిట్ చేస్తానని, ఈ మాట ఎంతో నమ్మకంతో చెప్తున్నానని అన్నారు చక్రి



'ఆంధ్రావాలా' సినిమా ప్రారంభోత్సవం రోజున. ఈ సినిమా అక్టోబర్‌లో విడుదలవుతుం దని అన్నారు దర్శకుడు పూరీజగన్నాథ్. అక్టోబర్‌లో వచ్చే పండుగలలో ముఖ్యమైనది విజయదశమి కాబట్టి, శ్రీరామునికి విజయదశమికి వున్న సంబంధం తెలుగువారందరికీ తెలిసినదే కాబట్టి ఎలాగూ శ్రీరామనవమినాడు ప్రారంభించారు కనుక విజయదశమికి విడుదల చేస్తారని ఊహించవచ్చు.



■



చదువుల్రావు
సత్యమూర్తి BV
వాడు మా చదువుల్రావు లా ఉన్నాడే
ఎవరో గర్ల్‌ఫ్రెండ్‌తో కలిసి వచ్చినట్లున్నాడు!
అసలింత ఖరీదైన హోటల్‌కి రాగలుగుతున్నాడు?! పైగా మా ఎదురుకుండానా? ఇలా రావడానికి ఎంత ధైర్యం?!!!
ఆ అమ్మాయి జయశ్రీ అని మాకు తెలుసున్న వాళ్ళ అమ్మాయే. కాకపోతే వాడేదైనా చెయ్యాలనుకునప్పుడు అంతా ఒక ప్లాన్ ప్రకారం పకడ్బందీగా చేస్తాడు.
ఈ బిల్లుని ఆయన మీకిమ్మన్నారు సార్
నేను చెప్పలేదూ ఇదే వాడి ప్లాన్. ఇదే వాడి ధైర్యం.



# కొమ్మ కొమ్మకో సన్నాయి...



## ఆ అవస్థ గురించి విశ్వనాథ వారన్నమాటే నా పాటకు చరణమయ్యింది

### 'మనోహరం' పాట గురించి వేటూరి

జీవితం అనుశ్రుతం. గతంలో అది నాకు శ్రుతం. "గతమంతా శ్రుతం నాది. ప్రస్తుతానికది పునాది." అని ఏనాడో ఆకాశవాణిలో ఆలపించాను. నా జీవితం ప్రాదేశిక సుగమ సంగీతం. ఇది అలనాటి ఆకాశవాణిలో వివిధ ప్రాంతాల లలిత గీతాల కార్యక్రమం. అయితే నీ జీవితానికీ, ఆ శీర్షికకు సంబంధమేమిటని ఎవరైనా అడగవచ్చు. నా బాల్య, యవ్వన దశలు నిలకడగా ఒకచోట సాగలేదు. స్కూలు చదువులు పెద్దకళ్లేపల్లి, విజయవాడ, జగ్గయ్యపేట, కొల్లూరులలో జరిగాయి. కాలేజీకి వచ్చాక విజయవాడ, మద్రాసు, హైద్రాబాద్ నగరాలలో జరిగాయి. సెలవులిచ్చినప్పుడల్లా కృష్ణాతీరంలో ఉన్న మా గ్రామాలకు వెళ్లటం అక్కడ ప్రకృతి ఒడిలో పరవశించి ఏకాంతంగా పాటలు పాడుకోవటం, కాలేజీనోటు పుస్తకంలో ఆ గాలి పాటలన్నీ రాసుకోడం- ఇలా గడిచిపోయింది విద్యార్థిగా నా జీవితం. ఇంతకీ ప్రాదేశిక సుగమ సంగీతం- అంటే ప్రదేశాలు తిరగటంలో పుట్టిన సంగీతం - ఇదో ప్రయాణ సంగీతం. ప్రస్థాన గీతం - అన్నమాట.

ఆలా రాసుకున్న అనేక పాటలు కొందరు పెద్దలు నేను సినిమా రంగంలోకొచ్చాక సందర్భాన్ని బట్టి తీసుకున్న ఉదంతాలు కొల్లలు. 'సప్తపది' చిత్రంలో 'ఏ కులము నీదంటే గోకులము నవ్వింది' పాట అలా వచ్చిందే. ఇప్పుడు అటువంటిదే 'మనోహరం' పాటగాను మనోహరమైన పాటగాను పేరు తెచ్చుకున్న 'మనోహరం' చిత్రంలోని 'పుచ్చా పూవుల విచ్చేతావుల- వెచ్చా వెన్నెలలు' అనేపాట.

పాటలు రాసే ప్రతీవారికి ఆ పాట ఎలా పాడాలో తెలిసి ఉంటుంది. పూర్వం నుంచి గేయ రచయితలు ఉన్నారు. సంగీత దర్శకులు లేరు. గొప్ప గాన కోవిదులున్నారు. వారికి పాటలు రాయడం రాదు.రాసిన పాటను ఆలపించడమే వచ్చు. బాణీ కట్టడము, పాటరాయడం, రెండు తెలిసిన, ఎంతో తెలిసిన మహా పురుషులున్నారు. వారే మన వాగ్గేయకారులు ముత్తుస్వామి దీక్షితులు, త్యాగరాజు, శ్యామశాస్త్రి వంటివారు. వారి కీర్తనలు వారి బాణీలలో పాడవలసినదే.

వెనకటి శతాబ్దంలో కూడ మహాపురుషులు శ్రీ తూము నరసింహదాసు, ఆదిభట్ల నారాయణదాసు, ప్రయాగ రంగదాసు, పాపట్ల కాంతయ్య, దైతా గోపాలం వంటివారు ఉండేవారు. నిన్నటి శతాబ్దపు ప్రథమ దశకాలలో సినిమా అవతరించినప్పటి నుంచి దాదాపుగా ఒక కొత్త సంప్రదాయం సంగీత దర్శకత్వమనే పేర చోటుచేసుకుంది. అలా వచ్చి వచ్చి గంగ హుగ్లీగా తయారయ్యినట్టు ఏ స్థితికి వచ్చిందో తెలియని ప్రేక్షకుడు, శ్రోత లేరు. విష్ణుపంత్ ఫగ్నీస్, బాలగంధర్వ, నౌషాద్, మదన్ మోహన్, చిత్తూరు నాగయ్య, సాలూరి రాజేశ్వరరావు, సుసర్ల దక్షిణామూర్తి, పెండ్యాల నాగేశ్వరరావు, ఘంటసాల, కె.వి.మహదేవన్, రమేష్‌నాయుడు వంటివారు అక్షర సరస్వతిని స్వరకుసుమాలతో అర్చించి ఆలోచనామృతాన్ని ఆ పాతమధురంగా అందరికి అందించారు.

సరే... ఇది అటుంచితే, పాటలు రాసేవాడికి ఒక ట్యూన్ ఉంటుందని ఇది వరకే చెప్పాను కదా. ఇప్పుడు మనోహరం పాటకి నేను కట్టుకున్న ట్యూన్‌లోనే కొన్ని హంగులమర్చి ముస్తాబు చేసి సంగీత దర్శకుడు రికార్డు చెయ్యటం జరిగింది.

"పుచ్చా పూవుల విచ్చే తావుల వెచ్చావెన్నెలలు
అచ్చా మీగడలిచ్చే తీయన తెచ్చే నీ కలలు"
వచ్చీనాయమ్మ విచ్చీనాయమ్మ
వచ్చీనాయమ్మ కలువలు విచ్చీనాయమ్మ"

అనే పల్లవితో మొదలవుతుందీ పాట. ఇది శరద్రాత్రుల వెన్నెల గీతం. ఆహ్లాదం దీని లక్షణం. దీని వర్ణం తెలుపు. దీని రూపం ఏటిగాలి. అది మందం, మలయజం. నీలగరి కన్నెలు నీలాలలో ఎగిరే తెల్లబారు కొంగలను చూసి తెల్ల కలువలలో మోము దాచుకుంటూ, సిగ్గుతో తమలో తాము పాడుకునేపాట. కుశలాయకం, కుచ్చెలకథ వంటి జానపద రామాయణ గీతాలలో వెన్నెలలో నదీ విహారాలు చూస్తూ పాడే జాజర పాటల బాణీలు ఎంతో చల్లనిది, నీలంగిరి కన్నెల పాటల వంటివి. అన్నమయ్య గూగూగూ, జాజర, ఏల, వంటివి. ఉదాహరణకు 'చల్లనై కాయగిదో చందమామా' వంటి పాటలు మనకు సంప్రదాయకంగా వస్తున్నవే. వాటి బాణీలే వాటికి ప్రాణవాయువులు- ఆ బాణీలలో ఒకటి నాచేత ఈ పాట రాయించడానికి దోహదం చేసింది. అదే బాణీలో ఈ పాట రికార్డు చేయడం జరిగింది.

మా అమ్మగారి పుట్టిల్లు కృష్ణాతీరం తెనాలి తాలూకా కొల్లూరు గ్రామం. ఇటు ఊరు, అటు ఏరు. ఆ ఏరుపేరు కృష్ణవేణి. పంచ గంగలలో ఒకటి. అక్కడ కృష్ణానదినీ, ఆమె వైశాల్యాన్నీ, ఇసుక తిన్నెలలో ఆమె వయ్యారాన్ని అపార జల సంపదతో నీలాదేవిగా వున్న ఆమె వైభవాన్ని చూసినప్పటిదీ అనుభవం. అటు శ్రీకాకుళం- అదే ఆంధ్ర విష్ణుక్షేత్రం, ఇటు కొల్లూరు- నడుమ అనంత వైభవంతో ఆమె సాక్షాత్కరించే తీరు ఆనాటి నా పసి మనసును ఆకట్టుకుంది. నాకొక మిత్రుడుండేవాడు. సంస్కృతాంధ్ర, హిందీ

| | | |
|---|---|---|
| చిత్రం | : | మనోహరం |
| పాడినవారు | : | ఎన్.పార్థసారధి, చిత్ర |
| సంగీతం | : | మణిశర్మ |
| అభినయం | : | జగపతిబాబు, లయ |



అ : పుచ్చా పూవుల విచ్చే తావుల వెచ్చా వెన్నెలలూ
అచ్చా మీగడలిచ్చే తీయన తెచ్చే నీ కలలు
వచ్చీనాయమ్మా విచ్చీనాయమ్మా
వచ్చీనాయమ్మా కలువలు విచ్చీనాయమ్మా

ఆ : ముద్దాబంతులు మునిగోరింటలు మురిసే సంజెల్లో
పొద్దే ఎరుగని ముద్దే తరగని రస నారింజల్లో
వచ్చీనాయమ్మా విచ్చీ నాయమ్మా
వచ్చీనాయమ్మా కలువలు విచ్చీనాయమ్మా

అ : గువ్వ జంటలకు కువకువ ఇటు కుర్ర గుండెలకు మెలకువ
ఆ : వీణ మీటె సెలయేరు చలి వేణువూదె చిరుగాలీ
అ : కలువ కలువలోనా కలవరింతలాయె
ఆ : చలువ తనువులోనా జలదరింతలాయే
ఓ... ఓ... ఓ...
అ : పిండి వెన్నెల వండి వార్చిన వెండి ఇసుకల్లో
ఆ : తెల్లా మబ్బుల వెల్లా వేసిన పిల్ల కాలువల్లో
వచ్చీనాయమ్మా వచ్చీ నాయమ్మా
వచ్చీనాయమ్మా అలజడులొచ్చీనాయమ్మా
ఆ : లేత పచ్చికల అణకువ నునులేత మచ్చికల కువకువ
అ : నిండు అల్లికల నవనవ తలదిండు మల్లికల శివశివ
ఆ : పట్ట పగటి ఎండా పండువెన్నెలాయే
అ : నిట్టనిలువు తపనే నిలువ నీయదాయే
ఓ... ఓ... ఓ...
ఆ : ఓరా వాకిలి తీసీ తీయని దోరా వయసుల్లో
మాఘా మాసపు మంచు బెబ్బులి పొంచే వేళల్లో
వచ్చీనాయమ్మా విచ్చీనాయమ్మా
వచ్చీనాయమ్మా వలపులు విచ్చీనాయమ్మా
॥పుచ్చాపూవులు॥



భాషలలో మంచి ప్రవేశమున్నవాడు. నేను సెలవులకు వచ్చినప్పుడల్లా ఇద్దరం అక్కడకు వెళ్ళేవారం. ఆ నది ఒడ్డున కూర్చునేవాళ్ళం. అదిన్నీ, జన సమ్మర్దమున్న పడవల రేవుకు దూరంగా ప్రపంచమంటె మేమిద్దరమేనేమో అన్నంత ఏకాంతంగా. దూరాన ఆవలి ఒడ్డున శ్రీకాకుళ ఆంధ్ర విష్ణుదేవాలయ గోపుర ద్వయం కనిపిస్తుంటే ఆ రెంటిమధ్యనుంచి జపాకుసుమ సంకాశుడైన సూర్యభగవానుడు ఉదయిస్తుంటే, ఆ కషాయ దీధితులు కృష్ణవేణమ్మకు బంగారు నీరు పోస్తుంటే ఎన్నిసార్లు చూశామో. కళ్ళు కవిత్వాలు పాడుతుంటే విన్నామో!



ఎగబోసుకుంటున్న ఏటిగాలికి అక్కడ మా తనువులు వేణువులై పాడేవి. హంస తూలికలై ఆకాశంలో శరత్కాల చంద్రుని కోసం తేలిపోయి, తెల్లమబ్బుల మీద వాలేవి. ఇరు పొద్దులు ఈ విధంగ జరిగిపోతుంటే, పట్టపగటి అనుభవాలు అచ్చతెలుగులా మనస్సులో హత్తుకుపోయేవి. ఏటి నడుమ లంకలలో పప్పుధాన్యాల పంటలలో, బంతులు, చామంతులు, గోరింటలు, మలిసందెలతో పేరంట మాడుతుంటే ఆ ముచ్చట ముగిసిందో లేదో ఏరు కోనేళ్ళు కట్టిన చోట వెన్నెల పొడకు విచ్చే కలువలు, వచ్చే కలువ గంధాలు చవి చూసిన జన్మలివి. మూచూసిన జాతకాలివి. రాత్రి అవుతుంటే గువ్వజంట గూడు చేరుకొని కువకువ లాడుతుంటే లోకమంతా ఆదమరచి నిదురించే వేళ మేలుకుంటున్న మా కుర్రగుండెల సందడి మరపురాని అనుభూతి. ఆ పరిసరమే ఒక స్వరాల సరము.

**"గువ్వజంటలకు కువకువ**
**ఇటు కుర్రగుండెలకు మెలకువ**
**వీణమీటె సెలయేరు**
**చలి వేణువూదె చిరుగాలి**
**కలువ కనులలోన కలవరింతలాయే**
**చలువ తనువులోన జలదరింతలాయే"**

ఇంతలో శరద్రాత్రి. వినీలాకాశంలో వెన్నెల పింజెలా అన్నట్లు తెల్ల మబ్బులు హుటాహుటిని పరుగులు తీస్తుంటే పిండార బోసిన వెన్నెలలో ఆ కృష్ణాతీరంలో, నీరంలో,పులిన కేదారంలో మరెన్ని వింతలు, ఎన్నెన్ని కవ్వింతలు!

**"పిండీ వెన్నెల వండీ వార్చిన**
**వెండీ ఇసుకల్లో**
**తెల్లా మబ్బులు వెల్లావేసిన**
**పిల్లకాలువల్లో**
**వచ్చీనాయమ్మా అలజడులొచ్చీనాయమ్మా-"**

అప్పుడా చుట్టుప్రక్కల ప్రదేశము కర్పూరము. వెన్నెల జాలుపడ్డ నీలాల కృష్ణ తెల్లని శ్రీశైలగోపురానికి నిలువుటద్దం. పాల సముద్రపు సింధుశాఖ.

మాస్టారు విశ్వనాథ సత్యనారాయణ గారు ఋతుసంహారం అనే మధుర లఘు కావ్యం వ్రాశారు. నా దృష్టిలో మాస్టారు ఆ కావ్యంలోని అక్షరాలతో కృష్ణాతీరపు ఋతువుల సౌందర్యాన్ని సజీవ శిల్పాలుగా చెక్కారు. ఛాయా చిత్రాలు తీశారు. పంచవన్నెల చిత్రపటాలు గీశారు. ఆ కావ్యాన్ని కళ్ళారా కృష్ణాతీరంలో చూశాను. చూసినప్పటి పులకింతే ఈ పాట.

అటుపైన హేమంతం పుట్టుకొస్తుంది. మంచుతెరల చాటున కృష్ణవేణమ్మ దోబూచులాడుతుంది. మంచు మబ్బులు వచ్చి కృష్ణలో స్నానం చేసి పోతుంటాయి. తెలి మంచు దొంతరలు ఆమె నీటి శరీరానికి వెండి వన్నెలు తేవాలని ఆమె మీద పరుచుకు పోతుంటాయి. ఒడ్డూ కనబడదు. వచ్చే నావా కనబడదు. ఏది ఇసుకో, ఏది ఏరో తెలియదు! పల్లీయులు ప్రాతః కాలంలో పొలం పనులకు కదిలిపోతూ ఉంటారు. గంగపుత్రులు వలలు చేతబట్టిసాగుతారు. సరంగులు సరేసరి. నాలుగు గంటలకే ఏటిలో మొదటి పడవ వదులుతారు. పచ్చని ప్రకృతినిండా పచ్చికలు. ఆ పచ్చికలనిండా మంచు ముత్యాల మాలికలు. పువ్వుపువ్వున మంచు బిందువుల తళుకులు కులుకులు. తడిసి ముద్దయిన పచ్చికలు తలలెత్తలేక బాటసారుల కిర్రు చెప్పుల పాదాల తొక్కిళ్లకు తలవంచి ముత్యపు రజను పూసుకున్న ఆకు పచ్చ అందాలతో ఉన్న దృశ్యము. చలిమంటలు- సరసన పిల్లదీ, పిల్లాడు-ఏవో మచ్చికలు, అచ్చికలు, బుచ్చికలు ఈ ఘట్టంలో

**"లేత పచ్చికల అణకువ నునులేత మచ్చికల కువకువ**
**నిండు అల్లికల నవనవ తలదిండు మల్లికల శివశివ**
**పట్టపగటి ఎండా పండు వెన్నెలాయె**
**నిట్ట నిలువు తపనే నిలువ నీయదాయే-"**

దీనికి వ్యాఖ్యానం పాడిమాటలతో కుదిరేది కాదు. తడిసిన వాళ్ళకే తలకెక్కే విషయము.

విశ్వనాథవారు-

**"తలుపింత ఓరావాకిలి తీయనియ్యరు**
**ఉహుహంచు గొంతు కూర్చుండి తిం(డ్రు**
**చల్లపోసి కొనంగ చలివేసే జిహ్వకు**
**మంచి నీళ్లులు త్రావ మణగే నాల్క"**

అన్నారు ఈ అవస్థను గురించే.

అదే నా పాటకు చరణమయ్యింది.

**"ఓరా, వాకిలి, తీసి తీయని దోరా వయస్సులో**



**మాఘమాసపు మంచు బెబ్బులి పొంచే వేళల్లో**
**వచ్చీనాయమ్మా వలపులు విచ్చీనాయమ్మా"-**

అయితే మనోహరం సినిమాలో కృష్ణాతీరం లేదు. ఏ అందాలు చూసి ఈ గీతం వ్రాశానో వాటి ఆచూకీ కూడ ఉండదు. పాట బాగుందని అందులో వాడుకోటం జరిగింది. గ్రాఫిక్స్‌తో చక్కగా తమ పరిధి మేరకు సందర్భానికి సమన్వయం చేసుకుంటూ చిత్రీకరించారు ఈ పాటను. ఇందుకు దర్శకుడు శ్రీ గుణశేఖర్ నిర్మాత శ్రీ మధుమురళి అభినందనీయులు.

**- వేటూరి సుందరరామ్మూర్తి**

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు

4

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం.

ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.





## జరిగిన కథ

వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక దూరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన కేకును వాళ్ల పాప అనూహ్య పొరపాటున రుచి చూస్తుంది. అది చూసి కంగారు పడిన వెంకట్రావు దంపతులు అనూహ్యను ఆసుపత్రికి తీసుకెళతారు. విజిటింగ్ టైం కాదని అడ్డుపడ్డ కాంపౌండరుకు లంచం సమర్పించి డాక్టరు వద్దకు వెళతారు. అతడు అనూహ్యను పరీక్షించి రెండు పేజీల టెస్టులు రాసి హ్యాట్ ఆన్ హెడ్ అనే ఊరిచివరి డయాగ్నస్టిక్ సెంటరుకు పంపిస్తాడు.

(ఇక చదవండి)

"దోపిడీలు జరిగే ప్రదేశాలేవేంటి?"
"బేంకులు, రైళ్లు, బస్సులు మరియు హాస్పిటల్స్"
నిజమో కాదో ఈ సీరియల్ చదివి తెలుసుకోండి.

ఎలుక వచ్చె ఇల్లు భద్రం

పదిహేను నిముషాల తరువాత లోపలి నుంచి బయటకొచ్చాడు డాక్టర్ దైవాధీనం. చేతిలో ఒక ఫైలుంది. "ఇవిగో మీ రిపోర్టులు. వీటికి సాధారణంగా ఒక రోజు పడుతుంది. కానీ డాక్టర్ దుర్యోధన్ క్లయింట్స్ కావడం వలన ఎమర్జెన్సీ కింద మోస్ట్ కాస్ట్లీ కెమికల్స్ ఉపయోగించి త్వరగా తయారు చేశాను. దీనికి ఆరువందలు ఎక్కువౌతుంది" నిదానంగా చెప్పాడు.

"పదిహేను నిముషాల్లో ఇన్ని రిపోర్టులు తయారు చేశారా?" ఆశ్చర్యంగా అడిగారు వెంకట్రావు, సుందరి.

"ఏం చేస్తాం? అర్జెన్సీ. త్వరగా డబ్బులివ్వండి ఈ రిపోర్టులను వెంటనే డాక్టర్ దుర్యోధన్‌కు చూపించి పావ కు ట్రీట్‌వెంట్ స్టార్ట్ చేయించండి. ఆల్ ద బెస్ట్" అన్నాడు దైవాధీనం.

ముఖం మాడ్చుకుని పదివేల రూపాయల కట్ట ఇచ్చాడు వెంకట్రావు. సుందరి కళ్ళు చెరువులయ్యాయి.

"డాక్టర్...మిగిలిన చిల్లరిస్తే ఆటోకిస్తాం" పళ్ళుకొరుక్కుంటూ అన్నాడు వెంకట్రావు.

"ఓహ్...అయాహ్మ్ సారీ" వదివేల రూపాయల కట్టలోంచి నాలుగు కాగితాలు తీసి వెంకట్రావుకిచ్చాడు దైవాధీనం.

తిరిగి ఆటో బయల్దేరింది.

"దొంగముండా కొడుకులు! పదిహేను నిముషాలలో ఇన్ని పరీక్షలు చేశాడా! ఈ దరిద్రపు ఎలుక మూలంగా పెద్ద రొంపిలో దిగబడ్డాం." బండ బూతులు తిట్టసాగాడు వెంకట్రావు.

అనూహ్య మాత్రం ఇద్దరి మధ్యా కూర్చుని నానా అల్లరి చేనస్తున్నది. పావం! దానికీ సంగతులేం తెలియవు.

గంటకల్లా హాస్పటల్ ముందు ఆగింది ఆటో.

"ఎంతైంది?" అడిగాడు వెంకట్రావు.




"నాలుగు వందల అరవై సార్" మీటర్ చూస్తూ చెప్పాడు డ్రైవర్

"మైగాడ్! ఆ డబ్బుతో తిరుపతి పోయి రావచ్చు గదయ్యా...?" కోపంగా అన్నాడు వెంకట్రావు.

"ఇపుడు మీరు వెళ్ళొచ్చింది అక్కడికే సార్. పదివేలు ఆ దొంగ వెధవకు సమర్పించుకున్నారు. కష్టం చేసినవాడికి న్యాయమైన డబ్బులివ్వడానికి అలా అల్లాడి పోతారేం?" విసుక్కున్నాడు ఆటోవాలా.

"అతను చెప్పిందీ నిజమే. ఇచ్చెయ్యండి" పాపను ఎత్తుకుని లోపలకు వెళ్తు అన్నది సుందరి.

డ్రైవర్ని పంపించాడు వెంకట్రావు.

* * *

రిపోర్టులన్నీ చదివి ముఖం అదోలా పెట్టాడు డాక్టర్ దుర్యోధన్.

"ఏమైంది సార్" అడిగాడు వెంకట్రావు.

"పాపకు బీపీ, షుగర్ లాంటి వేమీలేవు. ఫరవాలేదు. ఎందుకైనా మంచిది. ఇ.సి.జి. బ్రెయిన్ స్కానింగ్, వైడల్ టెస్ట్, నడుము ఎక్స్‌రే తీయిద్దాం" చెప్పాడు డాక్టర్.

"పావ కు ఈనీజీనా? ఎంత ఈజీగా చెబుతున్నారు? బ్రెయిన్ స్కానింగ్ గట్రా అవసరమా?" ఆవేశాన్ని అణుచుకుంటూ అడిగాడు వెంకట్రావు.

"అవసరమనేది నా అభిప్రాయం. అనవసరం అని మీరు అభిప్రాయపడితే అది మీ ఇష్టం. ఈ రోజుల్లో ప్రతివాడూ డాక్టరే. కానీ ఒక విషయం మాత్రం చెబుతాను. పాప విషం తిని చాలా సేపైంది. అది కాలి వేలు నుంచి తల మీది వెంట్రుక వరకు నరనరాల్లోనూ పాకి ఉంటుంది. ఏ భాగమైనా ఎఫెక్టయిందేమోనని నా అనుమానం. ఒక వేళ పాప బ్రతికినా ఏ కాళ్ళో చచ్చుబడి మీ కళ్ళముందే బల్లిలా పాకుతుంటేనో, మెదడు చెడిపోయి రేపు బజార్లో కనిపించిన ప్రతివాడినీ డాడీ అని పిలుస్తుంటేనో భరించవలసింది మీరేకానీ నేను కాదు. ఈ పరిస్థితిలోనే ట్రీట్‌మెంట్ చెయ్యమని మీరంటే అలాగే చేద్దాం." అన్నాడు డాక్టర్.

సుందరి భయంతో వణికింది.

"వద్దండీ వద్దు. అలాంటి స్థితిలో నా ఒక్కగానొక్క కూతుర్ని నేను చూడలేను. అలాగే చేయిస్తాం." అన్నది.

"వెంటనే వెళ్లి చాదర్ ఘాట్ బ్రిడ్జి కింద డండం డయాగ్నస్టిక్ సెంటర్‌లో చేయించుకు రండి" ప్రిస్క్రిప్షన్ ప్యాడ్ మీద రాస్తూ చెప్పాడు డాక్టర్.

"వీటికెంతౌతుంది?" అడిగాడు వెంకట్రావు.

"వాళ్ళు డబ్బు మనుషులు కారు. మహా

**ఎటుక వచ్చె ఇల్లు భద్రం**

**అతి తెలివి డయాగ్నస్టిక్ సెంటర్ యజమాని?**
**పేషెంట్ అమాయకుడైతే డాక్టర్ సంతకాన్ని కూడా ఒక టెస్టుగా చెప్పి డబ్బు గుంజేవాడు.**
**ఇటువంటి వారితో వెంకట్రావు అనుభవాలు ఈ సీరియల్‌లో చదివి తెలుసుకోండి.**

అయితే రెండు మూడు వేలౌతాయి. నేను ఫోన్ చేసి చెబుతాను. రెండు మూడొందలు తగ్గిస్తారు. నా పేషెంట్ల కోసం ఈ మాత్రం హెల్ప్ చెయ్యకుండా ఎలా ఉంటాను" నవ్వుతూ చెప్పాడు డాక్టర్.

మళ్లీ ఆటో ఎక్కారు దంపతులు.

అరగంట పాటు పాతిక సందులు గొందులు వెతగ్గా డండం డ.సెం. దొరికింది. లోపల పాడవాడి గెడ్డం పెంచుకున్న ఒక వ్యక్తి కూర్చున్నాడు.

ప్రిస్క్రిప్షన్ అందించాడు వెంకట్రావు.

''వీటికెంతవుతాయండీ'' అడిగాడు వెంకట్రావు.

"వీటికి రెండువేల ఒక..." గెడ్డపాయన చెబుతుండగా ఫోన్ మోగింది.

"హల్లో..."

"నా పేషెంట్లు వచ్చారా?"

"ఇపుడే వచ్చారు సార్"

"వాడు గవర్నమెంట్ ఎంప్లాయ్. బాగా లాగు మూడు వేలౌతాయని చెప్పు."

"హాజీ...హాజీ...ఎక్కువ..."

"ఏం ఫర్వాలేదు లక్షలు పెట్టి హాస్పిటల్ కట్టాను. ఎప్పుడు రికవరీ కావాలి? ఎన్ని కమిషన్లొస్తే! కనీసం రెండువేల ఐదొందలైనా లాగు. ఏవందో నూటేభయ్యో అన్నావంటే ఇక నుంచీ పేషెంట్లను పంపను."

"వద్దొద్దు సార్...మీరు చెప్పినట్లే చేస్తాను"

"మరి నా కమిషన్ ఎపుడు పంపిస్తావ్? నిన్నటి కమిషన్ ఈ రోజు వరకూ రాలేదు"

"ఈ రోజే సార్...డోంట్ వర్రీ" ఫోన్ పెట్టేశాడు గెడ్డపాయన.

"ఎవరు?" అడిగాడు వెంకట్రావు.

"మీరిట్లా రికమెండెషన్లు తెస్తే ఎలా సార్...




మీ డాక్టర్ గారే ఫోన్ చేశారు. మీకు బాగా డిస్కౌంటివ్వమని గట్టిగా చెబుతున్నాడు మాకు దీంట్లో మిగిలేదేంటి? అంతా కెమికల్స్‌కే సరిపోతుంది" కోపం నటించాడు గెడ్డపాయన.

"వీటికెంతౌతాయో చెప్పలేదు"

"రెండువేలా ఒక తొమ్మిది వందలౌతుంది. నాలుగొందలైనా తగ్గించమని డాక్టరు గారు చెప్పారు. ఇటువంటి డాక్టర్లు నలుగురు దొరికారంటే మేం ఈ సెంటర్ మూసేసి మిరపకాయబజ్జీలమ్ముకోవాల్సిందే. రెండు వేలా ఐదువందలైనా ఇవ్వండి" ముఖాన్ని దీనంగా పెట్టాడు గెడ్డపాయన.

"అలాగే కానివ్వండి" చెప్పాడు వెంకట్రావు.

పాపను లోపలకు తీసుకెళ్ళాడు గెడ్డపాయన.

"పాపం మన డాక్టర్ చాలా మంచివాడండి. అక్కడా కొంచెం తగ్గించమన్నాడు. ఇక్కడా కొంచెం తగ్గించమన్నాడు" అన్నది సుందరి.

"అలాగే ఉంది. పేషెంట్ల కోసం ఇంత శ్రద్ధ తీసుకునే వాళ్ళెవరున్నారు ఈ రోజుల్లో? మన అదృష్టం కొద్దీ మంచి డాక్టరు దొరికాడు" తృప్తిగా అన్నాడు వెంకట్రావు.

పదినిముషాలలో పాపతో బయటకు వచ్చాడు గెడ్డపాయన.

''ఒక అరగంట వెయిట్ చెయ్యండి రిపోర్టులిస్తాను" చెప్పి మళ్ళీ లోపలికెళ్ళాడు.

"అరగంటలో అవుతాయా?" అడిగింది సుందరి.

"పాపకేదో సీరియస్‌గా ఉందని, వెంటనే రిపోర్టు పంపకపోతే తోలు వలుస్తానని చెప్పారు డాక్టరుగారు. లేకపోతే సాధారణంగా రిపోర్టులన్నీ రాత్రి ఏడున్నరకుగానీ ఇవ్వం" చెప్పి మళ్ళీ లోపలకెళ్ళాడు గెడ్డపాయన.

ఇరవైనిముషాలలో రిపోర్టులతో బయట కొచ్చాడు.

"అంతా నార్మలే ఉంది. భయంలేదు" ఇస్తూ చెప్పాడు.

వాటిని తీసుకుని హాస్పటల్‌కు వచ్చారు దంపతులు. అన్నీ శ్రద్ధగా చదివాడు డాక్టర్.

''అదృష్టవంతులు. పాపకు పెద్ద ప్రమాదమేమీ లేదు. చిన్న ట్రీట్‌మెంట్ చాలు. ఈ మందులు రెండురోజులు వాడండి. తగ్గిపోతుంది" మందులు రాసిచ్చాడు.

"చాలా థాంక్స్ సార్. మీ ఫీజ్...!" అన్నాడు వెంకట్రావు.

"పెద్ద ట్రీట్‌మెంట్ చేసిందేమీ లేదుగా వెయ్యి రూపాయలివ్వండి చాలు. పేషెంట్స్‌ను దోచుకోవడం నాకిష్టముండదు" నవ్వుతూ చెప్పాడు డాక్టర్.

వెంకట్రావుకు మండిపోయింది. కోపాన్ని నిగ్రహించుకున్నాడు. డబ్బు తీసిచ్చాడు.

ఇంటికొచ్చారిద్దరూ.

"డాక్టరు మీద నాకేదో అనుమానంగా ఉంది. ఈ మాత్రం దానికి ఇన్ని టెస్టులు చేయించాల్నా?" ఆలోచిస్తూ అన్నది సుందరి.

''ఆ టెస్టులన్నిట్లోనూ వాడికి కమిషనుంటుంది. అంతా దోపిడీ దొంగలు" అన్నాడు వెంకట్రావు.

"ప్రాణానికేమైనా వస్తే దేవుడిలా కాపాడేవాడు డాక్టరు. అటువంటి వాళ్ళు ఇలా దోపిడీ దొంగల్లా ప్రవర్తిస్తే ఇక సామాన్యులను రక్షించేదెవరు?" నిట్టూరుస్తూ అన్నది సుందరి.

"అంతా నీ వెధవ సలహా మూలంగానే



కొన్ని డయాగ్నస్టిక్ సెంటర్లు పేషెంట్లతో కిటకిటలాడిపోతుంటాయి. కొన్ని సెంటర్లు గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంటాయి.
కారణం ఏమిటి?
ఈ సీరియల్‌లో వెంకట్రావు అనుభవాలు చదివితే నిజం మీకే తెలుస్తుంది.

## ఎలుక వచ్చె ఇల్లు భద్రం

అయింది. బోడిముండ ఎలుక కోసం పద్నాలుగు వేలు వదిలాయి." అరిచాడు వెంకట్రావు.

"బావుంది మధ్యలో నేనేం చేశాను? ఎలుకలకు మందు పెట్టేటపుడు ఏ బీరువా చాటునో ఫ్రిజ్ కిందనో పెట్టాలి కానీ ఎక్కడంటే అక్కడ పెట్టడమేనా? ఆఫ్టరాల్ ఒక్క ఎలుకను చంపడం చేతకాలేదు కానీ పెళ్ళాం మీద మాత్రం ఎగురుతారు" కోపంగా అన్నది సుందరి.

"నువ్వు చంపావుగా ఇంట్లో వస్తువులన్నీ పగలగొట్టి"

"మీరు చంపలా అర్థరాత్రి పోలీసుల్ని పిలిపించి"

"మాటకు మాటంటే నాకు వళ్ళుమండుతుంది"

"ఏం? నాకు వళ్ళు లేదా? అది మాత్రం మండదా?"

"ఛీ ఛీ...నీతో వాదన పెట్టుకోవడం అంటే బుద్ధి లేనట్లే"

"ఇప్పటికైనా తెలుసుకున్నారు"

"ఛత్...నీ మొహం చూస్తుంటేనే అసహ్యం వేస్తుంది"

"కోపం వచ్చినపుడు మీ మొహాన్ని ఒకసారి అద్దంలో చూసుకోండి"

అద్దం ముందు నిలబడి తన ముఖాన్ని చూసుకున్న వెంకట్రావుకు కోపంలో తన ముఖం ఛండాలంగా ఉంటుందని అర్థమైంది. దాంతో కొంచెం తగ్గాడు. ఐదు నిముషాలు గడిచాయి.

"ఏం చెయ్యాలో తోచడం లేదు. కాసిని మంచి కాఫీ పట్రా. తాగితే ఏవైనా అయిడియాలు వస్తాయేమో చూద్దాం" అన్నాడు.

సుందరి వంటింట్లో కెళ్ళి కాఫీ తెచ్చి అందించింది.

"ఏవైనా వచ్చాయా అవిడియాలు?" అడిగింది వెంకట్రావు కాఫీ తాగిన తరువాత.

"ఎగతాళి చాల్లే. ఏమీ రావడం లేదు"

"చెట్టు కింద కూర్చుంటే కవిత్వం వస్తుందా? బోధి వృక్షం కింద కూర్చున్న ప్రతివాడూ బుద్ధుడౌతాడా? అసలు బుర్రలో లేనివి కాఫీలు టీలు తాగితే వస్తాయా?"

"అదే మంచిది కాదు. డాక్టర్ చేసిన మోసంతో బుర్ర మొద్దుబారి పోయింది."

"మొత్తానికి బుర్ర అనేది ఉందంటారు."

"ఈ పనికిమాలిన మాటలాపి ఏదైనా ఉపాయం చూడు"

"అలారండి దారికి. కాణీ ఖర్చులేని ఉపాయం చెబుతాను"

"అపాయమేమీ ఉండదు కదా"

"మనం జాగ్రత్తగా ఉంటే అలాంటిదేమీ ఉండదు"




"ఏంటది?"

"ఎక్కడైనా మంచి పిల్లిని పట్రండి ఎన్ని ఎలుకలనైనా చీల్చి చెండాడు తుంది"

"పిల్లా? ఇదేంగోల మధ్యలో?"

"పోనీ...మంచి త్రాచుపామును పట్రండి."

"త్రాచుపామా? అదెందుకు?"

"ఈ సృష్టిలో ఎలుకను తినేది పిల్లి, పాము రెండే. ఏది ఈజీ అనుకుంటే దాన్నే తెండి."

"మళ్ళీ ఎగతాళా?"

"మరి లేకపోతే ఏంటి? ప్రమాదం లేని జంతువును తెమ్మంటే గోల అంటారు."

"అది మ్యావ్ మ్యావ్ అంటూ గోల చేస్తుంది కదా"

"ఏం చేద్దాం మరి? భగవంతుడు దానికి ఆ అరుపే ప్రసాదించాడు. అయినా అది ఏం పెద్ద సౌండు? ఒక గదిలో అరిస్తే రెండో గదిలోకి వినపించదు. కుక్క అరిస్తే ఊరంతా వినిపిస్తుంది.

"సలహా బాగానే ఉంది. మరి దాని పోషణ?"

"దానిదేం పెద్ద పోషణ? అదేమైనా ఏనుగా గుర్రమా? ఉగ్గిన్నెడు పాలు చాలు. మనం అన్నం తినేటపుడే కంచం పక్కన ఇంత పెరుగన్నం పడేస్తే చాలు ఏవంటారు?"

"కరక్టే...కానీ ఎన్నాళ్ళావిధంగా?"

"ఎన్నోనాళ్ళా? అది ఎలుకను పట్టిందాకా"

"బాగానే ఉంది. అదేమైనా కాంట్రాక్టు మీద వస్తుందా? ఎలుకను పట్టగానే వెళ్ళిపోడానికి? దాన్ని వదిలించుకోవడం చాలా కష్టం."

"అది మీ లాంటి ఉపాయాలు తెలియని వాళ్ళకు నాలాంటి వాళ్ళకు కాదు."

"అంటే అదీ ఆలోచించావా?"

"మరి! నాదేం మీలా మట్టి బుర్రకాదు"

"ఎలాగో చెప్పు చూద్దాం"

"అది ఎలుకను పట్టగానే దానికి తిండి పెట్టడం మానేద్దాం. దాంతో ఆకలికి నకనకలాడి దానంతటదే మరో చోటికి పోతుంది" నవ్వుతూ అన్నది సుందరి.

"భగవంతుడు నీ బుర్రలో హైబ్రీడ్ ఎరువువేశాడోయ్. లేకపోతే ఇన్నిన్ని అయిడియాలు ఎలావస్తాయి?" అన్నాడు ముగ్ధుడైపోతూ.

"మరేం అనుకున్నారు? ఆడదంటే ఆదిశక్తి. తలచుకుంటే సృష్టిచెయ్యనూ గలదు. నాశనం చెయ్యగలదు."

"ఒప్పుకుంటున్నాను. కానీ పిల్లినెలా పట్టుకురావడం?"

"చంకలో పెట్టుకుని"

"మళ్ళీ ఎగతాళి"

"మరేంటి? మీకు ప్రతిదీ చెప్పాల్సిందే. ఎవరైనా ఫ్రెండు నడిగి మంచి పిల్లిని తెండి."

"ఓ.కే...రేపు ఆఫీసులో అడుగుతాను"

**(ఇంకావుంది)**



ఏప్రిల్ 23 న బడే గులాం అలీఖాన్ వర్ధంతి సందర్భంగా...

# హిందుస్తానీకే "బడే" గులాం అలీఖాన్



✹ 1945లో ఒకరోజు మహాత్మాగాంధీ సమక్షంలో చేసిన కచేరి గులాం అలీఖాన్ జీవితంలో మరువలేనిది. ఈయన గాన వైశిష్ట్యానికి పొంగిపోయి మరోసారి పాడమన్నారాయన. సంతోషంతో కచేరీ చివరలో తాను స్వయంగా వడికిన నూలు దండను అలీఖాన్ మెడలో వేసి మెచ్చుకుంటూ "నీవు గులాం అలీఖాన్‌వే కాదు హిందుస్తానీలో "గొప్ప"గా ఎదగాలి అందుకే పేరు కు ముందు ''బడే'' (పెద్ద/గొప్ప) చేర్చుతున్నాన్నారాయన.

✹ గులాం అలీఖాన్ పుట్టింది లాహోర్‌లో. 1902 లో. తండ్రి ఉస్తాద్ అలీబక్ష్, చిన్నాన్న ఉస్తాద్ కాల్‌ఖాన్‌లు ఇద్దరూ సంగీతంలో ఉద్దండులే. తొలి గురువు చిన్నాన్న వద్దే 7వ ఏట శిక్షణ మొదలెట్టి 10 ఏళ్ళుగా శిష్యరికం చేసారు. ఆయన మరణానంతరం తండ్రి వద్ద మరో పదేళ్ళ సాధన కొనసాగించారు. సారంగివాదనలో చేయి తిరిగినా గాత్ర సంగీతం పైనే మక్కువ చూపారు.

✹ 1940లో కలకత్తాలో తొలి కచేరీతోనే సంచలనం సృష్టించిన బడేసాబ్ ఆ తరువాత గయ, బొంబాయిల్లో జరిగే సంగీతోత్సవాల్లో తప్పనిసరిగా కచేరీ చేసేవారు.



బడే గులాం అలీఖాన్, ఎం.ఎస్.సుబ్బలక్ష్మి

✹ 23వ ఏటనే మెగాఫోన్ కంపెనీవారు ముల్తానీరాగం మీద రికార్డు విడుదల చేసారు. ఇదే తొలి రికార్డు మ గ రి సా. శబ్ద ప్రపంచంలో అతి రమణీయంగా ఈయన గాత్రం నర్తనమాడేది.

✹ బడేసాబ్ మానవస్పందనలన్నిటి సమాగమంతో అపూర్వ సంగీత రసధునిని సృష్టించారు. వాటిలో

"జైసీ కారియో వైసీ ధురియో'

'బోల్ భాయ్ తోరిబాత్ తాకత్ పియా"

"తిన్‌కికా కరోబాత్"

"ప్రేమ్‌కి మార్ కతార్" కొన్ని మాత్రమే.

✹ పాటియాలా ఘరానాకు పెట్టనికోట బడే గులాం అలీఖాన్. ఇంకా మరో మూడు గాయక సంప్రదాయాలను ఆయన అదే సాధికారతతో పాడేవారు. అవి ధృపద్, జైపూర్, గ్వాలియర్ ఘరానాలు. "ఠుమ్రి"ఆయన కంచుకోట. పూరబి, బ్రిజ్ భాషల్లోనూ ఠుమ్రీలను పాడటం లో ఆయనకు సాటి మరొకరు లేరు.

✹ కచేరీల్లో తలమునకలై ఉన్నా బడేసాబ్ రేడియోతో తన సంబంధాన్ని వదులుకోలేదు. బొంబాయి ఆకాశవాణి కేంద్రంలో ఆయన గానం ప్రసారమైన ప్రతిసారి శ్రోతల ఉత్తరాలు వేలాదిగా వచ్చేవి. ఆకాశవాణి సంగీత సమ్మేళనం లో ఈయనదే అగ్రాసనం. 1950లో లక్నో రేడియోలో చేసిన కచేరీ ఆయనకు గొప్ప పేరు తెచ్చిపెట్టింది.

✹ దక్షిణ భారతంలోని కర్ణాటక సంగీత విద్వాంసులకు ఈయన అభిమాన గాయకులు. (చెన్నై) పార్థసారథి స్వామి సభలో ఆయన కచేరీలు జరిగేవి. జి.ఎన్.బాల సుబ్రహ్మణ్యం, ఎం.ఎస్.సుబ్బలక్ష్మి, ఎం.ఎల్.వి, వీణా బాలచందర్ వంటివారు ఖాన్ సాహెబ్ ఘంటసాల ఇంటికి అతిథిగా వచ్చినపుడు ఆయనతో ముచ్చటించిన వారే. ఒకసారి ఎమ్మెస్ సుబ్బలక్ష్మి గానం విని "బేటీ ఖూబ్ ఖావో ఖూబ్ గావో" అని ఆశీర్వదించారు.

✹ చివరిరోజుల్లో పక్షవాతానికి గురైనా, వేదికమీదికి తోపుడు కుర్చీపై రావలసి వచ్చినా కచేరీ మొదలెట్టగానే ఆయనలోని సంగీతకారుడు వ్యాధిని జయించి విజృంభించేవాడు.

✹ నౌషాద్ 'మొఘలే ఆజం'లో బడే గులాం అలీచే పాడించిన విషయం పాఠకులకు విదితమే.

✹ బడేసాబ్ 1968 ఏప్రిల్ 23న హైదరాబాద్‌లోని బషీర్‌బాగ్ పాలెస్‌లో అంతిమ శ్వాస విడిచారు.

-పద్మజారాయ్

## మార్కెట్లో ఉన్న కొత్త క్యాసెట్లు




విడుదల : హెచ్.ఎం.వి
వెల : 40/-




విడుదల : హెచ్.ఎం.వి
వెల : 40/-

ఏప్రిల్ 27 న రేడియో మల్లిక్ వర్ధంతి సందర్భంగా...

# లలిత సంగీతంలో వాడని "మల్లిక్"

"తందనానా అహి
తందనానా భళా తందనానా"

రేడియోలో సుప్రభాతవేళ ఈ అన్నమాచార్య కీర్తన వినిపించగానే మనకు గుర్తొచ్చే మంద్రస్వర గాయకుడు "మల్లిక్", రేడియోకు లలిత సంగీతానికి ప్రాచుర్యం కల్పించి పెట్టిన సంగీతకారులాయన.

"మల్లిక్" వ్యవహారనామంగా గల ఆయన అసలు పేరు "కందుల మల్లిఖార్జునరావు". మచిలీపట్టణంలో కందుల వెంకటాచలం లక్ష్మినరసమ్మలకు 1921లో జన్మించారాయన. అక్కడే క్రోవి సత్యనారాయణ శాస్త్రి వద్ద సంగీతంలో తొలి పాఠాలు నేర్చుకున్నా అది ఎంతో కాలం కొనసాగలేదు. అన్నీ వెంటనే పాడటం నేర్చుకోవాలనే తపనతో ఒక పక్క శాస్త్రీయ సంగీతం నేర్చుకుంటూనే అనేకానేక సంగీత విద్వాంసుల రికార్డులు వింటూ వాటితో గళం కలుపుతూ ఏకలవ్యునిలా సాధన చేసారు. ఇదే విషయాన్ని ఆయనే స్వయంగా "వినికిడి వల్ల నేను నేర్చుకున్నది ఎక్కువ. సాధన నాకు సహకరించింది" అని చెప్పుకున్నారు.

గురువు వద్ద సాధన చేస్తుండగా మద్రాసు నుండి అడిషన్ టెస్టు కోసం వచ్చిన రేడియో బృందం ముందు హాజరై తమ అదృష్టాన్ని పరీక్షించుకొమ్మని తన శిష్యులందరినీ వెళ్ళమన్న గురువుగారు తననెందుకు వెళ్ళమనలేదో మల్లిక్‌కి అర్థం కాలేదు. ఆయనకేమో మల్లిక్‌ని తనవద్దే ఉంచుకొని సంగీతంలో నిష్ణాతుణ్ణి చేయాల నుంది. కానీ మల్లిక్ గురువు అనుమతి లేకుండానే అడిషన్‌కి వెళ్ళారు. వాళ్ళు "మీరు ఏం పాడగలరు?" అడగ్గా, "మీకు ఏం కావాలి?" అని ఎదురు ప్రశ్న వేసారాయన. 'మాకు అన్నీ కావాలి' అంటే 'అన్నీ పాడగలనని' సమాధానమిచ్చి కొన్ని పాటలు పాడి సెలక్టయ్యారాయన. ఇది జరిగింది 1943లో.

అప్పటికే మల్లిక్ ఆంధ్రా సైంటిఫిక్ కంపెనీలో ఒక చిన్న ఉద్యోగం చేస్తున్నారు. రేడియో వారి ముందు పాడుతుండగా చివరిలో వచ్చిన గురువుగారు ''బాగా పాడావురా'' అని ప్రశంసించారు. ఎంపికైనట్లు తెలుపుతూ అడిషన్‌వారు "జీతమెంత కావాలని" అడుగ్గా "మద్రాసు నగరంలో అప్పులపాలు గాకుండా బతక గలిగినంత ఇవ్వండి. హాయిగా పాడుకుంటూ గడిపేస్తా"నని జవాబిచ్చారు మల్లిక్. అప్పటి నుండి 29 ఏండ్లు 1972 వరకు మద్రాసు రేడియో కేంద్రంలో, 1972 నుండి 1981 వరకు విజయవాడ కేంద్రంలోనూ పనిచేసారు.

మద్రాసులో దేవులపల్లి, బాలాంత్రపు రజనీకాంతరావు, ఈమని శంకరశాస్త్రి వంటివారి సహచర్యంలో లలిత సంగీతంలో నిష్ణాతుడైనారు. విజయవాడ కేంద్రానికి వచ్చేసరికి అక్కడ వోలేటి వేంకటేశ్వర్లుతో కలిసి పలుకార్యక్రమాలు రూపొందించారు.

మల్లిక్‌కు అన్నమాచార్య కీర్తనలంటే చాలా అభిమానం. ఆ అభిమానం ఆయనచే 150కి పైగా అన్నమయ్య కీర్తనలకు స్వరకల్పన చేయించింది. 1954లో "అదిగో అల్లదిగో శ్రీహరివాసము" కీర్తనకు ఆయన చేసిన ట్యూన్ జనసామాన్యంలో విస్తృతమైన ప్రచారం పొందిన విషయం తెలిసిందే. ఎందరు కొత్తగాయకులు వచ్చినా అదే ట్యూన్‌లోనే పాడటం విశేషం.



మల్లిక్

చివరికి "అన్నమయ్య" చిత్రంలో కీరవాణి అనుసరించిన బాణీ కూడా ఈయనదే! ఇలా అన్నమయ్య కీర్తనలను లలితశాస్త్రీయం, లలిత సంగీతం, జానపదం అనే మూడు విభాగాలుగా విభజించి సాహిత్యాన్ని బట్టి స్వరకల్పన చేసిన ప్రతిభాశాలి మల్లిక్. అన్నమాచార్య ప్రాజెక్ట్‌వారు 1996 వరకు అన్నమయ్య వర్ధంతుల సభలను 46ని నిర్వహించగా వాటిలో 40 సభలలో పాల్గొనడం అన్నమయ్యపై ఆయనకున్న అనురక్తికి నిదర్శనం.

మద్రాసులో ఉన్నపుడు సాలూరు రాజేశ్వర రావు సహచర్యంలో లలిత సంగీతం పై మరింత పట్టు సాధించారు మల్లిక్. "లలిత సంగీతంలో ఎంతో కొంత ప్రతిభ నాకు దక్కిందంటే అది రాజేశ్వరరావు గారు చలవే" అనేవారాయన. ఆ ప్రతిభతోనే ఇంద్రగంటి, దేవులపల్లి, ఆరుద్ర, కృష్ణశాస్త్రి, రావులపర్తి భద్రరాజు, రజని, అడివి బాపిరాజు, వంటి భావకవుల పాటలకు తన స్వరాలతో జీవం పోశారు. "మాకు శరణం రామచరణం", "ఒదిగిన మనసున పొదిగిన భావము" జాబిలీ నా గాథ ఒక వింత గాథ" తదితర గీతాలకు ఆయన స్వరకల్పన చేసారు. ఇంకా ఇంద్రగంటి శ్రీకాంత శర్మ "కరుణ ఒక్క కాసారము, దానికి కంటినీరు ఆధారం" పాటను కళ్యాణి రాగంలో కూర్చి వన్య ప్రాణుల పట్ల కారుణ్యత చూపాలనే ప్రబోధాన్ని ఆవిష్కరించారు. ఇంకా శ్రీకాంత శర్మ రాసిన 'పొగడపూలు' అనే గేయ సంకలనంలోని చాలా పాటలకు మల్లిక్ స్వరరచన చేసారు.

మల్లిక్ స్వరాలు కూర్చిన, పాడిన లలిత గీతాలు ఒక ఎత్తైతే, జానపద గీతాలను రేడియోలో పాపులర్ చేయడం ఒక ఎత్తుగా చెప్పుకోవచ్చు. సీత, అనసూయ, ప్రయాగ నరసింహశాస్త్రి వంటి వారితో కలిసి పాడిన గ్రామఫోన్ రికార్డులు ఆయనకు మరింత పేరు తెచ్చిపెట్టాయి. చిన్నపిల్లల కార్యక్రమంలో పాటలు నేర్పే "మల్లిక్ మామయ్య''గా ఆయన పిల్లలకు కూడా పరిచితులే. లలిత సంగీతం, శాస్త్రీయ సంగీతం, జానపదం, దేశభక్తిగీతాలు, అమ్మవారిస్తోత్రం, భక్తిరంజని కీర్తనలు ఏవైనా మల్లిక్ స్వరంలో సుమధురంగా జాలువారి శ్రోతల ఓలలాడించేవి.

గేయాలకు స్వరకర్తగానే గాక వెంపటి చినసత్యం ప్రోత్సాహంతో యక్షగానాలు, 'పారిజాతం' నృత్యప్రదర్శనకు, స్వరాలు కూర్చారు. మల్లిక్. ప్రసిద్ధ సినీ నటి, నర్తకి రాజసులోచన భామాకలాపంలో స్త్రీ పాత్రకు గాత్రదానం చేసి మెప్పించడం ఆయన ప్రతిభావ్యుత్పత్తులకు నిదర్శనం. చినసత్యం 'ఛండాలిక'కు కూడా వీరే సంగీతం చేసారు. ఇంకా శ్రీనివాసకళ్యాణం, మోహినీభస్మాసుర, వాల్మీకి వంటి నృత్యరూపాలకు సంగీతందించారు.

మద్రాసులో చాలాకాలం ఉండటంవల్ల ఇతర సంగీతకారుల్లాగే మల్లిక్‌కూడా కొన్ని సినిమాలకు గాయకుడుగా పనిచేసారు. అపుడపుడే ప్లేబ్యాక్ పద్ధతి వస్తున్న ఆ కాలంలో తమిళంలో ఈయనే తొలి నేపథ్య గానం చేసారు. జెమినీ వారి ప్రతిష్టాత్మక చిత్రం 'చంద్రలేఖ'లో ఈయన ఎం.ఆర్.రాధాకు పాడారు. తెలుగులో సంపూర్ణ రామాయణం (1958), బంగారుపాప (1954), సంసారం, భాగ్యరేఖ, లవకుశ వంటి తదితర 50 చిత్రాల్లో పాటలుపాడారు. 4 సినిమాలకు సంగీత దర్శకత్వమూ వహించారు. ''మధురగాయకుడు'', ''నాదకౌముది'' బిరుదాలతో గౌరవాలందుకున్నారాయన.

1981లో ఆకాశవాణిలో పదవీ విరమణ చేసాక తన మనవరాలు లక్ష్మీనరసమ్మతో కలిసి కచేరీలు చేస్తూ గడిపారు. అంటే ఆయన సంగీత కళను జీవిక కోసం కాకుండా దానికి ఒక నిజమైన ఉపాసకుడిగా జీవించారు. ఆ మధుర గాయకుడు 1996 ఏప్రిల్ 27న విజయవాడలో మృతిచెంది తన స్వరయాత్రను ముగించారు.

పరిపక్వమైన రాగభావం, గాత్రంలో సౌకుమార్యం, భావగీతాలకు అవసరమైన చిన్ని చిన్న సంగతులు, లలిత గీతాలకు కావలసిన ఒదుగు, గంభీర భావం అన్నీ తన గానంలో పరిపూర్ణంగా నింపుకుని 50 ఏళ్ళ పాటు తన మధుర స్వర గాన లహరితో రేడియో శ్రోతలను మైమరిపించిన లలిత సంగీతవిరించి మల్లిక్.

**-హెచ్. రమేష్‌బాబు**



# బాపు విశ్వరూపం 10

పబ్లిసిటీ డిజైనర్‌గా బాపు రకరకాల 'ప్రొడక్టు'లను మార్కెట్ చేయడానికి చిత్రకళను సమర్థవంతంగా ఉపయోగించారు. సినిమా కూడా ఓ 'ప్రొడక్టే' కాబట్టి దానికీ ప్రకటనలు రాశారు. ఎంత వినూత్నంగా డిజైన్ చేశారో మీరే గమనించండి.












మావ మామా మామా - మామ మామా మామా

"మంచిమనసులు" సినిమాకి పద మామా -





## మంచి మనసులు

ఏమండోయ్ శ్రీవారూ - ఒక చిన్నమాట
"మంచి మనసులు" మాట ఏం చేశారీపూట?

నిన్ను వదిలి నేను పోలేనులే
"మంచిమనసులు"కి మనిద్దరం కలిసేపోవాలిలే -







# అత్తా ఒకింటి కోడలే!

**ఇవన్నీ వేరేవాళ్ళ సినిమాలు. తన సినిమా 'ముత్యాలముగ్గు'కు శతదినోత్సవంకు ఆహ్వానం డిజైన్ చేయడంలో కూడా తన ముద్ర చూపారు బాపు**

(ఇది పంపినది శ్రీ ఎం.వి.అప్పారావు, రాజమండ్రి)




(గత సంచికలోని 'బాపూ విశ్వరూపం'లో ప్రచురించిన శ్రీరామకథ బొమ్మలకథను పంపినవారు
- శ్రీ శిష్లాసూర్యనారాయణ, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్)

ఏప్రిల్ 26 సంగీతదర్శకుడు శంకర్ వర్ధంతి సందర్భంగా.....

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం







## 'బదన్ పే సితారే లపేటే హుయే'

బదన్ పే సితారే లపేటే హుయే
ఓ జాన్-ఎ-తమన్నా కిధర్ జా రహే హో
జరా పాస్ ఆవో తో చైన్ ఆ జాయె (2) ॥బదన్ పే॥
హమ్ జబ్ న హోంగే తో అయె దిల్‌రుబా
కిసే దేఖ్‌కర్ హాయె షర్మావోగీ
న దేఖోగీ ఫిర్ తుమ్ కభీ ఆయినా
హమారే బినా రోజ్ ఘబ్‌రావోగీ ॥బదన్ పే॥
హై బన్‌నే సవర్‌నే కా జబ్ హీ మజా
కోయీ దేఖ్‌నే వాలా ఆషిక్‌తో హో
నహీంతో యే జల్‌వే హైఁ బుఝ్‌తే దియే
కోయీ మిట్‌నే వాలా ఇక్ ఆషిక్ తో హో ॥బదన్ పే॥
మొహబ్బత్ కీ యే ఇంతహాఁ హో గయీ
కి మస్తీ మేఁ తుమ్‌కో ఖుదా కెహ గయా
జమానా యే ఇన్సాఫ్ కర్‌తా రహే
భలా కెహగయా యా బురా కెహ గయా ॥బదన్ పే॥

| | | |
|---|---|---|
| చిత్రం | : | ప్రిన్స్ |
| రచన | : | హస్రత్ జైపురి |
| సంగీతం | : | శంకర్-జైకిషన్ |
| గానం | : | మహమ్మద్ రఫీ |
| అభినయం | : | షమ్మీ కపూర్, వైజయంతీమాల, అజిత్, తదితరులు |

హిందీ చిత్రాలలో కథలు, పాత్రల స్వభావాలు మారుతూ పోయినట్టే సంగీతం కూడా ఎన్నో మార్పులు చెందింది. మొదట్లో భారతీయ శాస్త్రీయ పద్ధతికి దగ్గరగా ఉండే సంగీతం, పాశ్చాత్య జీవనశైలి అలవడినకొద్దీ పాశ్చాత్య సంగీతంలోని మధురిమను కూడా ఇముడ్చుకుంది. ప్రేయసికి ఏకాంతంలో తన ప్రేమను తెలిపే ప్రియుడు కాలం గడిచినకొద్దీ అందరి మధ్యా, పార్టీలలో తన ప్రేమను ఎలుగెత్తి చాటేవాడుగా మారటంతో సంగీతం కూడా తదనుగుణంగా మారింది. 50 దశకంలో తమ మెలొడీలతో అగ్రస్థానం ఆక్రమించిన శంకర్-జైకిషన్ 60 దశకంలో వచ్చిన మార్పులను సమర్థవంతంగా మలచుకుని తమ స్థానాన్ని పదిలం చేసుకోవటమే కాక హిందీ సినీ సంగీత చరిత్రలోనే అత్యంత విజయవంతమైన సంగీత దర్శకులుగా పేరుగాంచారు.

హైదరాబాద్ వాస్తవ్యుడైన శంకర్ అసలు పేరు శంకర్‌సింగ్ రఘువంశీ. గుజరాత్‌కు చెందిన జైకిషన్ దయాభాయి పంచల్‌తో కలిసి ఆయన తొలిసారిగా రాజ్‌కపూర్ చిత్రం 'బర్సాత్'కు సంగీతం అందించారు. వారిద్దరూ కలిసి రెండు దశాబ్దాల పాటు హిందీ చిత్రాలకు అందించిన సంగీతం అందరు సంగీత దర్శకులకు గీటురాయిలా నిలిచిపోయింది. వారికి రికార్డు స్థాయిలో తొమ్మిది ఫిలింఫేర్ అవార్డులు వచ్చాయి.

శంకర్-జైకిషన్ కేవలం రాజ్‌కపూర్ చిత్రాలకే మంచి సంగీతం అందించేవారని ఒక అపోహ చాలా మందికి ఉంది. ఆ అపోహ పోగొట్టాలంటే షమ్మీ కపూర్ చిత్రాలను ఉదహరిస్తే చాలు. షమ్మీకపూర్‌కు రెబెల్ ఇమేజ్ తెచ్చిపెట్టడంలో శంకర్-జైకిషన్, మహమ్మద్ రఫీల సహకారం మరువరానిది. జేమ్స్ డీన్, ఎల్విస్ ప్రెస్లీల ప్రేరణతో తనకంటూ ఒక ఇమేజ్‌ని సంపాదించుకున్న షమ్మీకపూర్ 'జంగ్లీ' (1961) చిత్రంతో యువతను ఉర్రూతలూగించాడు. ఆ చిత్రంలో శంకర్-జైకిషన్ స్వరపరచిన 'యాహూ! చాహే కోయీ ముఝే జంగ్లీ కహే', 'అయ్యయ్యా, కరూఁ మైఁ క్యా సూకూ సూకూ' పాటలతో అతను కథానాయకుడి స్వరూపాన్ని పూర్తిగా మార్చేశాడు. తన భావాలను ఎలుగెత్తి చెప్పడం, తను ప్రేమించిన అమ్మాయిని వెంటపడి వేధించి అయినా ఒప్పించడం హీరోయిజానికి ఆనవాలుగా మారింది.

క్లాసికల్ గీతాలను అద్భుతంగా పాడే మహమ్మద్ రఫీ, షమ్మీకపూర్‌కి పాడిన పాటలు వింటే ఆయన రేంజ్ తెలుస్తుంది. వారిద్దరికీ ఏదో అవగాహన ఉన్నట్టు వారి టైమింగ్, రిథమ్ అద్భుతంగా కలిసిపోయేవి. ఎవరో నేపథ్య గాయకుడు పాడుతున్నాడనే ఆలోచనే రాదు. అది రఫీ గానంలో హుషారో, షమ్మీ కదలికలలోని జోరో విడదీసి చెప్పటం కష్టం. 'తుమ్‌సా నహీఁ దేఖా', 'దిల్ దేకే దేఖో', 'జంగ్లీ', 'ప్రొఫెసర్', 'రాజ్‌కుమార్', 'జాన్వర్', 'తీస్రీమంజిల్', 'బ్రహ్మచారి', 'ఏన్ ఈవెనింగ్ ఇన్ ప్యారిస్', 'ప్రిన్స్' ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో చిత్రాలు, ఎన్నో పాటలు.

శంకర్-జైకిషన్ తొలిచిత్రమైన 'బర్సాత్' హస్రత్ జైపురికి గీత రచయితగా తొలి చిత్రం. హస్రత్ జైపురి బస్ కండక్టర్‌గా పనిచేస్తూ తనకిష్టమైన కవితా వ్యాసంగంలో భాగంగా ముషాయిరాలలో పాల్గొనేవారు. రాజ్‌కపూర్ తండ్రి పృథ్వీరాజ్ కపూర్ ఆయన కవిత విని రాజ్‌కపూర్‌కి సిఫారసు చేశారు. అప్పుడు రాజ్‌కపూర్ 'బర్సాత్' చిత్ర నిర్మాణ ప్రారంభ దశలో ఉన్నారు. శంకర్-జైకిషన్, హస్రత్ జైపురి, రాజ్‌కపూర్‌లు రాయల్ ఆపెరా హౌస్‌లో కలుసుకుని ఒప్పందం కుదుర్చుకున్నారు. శంకర్ స్వరపరచిన 'జియా బేకరార్ హై', జైకిషన్ స్వరపరచిన 'ఛోడ్‌గయే బాలమ్' హస్రత్ జైపురి తొలి రెండు సినీ గీతాలు.

'ప్రిన్స్' చిత్రంలోని 'బదన్ పే సితారే' పాట హీరో హీరోయిన్‌ని పార్టీలో టీజ్ చేసే పాట. తనకు దూరం దూరంగా ఉంటున్న ప్రేయసిని అందరి ముందూ వెంటపడి 'నాలాటి వాడు నీకు దొరకడు' అని ఏడిపించే పాట. ఈ పాటకు ప్రేరణ శంకర్-జైకిషన్‌లదే. రష్యాలో ఒక నృత్య ప్రదర్శనలో తళుకు బెళుకుల డ్రెస్సు వేసుకున్న ఓ డ్యాన్సర్‌ని చూసి వారు హస్రత్ జైపురికి ఆ డ్రస్సును హైలైట్ చేస్తూ పాట రాయమని చెప్పారు. ఆయన వెంటనే 'బదన్ పే సితారే లపేటే హుయే' అనే లైన్ చెప్పారు. దాని అర్థం 'ఒంటికి చుక్కలు చుట్టుకుని' అని. తళుకుల డ్రస్సును కట్టుకోవటం - ఒంటికి చుక్కలు చుట్టుకోవటం - హస్రత్ జైపురి కవి హృదయం, యువ హృదయం కలిస్తే పుట్టిన పోలిక.



జాన్-ఎ-తమన్నా అంటే ఆశకి ప్రాణం. ప్రేయసిని తన ఆశకి ప్రాణంగా భావిస్తున్నాడు. చైన్ అంటే శాంతి. 'చైన్ ఆ జాయె' అంటే ఊరట కలుగుతుంది, కుదుటపడుతుంది అని.

'మేనికి చుక్కలు చుట్టుకొని
ఓ చెలియా, పోయేదెక్కడికి
ఓసారి చెంతకొస్తే నా చింత తీరిపోదా'

తళుకుల చీర కట్టుకుని అప్సరసలా ఉన్న తన ప్రేయసి తన వద్దకు రాకుండా వెళ్ళిపోతుంటే అతను చూస్తూ ఊరుకునేవాడు కాదు. 'నా చెంతకు రా, నాకు ఊరట కలుగుతుంది' అని వెంటపడ్డాడు.

దిల్‌రుబా అంటే ప్రియతమా అని. షర్‌మానా అంటే సిగ్గుపడటం. ఆయీనా అంటే అద్దం. ఘబ్‌రానా అంటే భయపడటం.

'నేనే లేకపోతేనే ఓ ప్రియతమా
నువు సిగ్గొలక బోసెందుకెవరుంటారు
ఇక అద్దం వంకైనా నువు చూడవులే
నే లేకుంటే ప్రతిరోజు బెదిరేవులే'

'నేను లేకపోతే నీకు చాలా కష్టం' అన్నట్టు ఆమెను ఉడికిస్తున్నాడు. 'నీ సిగ్గులన్నీ నా దగ్గరే కదా. నేను లేకపోతే ఎవర్ని చూసి సిగ్గుపడతావు? అలంకరించుకోవటానికి అద్దం ముందు కూడా నిలబడవు. నేను లేకపోతే నీకు తోడు లేక భయపడతావు. నేనే నీకు తోడుగా ఉండతగిన వాడిని' అని అంటున్నాడు.

'బన్‌నా సవర్‌నా' అంటే సింగారించుకోవటం. మజా అంటే ఆనందం. ఆషిక్ అంటే ప్రేమికుడు. జల్వే అంటే వగలు, వయ్యారాలు. 'బుఝ్‌తే దియే' అంటే ఆరిపోయే దీపాలు. మిట్‌నే వాలా అంటే పడిచచ్చేవాడు.

'సింగారంలో ఉన్న ఆనందము
చూసి మెచ్చే ప్రియుడుంటే తెలిసేనులే
లేకుంటే ఈ వగలు ఆరే దివ్వెలే
పడిచచ్చే వాడొకడుండాలిలే'

'ఎంత సింగారించుకున్నా చూసి మెచ్చే రసికుడు లేకపోతే ఏం లాభం? నిను ప్రేమించి నీ అందాన్ని ఆరాధించేవాడు లేకపోతే ఈ వన్నెచిన్నెలన్నీ అడవి కాచిన వెన్నెలే' అంటున్నాడు. ఇక్కడ 'వాగ్దానం'లోని 'వన్నెచిన్నెలన్నీ ఉన్న చిన్నదానివే, అన్నీ ఉన్నదానివే, ఎన్ని ఉన్నా తోడులేక లేని దానివే, ఏమి లేనిదానివే' అనే పాట గుర్తొస్తుంది.

మొహబ్బత్ అంటే ప్రేమ. ఇంతహా: అంటే పరీక్ష, సవాలు, మస్తీ అంటే ఊపు. ఖుదా అంటే దైవం. జమానా అంటే లోకం. ఇన్సాఫ్ అంటే న్యాయం. భలా అంటే మంచి. బురా అంటే చెడు.

'ప్రేమకు ఓ సవాలే ఇది
ఊపులో నిను దైవమన్నానులే
లోకం ఇక ఏమనుకున్నా సరే
నేనన్నది మంచన్నా చెడన్నా సరే'



'ప్రేమ పిచ్చిలో పడి నిన్నే దైవం అన్నాను. నా ప్రేమకు ఇది పరాకాష్ఠ. ఇతర ప్రేమికులకు సవాలు. ఇంతగా ప్రేమించేవారు ఉంటారా? ఈ లోకం ఇక తర్జనభర్జన పడుతుంది - నేనన్నది మంచా చెడా అని. అయినా నాకు లోకంతో పనిలేదు' అని తెగించి చెబుతున్నాడతను. లోకం ఏమనుకున్నా పట్టించుకోను అనే తిరుగుబాటుతత్వం కూడా ఇక్కడ కనబడుతుంది.

ఈ పాటలోని సరళత్వం, హుషారు ఎవరినైనా ఆకట్టుకుంటాయి. టీజింగ్ పాటలకి ఓ గ్లామర్ తీసుకువచ్చిన జంట షమ్మీ, రఫీ, శంకర్ సంగీతం.

**- పి.వి.సత్యనారాయణ రాజు**

**ఏప్రిల్ 20 న పన్నాలాల్ ఘోష్ వర్ధంతి సందర్భంగా...**

# ఫ్లూట్ మెస్ట్రో పన్నాలాల్ ఘోష్

ఇప్పటి తరం వారికి వేణుగానమంటే వెంటనే గుర్తొచ్చేది పండిట్ "హరిప్రసాద్ చౌరాసియా" కానీ మన సినిమాలు మాటలు నేర్చిన కాలంలోనే వేణుగాన విద్వాంసుడుగా పేరొందిన కళాకారుడు "పన్నాలాల్ ఘోష్"! పన్నాబాబుగా అందరిచే ప్రేమగా పిలిపించు కున్న శ్రీఘోష్1930-40 దశకాల్లో చాలా సినిమాలకు సంగీతం ఇచ్చారు.



లతా మంగేష్కర్, పన్నాలాల్ ఘోష్

బాంబే టాకీస్‌వారి "బసంత్"కు చేసిన సంగీతం అయనకు మంచిపేరు తెచ్చిపెట్టింది. ఆయన చివరి చిత్రం "ఆందోళన్" 1951లో వచ్చింది.

తొలినాటి హిందీ గాయనీమణుల్లో ఒకరైన పరుల్‌ఘోష్ పన్నాబాబు శ్రీమతే. ఆయన జీవిత కాలంలోనే బొంబాయిలోని మలాడ్ ప్రాంతంలో ఒకరోడ్‌కు "పన్నాలాల్ ఘోష్ మార్గ్" అనే పేరు పెట్టారు. సినిమా రంగం నుండి నిష్క్రమించిన తరువాత ఢిల్లీ ఆకాశవాణి కేంద్రంలో చాలాకాలం పాటు మ్యూజిక్ డైరెక్టర్‌గా ఉన్నారు. ఢిల్లీలోనే 1960 ఏప్రిల్ 20న మరణించారాయన.

లతా మంగేష్కర్ తన కెరీర్ ప్రారంభించిన తొలిరోజుల్లో పన్నాబాబు వద్దనే గానంలోని మెళకువలను నేర్చుకున్నారు. మెలోడి కంపోజర్ అనిల్ బిస్వాస్- పన్నాలాల్‌కి స్వయాన బావమరిది. ఫ్లూట్‌మెస్ట్రోగా ఒక తరాన్ని చకచ్ఛకితం చేసిన కళాకారుడు పన్నాలాల్ ఘోష్.

**-బి.పద్మ**

## కొంటెకొశ్శెన్లు-తుంటరి జవాబులు



మామిడి శ్రీలత-పుణే.

ప్ర॥ కాని వారికి ఆరాటం, అయినవారికి పోరాటం అంటే ఏమిటి?

జ॥ పెళ్లి

సౌమ్య, శరత్ -విశాఖపట్నం.

ప్ర॥ అసలు సిసలైన రాజకీయ నాయకుడంటే ఎవరు?

జ॥ పుట్టిన పిల్లాడికి పేరు పెట్టడం కోసం ఓటర్ల జాబితా వెతికేవాడు

వి.మంజురాణి - హైద్రాబాద్.

ప్ర॥ తెలుగు భాష మీద మమకారం వున్నవాణ్ణి తీసుకొచ్చి- బెల్లపు అచ్చులు తయారుచేసిస్తాను, పెట్టుబడి నేనే పెడతాను, వ్యాపారం చేసుకుంటావా - అని అడిగితే ఏమంటాడు?

జ॥ అచ్చులు తప్ప హల్లులు లేని బెల్లం వ్యాపారాన్ని చస్తే చెయ్యను అని అంటాడు.

## డబుల్‌రోల్




ఉండటానికి 'ఓ నీడైనా' లేదుగాని 'ఒనీడా' టీవీ కావాల్సొచ్చిందా నీకు!?

- ఆగూరి మాధురి, విశాఖపట్నం

బంధువుల ఇంట్లో అలా 'తిష్ట' వేసుక్కూర్చుంటే 'ప్రతిష్ట' పోదూ!?

ఆ 'చాప' మీద కూర్చున్నావిడకు 'జిహ్వా చాపల్యం' కాస్త ఎక్కువట

-బి. శ్రీరాం, రుద్రారం



## చిలిపి లిపి




Eye Chappal = కళ్లజోడు

-కోటిపల్లి మధు, మల్లేశ్వరం.

ABC = ఆల్వేజ్ బి కేర్‌ఫుల్

-బి.వి.రావు, రుద్రారం

Cloth Head = బట్టతల

-పెద్దాడ నాగరాజు, సిర్పూర్ కాగజ్ నగర్.

## ఈ రూటే వేరు




Baby Fear = పాప భీతి

-బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి

సర్ఫేస్ = అయ్యగారి ముఖం

-బి. నీలిమ, విశాఖపట్నం

సర్కిల్ = అయ్యా... చంపు

-బి. శారదాదేవి

# చిలిపికవిత




వాడు బతకడానికి పుడ్డు కావాలి

వీడు బతకడానికి డబ్బు కావాలి

నాకు మాత్రం నువ్వే కావాలి ప్రేయసీ!

నువ్వేకావాలి!!

(బ్రతకడానికి కావలసిన

పుడ్డుని, డబ్బుని ఇచ్చే

నువ్వేకావాలి ప్రేయసీ నువ్వేకావాలి)

-గణేష్ పూడి

# షార్ట్‌కట్స్



ఏడిద లక్ష్మి కమల = ఎలక

మేడపాటి కస్తూరి = మేక

వెల్లంకి ధర్మా వరహాలు = వెధవ

కోట తిమ్మారావు = కోతి

-పి.యస్.యస్. పవన్‌గణేష్, సోమేశ్వరం

# పేరు -రిపేరు




ఒక రాధ.. ఇద్దరు కృష్ణులు - ఇదెక్కడి న్యాయం

గణేష్ - ఈశ్వర్ - ఒకే కుటుంబం

-దేవ్వలపల్లి రామ్మూర్తి, విజయవాడ.

బాబు - ఒక్కడు - ఒకే ఒక్కడు - ఒక్కడు చాలు

- గిరి, హైద్రాబాద్.

# పేరడీ పేరడ్



నేను పుట్టాను, బోల్డప్పులు చేసాను

నేను పెరిగాను బిల్డప్పులు ఇచ్చాను

నేను తిరిగాను ఆ అప్పులు పెంచాను

నాకింకా ఈ ఊర్లో పని ఏముంది...

డోంట్‌కేర్! ॥నేను పుట్టాను॥

నేను ఎదురైతే కొందరు నన్ను ఉతికారేస్తారు

నేను కనిపిస్తే... కొందరు నన్ను కాల్చుకు తింటారు

నేను దొరికితే అందరు కలిసి పాతరవేస్తారు

తెల్లవారితే ఈడ్చుకుపోయి పాతి పెడతారు

డోంట్‌కేర్! ॥నేను పుట్టాను॥

అప్పులు దాచేటందుకే పైపై గొప్పలు ఉన్నాయి

అసలుకె ఎసరును పెట్టేటందుకె కిటుకులు ఉన్నాయి

ఎరగక నమ్మిన వాళ్ల నెత్తికే టోపీలొస్తాయి

ఎదుటి మనిషిని పూడ్చేటందుకే స్కీములు వున్నాయి

డోంట్‌కేర్! ॥నేను పుట్టాను॥

మనిషిని మనిషి ముంచేటందుకె అప్పులు ఉన్నాయి

అప్పులు రెట్టింపయ్యేటందుకె వడ్డీలున్నాయి

సామాన్లన్నీ మూటల్లో రాత్రే కుక్కేసెయ్

ఊరువదిలి చెక్కేసెయ్! నీలో భీతిని తరిమేసెయ్!

డ్రైవ్‌ది ఫియర్ అవుట్... అహహ్హా హ్హాహ్హాహ్హా.... ॥నేను పుట్టాను॥

('ప్రేమ్‌నగర్' చిత్రంలోని 'నేనుపుట్టాను' పాటకు పేరడీగా...)

- తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం






ఎంటీవి అన్‌ప్లగ్‌డ్ కార్యక్రమంలో పాల్గొన్న తొలి ఆసియావాసులు, భారతదేశం నుండి వెళ్ళిన ఏకైక జంట వీరే కావటం ఓ విశేషం. అమెరికా, బ్రిటన్ దేశాలకు చెందిన సంగీతకారుల అడ్డాలో జాతీయకేతనాన్ని సగర్వంగా ఎగరవేసిన ఖ్యాతి ఈ ఇద్దరికే దక్కింది. భారత, పాశ్చాత్య స్వరాల మేళవింపుతో ఇటు యువతనే కాకుండా వయోవృద్ధులను రంజింపచేశారీ కొలోనియల్ కజిన్స్.

ఆత్మ భారతీయం..... భాష ఆంగ్లం..... వెరసి

# కొలోనియల్ కజిన్స్

**21**వ శతాబ్దంలో పాప్ మ్యూజిక్ ప్రపంచాన్ని ఉర్రూతలూగిస్తుంటే- అదే పంథాలో నడవటానికి సిద్ధపడుతూనే ఆత్మను త్యజించకుండా తమదైన భారతీయ బాణీలో ఆంగ్ల గీతాలను ఆలపించి- ఓ కొత్త ట్రెండ్‌కు ఈ 'కజిన్స్' శ్రీకారం చుట్టారు. వీరి వైవిధ్య స్వర రచనలకు సంగీత ప్రపంచం ఆశ్చర్యపోయింది. పాపులర్ ఛానల్ ఎంటీవి ఈ భారతీయ సంగీత ద్వయాన్ని ప్రత్యేకంగా ఆహ్వానించి ఎంటీవి అన్‌ప్లగ్‌డ్ కార్యక్రమాన్ని ఘనంగా నిర్వహించింది. దాంతో వీరికి ఎంటీవి వ్యూవర్స్ ఛాయిస్ అవార్డ్, ఛానల్ 'వి' నుండి బెస్ట్ ఆల్బమ్ అవార్డ్ లభించాయి. అంతే కాదు యుఎస్ బల్‌బోర్డ్ ఇండియన్ వ్యూవర్స్ ఛాయిస్ అవార్డ్‌ను అందుకోవడానికి వీరిద్దరు లాస్ వెగాస్ వెళ్ళారు.

ప్రతిష్టాత్మక అవార్డుల్ని అందుకున్న కొలోనియల్ కజిన్స్ ప్రత్యేకత ఏమిటంటే వారే కట్టుబాట్లలోనూ ఇమడక పోవడమే! వారి తొలి ఆల్బమ్ 'కొలోనియల్ కజిన్స్'లో ప్రత్యేకమైన పంథాను అనుసరించకుండా, భారతీయమైన బాణీలను విడవకుండా ఆంగ్లగీతాలను ఆ చట్రంలో బిగించారంతే! అలానే ప్రతి పాటలనూ వైవిధ్యముండేలా జాగ్రత్తపడ్డారు. 1996లో తొలి ఆల్బమ్ విడుదలైంది ఆ తర్వాత 19 నవంబరు 1998లో రెండో అల్బమ్ 'ది వే వుయ్‌డు ఇట్' విడుదల చేశారు. 2001లో ముచ్చటగా మూడవ ఆల్బమ్ 'ఆత్మ' విడుదలైంది.

కర్నాటక, హిందుస్తానీ సంగీతాలను ఔపోసన పట్టిన వారొకరు. చేతిలోకి గిటారును తీసుకుంటే పాశ్చాత్య బాణీలను మరిపించే విధంగా మానసి కోల్లాసాన్ని కలిగించగలిగే వారు మరొకరు.... నిత్య నూతన- చిరపురాతనమైన ఈ జంట పేరు 'కొలోనియల్ కజిన్స్' భారతీయ సంగీతాన్ని అభ్యసిస్తే - ప్రపంచంలోని ఏ చిన్న దేశంలోని స్వరాలనైనా సుమధురంగా ఆలపించవచ్చని ఈ ఇద్దరూ ఋజువు చేశారు. కొలోనియల్ కజిన్స్ ద్వయంలో ఒకరు హరిహరన్- మరొకరు లెస్లీ లెవిస్.

## హరిహరన్



- కర్నాటక సంగీతంలో నిష్ణాతులైన అనంత సుబ్రమణి, అలిమేలు దంపతులకు ముంబాయిలో 1955 ఏప్రిల్ 3న హరిహరన్ జన్మించాడు.
- తల్లిదండ్రులనుండి సంగీతాన్ని వారసత్వంగా పుణికిపుచ్చుకున్నా అతని తొలి గురువు తల్లే. ఆమె దగ్గరే కర్ణాటక సంగీతాన్ని అభ్యసించాడు.
- యుక్తవయసు వచ్చేసరికి హిందుస్తానీ సంగీతం పట్ల కూడా హరిహరన్‌కు ఆసక్తి కలిగింది. మెహిదీహసన్ పాటలకు ప్రభావితమైన హరిహరన్ గజల్స్‌పై ఇష్టం పెంచుకున్నాడు.
- ఉస్తాద్ గులామ్ ముస్తఫాఖాన్ దగ్గర హిందుస్తానీ సంగీతాన్ని అభ్యసించాడు. ప్రతిరోజు దాదాపు 9గంటల సంగీత సాధన చేసేవాడు.
- గజల్స్ మీద వున్న ప్రేమతో ఉర్దూ భాషను కూడా అధ్యయనం చేశాడు. ఉర్దూ భాషాభిమానుల నిలయమైన లక్నోలో గజల్స్ గానం చేసి వారిని కూడా తన ప్రతిభాపాటవాలతో మంత్రముగ్ధుల్ని చేశాడు.
- 1977లో జాతీయస్థాయిలో సుర్‌సింగార్ అవార్డును పొందాడు.
- సంగీత దర్శకుడు జయదేవ్ నేతృత్వంలో 'గమన్' చిత్రానికిగాను హరిహరన్ గానం చేసిన 'అజీబ్ సానె హె ముఝె పర్ ఖరార్' అనే గజల్ ఎంతో పాపులర్ అయ్యింది. దీనికి ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం నుండి హరిహరన్ అవార్డును అందుకున్నారు. అక్కడ ప్రారంభమైన హరిహరన్ నేపథ్యగాయకుడి కెరీర్ ఒక్కో శిఖరాన్ని అధిరోహిస్తూ సాగిపోతోంది.
- దానికి ముందు కొన్ని టీవి సీరియల్స్‌కు పాటలు పాడినా ఎక్కువగా గజల్స్ ఆల్బమ్స్ విడుదలపైన హరిహరన్ దృష్టినిలిపారు.
- ఆశాభోంస్లేతో కలిసి 'అబ్‌షార్ - ఎ - గజల్' విడుదల చేశారు. 1994లో

విడుదల చేసిన 'గుల్‌ఫామ్' గజల్ ఆల్బమ్ డబుల్ ప్లాటినమ్ డిస్క్‌ని పొందడమే కాకుండా అవార్డుల్ని తెచ్చిపెట్టింది.

- 'సాహిబాన్', 'లమ్హే', 'రామ్‌నగరి', 'దర్ద్ కా రిస్తా', 'జమునా', 'సిందూర్' తదితర హిందీ చిత్రాల్లోనూ హరిహరన్ నేపథ్యగానం చేశారు.
- 1993లో దక్షిణాదిలో 'రాజా' తమిళ చిత్రంలో 'తమిళా... తమిళా' అనే పాటతో అడుగుపెట్టారు. రెండేళ్ళ అనంతరం అంటే 1995లో 'ఆశా' చిత్రంలోని ఓ పాటకు గాను హరిహరన్ తమిళనాడు రాష్ట్ర ప్రభుత్వం నుండి ఉత్తమగాయకుడిగా అవార్డును అందుకున్నారు.
- 1998లో 'బోర్డర్' చిత్రంలోని 'మేరే దుష్మన్ మేరే భాయి' పాటకు గానూ జాతీయస్థాయిలో ఉత్తమ నేపథ్య గాయకుడిగా అవార్డుపొందారు. కాష్ ఆన్ నాన్ - ఫిల్మ్ మ్యూజిక్ ఆల్బమ్‌కి గాను 2000 వ సం॥లో స్క్రీన్‌విడియోకాన్ అవార్డును అందుకున్నారు.
- జాతీయ అంతర్జాతీయ ఖ్యాతిని గడించినా- ఎదిగిన కొద్దీ ఒదిగి వుండాలన్నట్టుగా "మహ్మద్‌రఫీ, కిశోర్‌కుమార్, బాలసుబ్రహ్మణ్యం, జేసుదాసు నా స్ఫూర్తిదాతలు అంటుంటాడు" హరిహరన్.

# లెస్లీ పీటర్ వెలిస్



లెస్లీ పీటర్ వెలిస్‌ను ముద్దుగా లెజ్ అంటుంటారు. ఇతనూ కళాకారుల కుటుంబంలో నుండి వచ్చినవాడే. లెజ్ తండ్రి పి.ఎల్.రాజు సినిమాలకు నృత్యరీతుల్ని సమకూర్చుతుంటాడు. కాబట్టి సహజంగానే చిన్నతనంలో తండ్రి చేసే పని దృష్ట్యా లెజ్ భారతీయ సంప్రదాయ సంగీతాన్ని, సినిమా పాటల్ని బాగా వినేవాడు. అయితే తర్వాతర్వాత బోర్డింగ్ స్కూల్ చదువు కారణంగా అతని పరిధి విస్తృతమైంది.

- లెజ్ ఓబెరాయ్ టవర్స్‌లోని కేఫ్‌రాయల్‌లో గిటార్ ప్లేయర్‌గా కెరీర్ ప్రారంభించాడు. ఆ తర్వాత కళ్యాణ్‌జీ, ఆనంద్‌జీ, లక్ష్మీకాంత్, ప్యారేలాల్, ఆర్.డి.బర్మన్, లూయిస్ బాంక్స్ తదితరులలో కలిసి పనిచేసే అవకాశం వచ్చింది.
- 1987 లెజ్ సొంతగా ఓ మ్యూజిక్ కంపెనీ ప్రారంభించి, టీవి కార్యక్రమాలను ప్రకటనలకు జింగిల్స్ రూపొందించటం మొదలు పెట్టాడు. వరుసగా 4 సార్లు ఇండియన్ అకాడమి ఆఫ్ అడ్వర్టయిజింగ్ ఫిల్మ్ యార్ట్ (ఐఎఎఎఫ్ఎ) కు నామినేట్ అయిన తర్వాత 1998లో లెజ్‌కి అవార్డు లభించింది.
- 1992లో జింగిల్ పాడించేందుకు తన స్టూడియోకు హరిహరన్‌ని లెజ్ పిలిపించినప్పుడు - వీరిద్దరూ ఒకరిగురించి ఒకరు తెలుసుకునే అవకాశం ఏర్పడింది. 1996లో 'కొలోనియల్ కజిన్స్'కు శ్రీకారమైంది.
- గజల్స్‌ను హరిహరన్ తను ఎలాగైతే రాసుకునేవాడో- కొలోనియల్ కజిన్స్ ఆల్బమ్‌కి కూడా స్వరాల్ని సమకూర్చడమే కాకుండా ఇంగ్లీషు పాటల్ని కూడా లెజ్ రాశాడు.
- 1998లో లెజ్ ఒక్కడే 'గేసినా' అనే ఆల్బమ్ విడుదల చేశాడు. పలువురు గాయనీ గాయకులతో రీమిక్స్‌లు చేశాడు. పలు హిందీ, తమిళ చిత్రాలకు సంగీతాన్ని సమకూర్చాడు.
- ఇవాళ చాలా సినిమాలలో నాణ్యమైన సంగీతం కరువు అవుతోందని, నిర్మాతలు, సంగీత దర్శకులు అభిరుచి వున్నవాళ్ళే అయినా సమయభారం వాళ్ళని రాజీపడేలా చేస్తోందని లెజ్ అభిప్రాయ పడుతున్నారు.
- 1961లో పుట్టిన లెజ్ తండ్రి దక్షిణాదికి చెందితే తల్లి ఉత్తరాది ఆవిడ. లెజ్‌కు వివాహమై పుష్కరకాలం దాటింది. వారికిద్దరు పిల్లలు దేవ్, దివ్య.

**- వి. అరుణ సత్యవతి**

**'కొలోనియల్ కజిన్స్' పేరిటవచ్చిన ఆడియోక్యాసెట్‌లో ఓ హిట్‌సాంగ్ యిది :-**

Krishna Nee Begane Baaro "2" (కృష్ణా నీ బేగనే బారో ॥2॥)
Darkness coming round and everybody fighting with the brother
Everybody wants control but hesitate to kill one and other
So come back as Jesus come back and save the world
Bless all the the future of every boy and girl
Come back as Rama forgive for what we have done
Come back as Allah come back as anyone
Krishna Nee Begane Baaro "2" (కృష్ణా నీ బేగనే బారో ॥2॥)
Religion is the reason the world is broken up into pieces
Colour of the people keeps us laugh and hate. Please release us
So come back and help us and save all the little ones
They need a teacher and you are the only one
We can rely on to build a better one
Well that's for children well that's for everyone
Krishna Nee Begane Baaro ||2|| (కృష్ణా నీ బేగనే బారో ॥2॥)
Time is the healer Time moves on Time don't wait for anyone.
You tell me you'll be back but that'll take some time
I'm waiting ||5||
So come back as Jesus come back save the world... anyone
Krishna Nee Begane Baaro ||2|| (కృష్ణా నీ బేగనే బారో ॥2॥)
Jesus come back and save the world... come back for everyone
Govindo Bolo hare Gopala Bolo-Aamen ||5||





# ధర్మయుగం

- వసుంధర




ప్రముఖ సినీ దర్శకుడు ధర్మ చాలా హిట్ సినిమాలు తీసాడు. ఆ సినిమాలు ప్రేక్షకులకు నచ్చాయి. నిర్మాతలకు లాభాలు తెచ్చాయి. ఎప్పటికప్పుడు ప్రేక్షకుల నాడిని గమనిస్తూ అందుకు అనుగుణంగా ఇతివృత్తాలను మారుస్తూ రెండు దశాబ్దాలు చిత్ర రంగాన్ని ఏలాడు. గత నాలుగైదు సంవత్సరాలుగా ఆయన సీమ రాజకీయాలనే తన ఇతివృత్తాలు చేసుకుని కొందరు హీరోలను ప్రజల ఆరాధ్య దైవాలను చేసాడు. వసూళ్ళలో పాత రికార్డులన్నీ బద్దలు కొట్టాడు. కొత్త మూసకు ఒరవడి పెట్టాడు. సీమ కథలకు మార్గదర్శకుడై సీమ దర్శకుడిగా పేరుపడ్డాడు. ఆర్థికంగా వెనుకబడిన సీమ ఆయన్ను ఆర్థికంగా ఊహించని ఎత్తుకు తీసుకుని వెళ్ళింది.

భూమి తన చుట్టూ తాను తిరుగుతూ యధాస్థానానికి రావడానికి ఒకరోజు తీసుకుంటుంది. సూర్యుడి చుట్టూ తిరుగుతూ యధాస్థానానికి రావడానికి ఏడాది తీసుకుంటుంది. వలయంలో ప్రదక్షిణలు చేసేవారు యధా స్థానానికి చేరుకోక తప్పదు. చిత్ర సీమలో ఇతివృత్తాల తీరూ అంతే! ప్రస్తుతం చిత్రసీమ సీమ కథల నుంచి ప్రేమ కథల వైపు మళ్ళింది. ప్రేమ కథలు ధర్మకు కొత్త కాదు. కానీ ప్రేక్షకుల దృష్టిని ప్రేమ వైపుకు మళ్లించిన నవ యువ దర్శకుడు శర్మను అంతా కొత్త ఒరవడి పెట్టాడంటున్నారు. ఇప్పుడు ధర్మ ప్రేమకథలు ముట్టుకుంటే శర్మను అనుసరించేడంటారు. అదాయన అహాన్ని దెబ్బతీస్తుంది. పోనీ అని సీమ కథలనే పట్టుకుని వ్రేలాడుదామంటే వాటికి గిరాకీ తగ్గిపోయింది. గతంలో వచ్చిన సీమ చిత్రాలను సన్నివేశాలను శర్మ తన చిత్రాలలో కమేడియన్సుకు వాడుతున్నాడు. ప్రేక్షకులు ఆ దృశ్యాలు చూస్తూ కడుపుబ్బ నవ్వుకుంటున్నారు.

ధర్మ వద్ద విశ్వాసపాత్రంగా పనిచేసే వారిద్దరున్నారు. వారిపేర్లు ఏమైనా తనతో కలవడం కోసం ఆయన వాటిని కర్మ, చర్మలుగా మార్చాడు. వాళ్ళాయన వద్ద అసిస్టెంట్సుగా చేరి ప్రస్తుతం అసోసియేట్ స్థాయిలో ఉన్నారు. వాళ్ళకూ దర్శకత్వం ఆఫర్సు రాకపోలేదు కానీ - పేరు, ఆదాయం ధర్మ అసోసియేట్సుగా వచ్చే వాటికి మించవని తాత్కాలికంగా ఊరుకున్నారు. అయితే సమయం కోసం వాళ్ళు ఎదురుచూస్తున్నారు.

కొత్త చిత్రం గురించి ధర్మ తన అసోసియేట్సును సలహా అడిగాడు. ఎప్పుడూ తమకు సలహాలివ్వడమే తప్ప అడగడం ఎరుగని గురువు ముందు అసిస్టెంట్సిద్దరూ తమ సత్తా చూపించుకోవాలని కుతూహలపడ్డారు.

"గురువుగారూ-ఏదో ఒక స్టేజిలో ఎంత గొప్పవాడికైనా అనుకరణ తప్పదు. అలాంటప్పుడు శర్మ లాంటి బచ్చాకు బదులు కాశీనాథుని విశ్వనాథ్ లాంటివాణ్ణి ఎన్నుకుంటే మీరు కూడా కళాతపస్వి అనిపించుకోవచ్చు-" అన్నాడు కర్మ.

"గురువుగారూ - ఇంతవరకూ మన

సినిమాలు ఫ్యాక్షనిజం చుట్టూ తిరుగుతూ సీమ అనగానే కత్తులు, బాంబులు, హత్యలు రక్తపాతం స్ఫురింపజేసాయి. సీమ అనగానే ఆహ్లాదకర వాతావరణం స్ఫురించేలా మీ కొత్త చిత్రానికి పల్లెసీమ అని పేరు పెట్టండి-" అన్నాడు చర్మ.

ఈ సూచనలు ధర్మకు తెగ నచ్చాయి.

"గురువు నలహాలడగడమే కాదు. మెచ్చుకుంటున్నాడు కూడా. ఆయనకు పతనం వచ్చేసినట్టుంది-" అనుకున్నారు శిష్యులిద్దరూ.



"మన పల్లెసీమకు కథ ఏమిటి?" అన్నాడు ధర్మ.

కర్మ తెలుగులో వచ్చిన కొన్ని పల్లెకథల ఇతివృత్తాలను వినిపించాడు.

ధర్మ వాటి గురించి ఆలోచిస్తూంటే, "గురువు గారూ ఉత్తమ దర్శకులు మంచి కథలను ఎన్ను కోవడం బెంగాలీ సంప్రదాయం. తెలుగులో అయితే దర్శకులే కథలను తయారు చేసు కుంటారు. మన విశ్వనాథ్ గారు కూడా అందుకు భిన్నం కాదు-" అన్నాడు చర్మ.

"యూ ఆర్ రైట్!" అన్నాడు ధర్మ. ఆయన వారం రోజులు పల్లెసీమ గురించి ఆలోచించాడు. ఆ ఆలోచనల్లోంచి ఓ కథ పుట్టింది.

హీరోయిన్ పల్లెటూరి అమ్మాయి. అక్కడే ప్రకృతిలో కలిసిపోయి తిరుగుతూంటుంది. చెట్లు, పుట్టలు, పిట్టలు, గుట్టలు ఆమెతో సంభాషిస్తూ అనుభవాలను పంచుకుంటూంటాయి. హీరో వయసులో చిన్నవాడైనా ప్రముఖ పారిశ్రామికవేత్త. అనుకోకుండా పల్లెసీమకు వెళ్ళి హీరోయిన్ని చూసి ప్రేమిస్తాడు. ఆమెను పెళ్లి చేసుకుని తనతో పట్నం తీసుకుని వెడతాడు. అక్కడి కృత్రిమ వాతావరణం ఆమెకు సరిపడదు. నగర వాతావరణానికి అనుకూలంగా మారమనీ, ఆధునిక సంప్రదాయాలు పాటించమనీ అతడామెను బలవంతపెడతాడు. అప్పుడామెలో ఉత్సాహం చచ్చిపోతుంది. గొంతు మూగపోతుంది. హీరో ఎందరో వైద్యుల్ని సంప్రదిస్తాడు. ఆమెను విదేశాలకు తీసుకుని వెడతాడు. ఏ ప్రయత్నమూ ఫలించక విసిగిపోయి చివరికామెను పల్లెటూళ్ళో విడిచిపెడతాడు. పల్లెసీమలో అడుగుపెడుతూనే హీరోయిన్లో ఉత్సాహం పుడుతుంది. మూగవోయిన ఆమె గొంతులోంచి తిరిగి నాదాలు పలుకుతాయి.

"అద్భుతం గురువుగారూ! పాటలు పాడే మూగ హీరోయిన్ ఏ నిర్మాతకైనా, దర్శకుడికైనా సిరిసిరిమువ్వే! అటుపైన ఫారిన్ లొకేషన్సు కూడా ఉన్నాయి. మనకిక ఓ ఏడిద నాగేశ్వరరావు కావాలి-" అన్నాడు కర్మ.

"గురువుగారు కళాత్మక చిత్రం తీస్తే ఫైనాన్సు చేయాలని తాపత్రయ పడిపోతున్న ఓ నిర్మాత నాకు తెలుసు-" అన్నాడు చర్మ.

పల్లెసీమ చిత్ర నిర్మాణానికి ఫైనాన్సు సమస్య తీరిపోయింది.

అంతవరకూ సినీ ప్రపంచంతో ఏ మాత్రం పరిచయం లేని కొత్త అమ్మాయిని తెరకు పరిచయం చేయాలనుకున్నాడు ధర్మ. అన్వేషణలో ఆయనకు నాగలక్ష్మి తటస్థ పడింది. నాగలక్ష్మి రూపం అందగత్తెల సృష్టికి బ్రహ్మదేవుడు తయారు చేసుకున్న నమూనా అనిపిస్తుంది. నడకలో నాట్య మయూరి ఆమె. ఆమె కనులు సమ్మోహనాస్త్రాలకు అక్షయ తూణీరాలు. అర్ధచంద్రాకారంలోనే ఆమె పెదవులు చిరునవ్వుల వెన్నెలలు పున్నమి స్థాయిలో కురిపిస్తూంటాయి.

నాగలక్ష్మి ఇంటర్ ఫైనలియర్ చదువుతోంది. లోయర్ మిడిల్‌క్లాస్ స్థాయిలో ఉన్న ఆమె తల్లిదండ్రులు ధర్మ ఆమెను హీరోయిన్ను చేస్తాననగానే బ్రహ్మానందపడ్డారు. కానీ ఆశ్చర్యంగా నాగలక్ష్మి పెద్దగా ఉత్సాహపడలేదు సరికదా ధర్మ వద్ద పనిచేయడానికి షరతు కూడా పెట్టింది.

నాగలక్ష్మికి ప్రాణ స్నేహితురాలు సరస్వతి. నాగలక్ష్మి రూపం ఎంత అందమైనదో సరస్వతి గొంతు అంత తియ్యనైనది. ఇద్దరికీ కూడా ఆత్మవిశ్వాసం ఎక్కువ. జీవితంలో తాము చాలా పైకి వస్తామని ఇద్దరూ అనుకుంటున్నారు. ముందుగా ఎవరు పైకి వస్తే వాళ్ళు రెండో వాళ్ళకి చేయూతనివ్వాలని నిర్ణయించుకున్నారు. అందుకని ఇప్పుడు నాగలక్ష్మి తను హీరోయిన్నైతే తన పాటలు సరస్వతే పాడాలని ధర్మకు షరతు పెట్టింది.

"ఇంకా తొలి చిత్రంలో ఆఫర్ కన్ఫర్మయినా కాలేదు. అప్పుడే షరతులు పెడుతోంది. గురువుగారూ, ఈ పిల్ల మనకొద్దు-" అన్నాడు కర్మ.

"సినిమా రంగంలో కట్‌త్రోట్ పద్ధతి రాజ్యమేలుతోంది. ఇక్కడ కన్నతల్లే బిడ్డను మోసం చేయడానికి వెనుకాడదు. అలాంటిదీఅమ్మాయి తన స్నేహితురాలి కోసం తనకు వచ్చిన అపూర్వ అవకాశాన్ని వదులుకుంటోందంటే నిజంగానే చాలా అమాయకురాలు. గురువుగారూ, పల్లెసీమ చిత్రానికి ఇలాంటి హీరోయినే కావాలి" అన్నాడు చర్మ.

ధర్మ కూడా చర్మతో ఏకీభవించాడు. అయితే నాగలక్ష్మిని ఒప్పించడానికి ఏం చేయాలా అని రెండ్రోజులు మథనపడ్డాడు. చివరికాయనకో ఉపాయం తట్టింది. ఆయన తన అసోసియేట్సుతో, "అసలు మన చిత్రంలో పాటలే ఉండవు. అప్పుడు మనకు సరస్వతి ఇబ్బంది ఉండదు-" అన్నాడు.

"పాటలు లేకుండా సినిమానా? జనం



చూడరు-" అన్నాడు కర్మ.

"ప్రకృతి దృశ్యాలకు పరవశించినప్పుడల్లా హీరోయిన్ తన గొంతు విప్పుతుంది. ప్రేక్షకులామె పెదాల కదలికను చూస్తారు. మనం ఓసారి త్యాగరాజు, మరోసారి అన్నమయ్య, ఇంకోసారి రామదాసు-వగైరాల కీర్తనలను వీణ, వయొలిన్, మాండొలీన్ లాంటి వాద్యాల మీద ట్యూన్స్‌గా వినిపిస్తాం. వాటికి నేపథ్యంగా సెలయేటి గలగలలు, పక్షుల కిలకిలా రావాలు, హోరుగాలి స్వరాలు ఉపయోగిస్తాం. ఇదో కొత్త ప్రయోగం-" అన్నాడు ధర్మ.

"నాగలక్ష్మి మొండిపట్టు మనకు మేలే చేసింది. ఇప్పుడు మన సిరిసిరిమువ్వకు శంకరాభరణం కూడా జతపడింది. అయినా ఈ అయిడియా పూర్తిగా ఒరిజినల్. గురువుగారూ-మీకు నా జోహార్లు-" అన్నాడు చర్మ.

విషయం తెలుసుకున్నాక నాగలక్ష్మి పల్లెసీమ చిత్రానికి సైన్ చేసింది. తల్లిదండ్రులు ఆమెను ధర్మకు ధారాదత్తం చేసి ఇక పాలముంచినా, నీటముంచినా ఆయనదే భారమన్నారు. నడుస్తున్నది ధర్మయుగమని వారికి తెలుసును కాబట్టి కూతురు భవిష్యత్తు గురించి వారికేబెంగాలేదు.

పల్లెసీమ చిత్రం మొదలయింది.

నాగలక్ష్మిది కళ్ళు చెదిరే అందం. ఆ అందాన్ని దుస్తులలో ఇనుమడింపజేయాలని ధర్మ అనుకుంటే - "ఆడపిల్ల అందం దుస్తులలో ఇమడదు. మీరు దుస్తులలో ఇనుమడింపచేయాలనుకోవడం ఎంతవరకూ సబబో ఆలోచించండి-" అంటూ చర్మ ఆయన్ను హెచ్చరించాడు.

"భారత నారిని మోడలింగ్ కల్చర్నించి పవిత్ర సంప్రదాయానికి మళ్లించే ప్రయత్నమే ఈ పల్లెసీమ. ఈ చిత్రంలో నాగలక్ష్మి దుస్తులే పెద్ద




ఆకర్షణ అవుతాయి. అభిరుచి ఉన్న మంచి డ్రెస్ డిజైనర్ని ఎన్నుకుందాం. ఈ చిత్రంలో హీరోయిన్ దుస్తుల గురించి పెద్దగా ప్రచారం చేద్దాం-" అన్నాడు ధర్మ.

ధర్మ పల్లెసీమను ఓ దృశ్యకావ్యంలా రూపొందించాడు. షూటింగు విశేషాలను బాగా ప్రచారం చేసాడు. ప్రివ్యూ చూసిన జర్నలిస్టులు చిత్రాన్ని తెగపొగిడారు. బయ్యర్సు కూడా ఎగబడి కొన్నారు. కానీ తీరా విడుదలయ్యాక రెండో రోజుకే థియేటర్లలో జనం పలుచబడిపోయారు.

"శంకరాభరణంకు కూడా మొదటి పది రోజులూ జనాలు లేరు. తర్వాతే ఊపందుకుంది-" అన్నాడు కర్మ. కానీ పల్లెసీమకు అలాంటవకాశం రాలేదు. పెద్ద సెంటర్లలో కూడా ఆ చిత్రం పదిరోజులు మించి ఆడలేదు. జనాభిప్రాయం సేకరిస్తే - కొందరు యువత ఆధునికతకే పట్టం కడుతుందన్నారు. కొందరు చిత్రం పేరులో సీమ ఉంటే ఫాక్షనిజముంటుందని ఆశపడ్డ ప్రేక్షకులు నిరాశకు గురయ్యారన్నారు. ఈ రెండింటినీ ధర్మ పెద్దగా పట్టించుకోలేదు. కానీ కొందరు నాగలక్ష్మిది ఇనుపపాదం అన్నారని మాత్రం తెగ బాధపడ్డాడు. తన చిత్రం ఫెయిలయితే ఆమెకు చెడ్డపేరు రావడమేమిటీ అని మధనపడుతూ, "నాగలక్ష్మిది ఇనుపపాదం కాని రుజువు చేస్తూ ఇంకో చిత్రం తీస్తాను. తీసేముందు పల్లెసీమ విషయం మనమెక్కడ పొరబడ్డామో తెలుసుకోవాలి కదా-" అన్నాడు తన అసోసియేట్సుతో.

"నేను చెబుతాను. గురువుగారూ, మీ యుగం అయిపోయిందని నాకు తోస్తోంది. ఒకప్పుడు రెడ్డిగారు సినిమా తీసినా అందులో రాక్షసులు కూడా పులిహోర, గోంగూర పచ్చడి, పప్పు దప్పళాల గురించి మాట్లాడేవారు. ఇప్పుడు బ్రాహ్మణులు సినిమా తీసినా అందులో ఏడు మల్లెపూల ఎత్తు ఆడపిల్లలు కూడా చికెన్, మటన్, ప్రాన్స్ అంటూ తింటున్నారు. ఇప్పుడు పల్లెసీమ అంటే పల్లెటూరు కాదు. తెలుగుతనం అంటే తెలుగువారిది కాదు. మనం చూపించేదే సంప్రదాయం. అందుకే దీప్తి భట్నాగర్, శిల్పాశెట్టి, మనీషాకోయిరాలా వగైరాలు తెలుగు పడుచులుగా రాణిస్తారు. మన పెళ్ళిళ్ళలో ఉత్తరాది వారి తరహాలో ఇంటి ఇల్లాళ్ళు, తాతయ్యలు నృత్యాలు చేస్తూ పాటలు పాడతారు. మన పల్లెటూళ్ళలో హోలీ, రాఖీ పండుగలు జరుగడమే కాదు - ఆ సమయంలో గుర్రాలపై బందిపోట్లు కూడా వస్తారు. మీరు చిత్రాన్ని ఆధునికంగా తీసి పల్లెసీమ అని పేరు పెట్టినా ప్రేక్షకులకు అభ్యంతరముండదు-" అన్నాడు చర్మ.

కర్మ దీనికి తీవ్రంగా స్పందిస్తూ, "ఈ మాటలు నువ్వు ఇప్పుడు కాదు, సినిమా తీస్తున్నప్పుడు చెప్పాలి. అప్పుడు సెభాషంటూ ప్రతిదానికి గురువుగారిని ఎగదోసావు. ఇప్పుడు తప్పులెన్నుతున్నావు. గురువుగారిక్కావలసింది నాగలక్ష్మికి మంచి పేరు రావడం. ఆ అమ్మాయితో మనమో హిట్ పిక్చర్ తీస్తే ఆయన సంతోషిస్తారు. నీ దగ్గర సబ్జెక్టు లేదంటే నా దగ్గరో హిట్ సబ్జెక్టుంది-" అన్నాడు.

ధర్మ సంతోషంగా "కథ చెప్పు-" అన్నాడు.

భర్తకు త్రికరణ శుద్ధిగా అంకితమైపోయిన ఓ పల్లెటూరి పతివ్రత కథ అది. ఆమె భర్తకు క్యాన్సరు వస్తుంది. ఆపరేషన్‌కు పది లక్షలు కావాలి. అంత డబ్బామెవద్ద లేదు. భర్తకున్న ముగ్గురు స్నేహితుల్ని ఆమె ధన సాయం కోరుతుంది. ఆమె తమ ముందు వివస్త్రయై



నిలబడితే ఆమె చిత్రాన్ని గీసి దాన్నమ్మి పది లక్షలూ సంపాదించగలమని వారంటూరు. ఈ పరిస్థితుల్లోంచి ఆమె తెలివిగా బయటపడి భారతనారి ఔన్నత్యాన్ని రుజువుచేస్తుంది.

"ఇది పురాణాల్లోని అనసూయ కథకు సాంఘిక రూపకల్పన. ఈ కథ ఓ నిర్మాతకు తెగనచ్చేసింది. కాబట్టి ఫైనాన్సు కూడా రెడీ. కొత్త హీరోయిన్ అయితే బాగుంటుందని-నాగలక్ష్మి విషయంలో గురువుగారు ఊఁ అంటారని ఆశగా ఎదురుచూస్తున్నాను-" అన్నాడు కర్మ.

"కథలో నాగలక్ష్మి పల్లెపడుచు. చిత్రంలో అసభ్యతకు తావుండకూడదు-" అన్నాడు ధర్మ.

కర్మ సరేనని నాగలక్ష్మికి విషయం చెప్పాడు. "నాది ఒక్కటే షరతు. సరస్వతి పాట..." అంది నాగలక్ష్మి.

దీనికి కర్మ సిద్ధపడే ఉన్నాడు. అందువల్ల అతడామెతో, "చూడమ్మా! ఈ చిత్రంలో హీరోయిన్‌కు పాటలుండవు. పాటలన్నీ మగవాళ్ళే పాడతారు. ఈ చిత్రం విజయం సాధిస్తే నెక్స్ట్ పిక్చర్లో నీ స్నేహితురాలికి తప్పకుండా అవకాశముంటుంది-" అని ధర్మ తరహాలోనే ఆమెను బుజ్జగించి ఒప్పించాడు.

అనసూయ చిత్రం మొదలయింది. చర్మ ఆ చిత్రానికి సహ దర్శకుడిగా పనిచేసాడు. చిత్రం పూర్తి శృంగార భావాలతో నిండి ఉన్నప్పటికీ అదంతా హాస్యమై ప్రేక్షకులకు గిలిగింతలు పెట్టేలా రూపొందింది. చర్మకు మాత్రం అంతగా తృప్తి కలగలేదు. అతడు తన మిత్రుడితో, "అందరూ బాగా నటించారు-ఒక్క నాగలక్ష్మి తప్ప. ఆ అమ్మాయికి అందమే తప్ప నటనలేదు. పైగా సినిమా పొడుగునా నిండుగా పైట కప్పుకుని ఉంటుంది. ఏ శ్రీదేవి లాంటి నటినో బుక్‌చేసి ఉంటే సినిమా 'క్షణక్షణం'లా అదిరేది. నీ 'అనసూయ' ఫ్లాప్ కావడం గ్యారంటీ-" అన్నాడు.

"నువ్వు నా చిత్రాన్ని ధర్మయుగం దృష్టిలో చూస్తున్నావు. ఇక కర్మయుగం ప్రారంభమవుతోంది. అసలు రహస్యం తెలియక తప్పు అంచనా వేస్తున్నావు. ఈ చిత్రంలో వివస్త్రగా వున్న హీరోయిన్ రూపాన్ని కొన్ని పాత్రల ఊహల్లో చూపిస్తాం. సెన్సారు అభ్యంతర పెట్టకుండానూ, ప్రేక్షకులు వెర్రెత్తి పోయేలాగానూ కొన్ని క్లోజప్పులు, కొన్ని లాంగ్‌షాట్లు ఉంటాయి. ఒక మోడల్‌తో ఆ దృశ్యాలన్నీ ఎప్పుడో చిత్రీకరించేసాను. అవి చూసే నిర్మాత నా కథను ఓకే చేసాడు. ఆ మోడల్ రూపురేఖలు నాగలక్ష్మికి దగ్గర్లో ఉన్నాయి. అందుకే ఆమెను హీరోయిన్‌గా ఎన్నుకున్నాను. అనసూయ హిట్ కావడం ఖాయం-" అన్నాడు కర్మ.

చర్మ ఆశ్చర్యపోయాడు. అయితే ఈ మాటలు విని ఊరుకోలేదు. వెంటనే నాగలక్ష్మికి




చేరవేసాడు. ఆమె ఎంతో ఆశ్చర్యపడి, "కర్మ అలా ఎందుకు చేసాడో? నా దృశ్యాలు నాతోనే తీయొచ్చుగా - వేరే డూప్‌ని పెట్టుకోవడమెందుకు?" అంది.

చర్మ తెల్లబోయి, "మరి తెరమీద ఎలా కనిపించాలో నీకే షరతులు లేవా?" అన్నాడు.

"నా షరతు ఒకటే కదా- నా పాటలు సరస్వతి పాడాలి-" అంది నాగలక్ష్మి అమాయకంగా.

"కర్మ సినిమాని నువ్వు నీ తల్లిదండ్రులతో కలిసి చూడగలవా?" అన్నాడు చర్మ.

"ఎందుకు చూడలేను? సకుటుంబంగా చూడాల్సిన చిత్రం అని ఆయన ప్రచారం చేస్తున్నాడు. అలాంటి చిత్రాలన్నీ మేము బయట థియేటర్లలోనూ, ఇంట్లో టీవీ ఛానెల్సులోనూ చూస్తూనే ఉంటాం. మేము కొన్ని సకుటుంబ పత్రికలు కూడా చదువుతుంటాం. అందులోనూ అన్ని విషయాలూ అందరితోనూ చర్చించలేము. కానీ చదవడం తప్పని ఎవరూ అనరు...." అంది నాగలక్ష్మి.

"గురువు గారికి మీ యుగం అయిపోయిందని చెప్పాను కానీ నేనింకా ఏ యుగంలో ఉన్నట్లు?" అనుకున్నాడు చర్మ. అశ్లీలత, అసభ్యత మీడియా సమాచారంగా పత్రికల్లో, టీవీ ఛానెల్సులో, ఇంటర్నెట్లో సకల జనామోదం పొందిన యుగమిది. ఈ విషయం గ్రహించగానే చర్మ మానసమందేదో దృశ్యకావ్యం తళుక్కుమనగా, "సరస్వతే నీ పాటలు పాడాలని నీకంత పట్టింపెందుకు?" అన్నాడతడు మాట మారుస్తూ.

"నా అందం, ఆమె పాట అసామాన్యం. ఇద్దరిలో ఎవరు పైకి వచ్చినా రెండో వాళ్ళని పైకి తీసుకురావాలని చిన్నప్పట్నించీ అనుకునేవాళ్ళం. ఇప్పుడవకాశం వచ్చింది..." అందామె.

"అవకాశం నీదికాదు, నాది..." అనుకున్నాడు చర్మ. వెంటనే అతడు చురుగ్గా పనిచేసాడు. కర్మ చేస్తున్న మోసాన్ని ధర్మకు వినిపించాడు. ధర్మ కర్మను పిలిచి చీవాట్లు పెట్టాడు.

"ఎవ్విరితింగీజ్ ఫెయిర్ ఇన్ వార్, లవ్ అండ్ ఫిల్మ్సు" అన్నాడు కర్మ.

"ఆ దృశ్యాలను తొలగించకపోతే నేను నీ చిత్రాన్ని విడుదలకానివ్వను-" అన్నాడు ధర్మ.

"మంచిది. మీ అభ్యంతరమే నా చిత్రానికి పెద్ద పబ్లిసిటీ అవుతుంది-" అన్నాడు కర్మ.

అనసూయ చిత్ర వివాదం పత్రికలకూ, టీవీ ఛానెల్సుకూ ఎక్కింది. అభ్యంతరకర దృశ్యాలు చూచాయగా పాఠకులకూ, ప్రేక్షకులకూ తెలిసాయి. అందరూ ఆ చిత్రం రిలీజుకు ఎదురుచూసారు. కానీ ధర్మ పలుకుబడి దాన్ని డబ్బాలలోనే బంధించి ఉంచింది. నాగలక్ష్మిది



ఇనుపపాదమని చిత్రసీమలో అభిజ్ఞులంతా మరోసారి అనుకున్నారు.

రెండుసార్లూ తనే నాగలక్ష్మి భవిష్యత్తును పాడుచేసానని బాధపడ్డాడు ధర్మ. చర్మ ఆయన్ను ఓదార్చుతూ, "గురువుగారూ, కర్మ తను కొత్త యుగం ప్రారంభించాననుకుంటున్నాడు. కానీ ఇంకా పాత వాసనల నుంచి బయటపడలేక పోతున్నాడు. శృంగారం ఇతివృత్తంలో భాగంగా అయితే రాణిస్తుందేమో - అదే ఇతివృత్తమైతే ఏ చిత్రమూ రాణించదు. ప్రేమ-అదే ఎవర్‌గ్రీన్ సబ్జెక్టు. ఆ సబ్జెక్టులో నేటి యువతను మెప్పించేలా సినిమా తీస్తాను. నాగలక్ష్మిని నాకు అప్పగించండి - ఓ పెద్ద హిట్టు తీస్తాను. ఫైనాన్సియర్ అయితే రెడీగా ఉన్నాడు..." అన్నాడు.

"నీ సబ్జెక్టు చెప్పు"-అన్నాడు ధర్మ అనుమానంగా.

"మీ పల్లెసీమను రెండక్షరాలకు కుదించి నా చిత్రానికి గ్రామం అని పేరుపెట్టాను. హీరోయిన్ పల్లెపడుచు. తన ప్రియుడు మాధవ్ కిష్టమని ఆమె ముంబై మోడల్సు తరహా ఆధునిక దుస్తుల్నే ధరించి ఊరంతా తిరుగుతూంటుంది. అయినా గ్రామస్తులంతా ఆమెను ఆత్మీయురాలిగా అభిమానిస్తారే తప్ప దృష్టితో చూడరు. ఈలోగా మంచి మోడల్ని అన్వేషిస్తూ గ్రామానికి వచ్చిన శంకర్ హీరోయిన్ పట్ల ఆకర్షితుడవుతాడు. మాధవ్ తనకు అడ్డుగా ఉన్నాడని-నీ ప్రియురాలు నిన్ను ఆధునికుడిగా చూడాలనుకుంటోందని అబద్ధం చెప్పి నమ్మించి-శిక్షణ పేరుతో పట్నానికి పంపుతాడు. తను హీరోయిన్ కనుసన్నలలో మసలుతూ ఆమె అభిమానాన్ని పొందుతాడు. ఆమెను మెప్పించడం కోసం గ్రామంలో చాలా మంచి పనులు చేసి గ్రామస్తులకు ఆత్మీయుడవుతాడు. హీరోయిన్ మనసులో మాధవ్‌కు వ్యతిరేక




భావాలు నాటుతాడు. కొంత కాలానికి మాధవ్ పట్నంలో చాలా ఎత్తుకు ఎదుగుతాడు. అయినా తృప్తిలేక ప్రియురాలి కోసం గ్రామానికి తిరిగొస్తాడు. గ్రామంలో మసలడంతో శంకర్‌లో స్వార్థం నశించి త్యాగబుద్ధి పేరుకుంటుంది. అందువల్ల అతడు హీరోయిన్‌కి నిజం చెప్పి ఆ ప్రేమికులను ఒకటి చేసి తను కూడా గ్రామంలోనే స్థిరపడతాడు. ఇదీ కథ. చిత్రంలో హీరోయినే కాదు, ఆమెకు వాడే దుస్తులు కూడా మన పల్లెసీమవే! కానీ చిత్రం విడుదలయ్యే వరకూ హీరోయిన్ విషయం రహస్యంగా ఉంచాలనుకుంటున్నాను. కాబట్టి మీరు నాగలక్ష్మి నా చిత్రంలో చేస్తున్నట్లు ఎవరికీ చెప్పకూడదు-" అన్నాడు చర్మ.




"హీరోయిన్ పేరు లేకుండా పబ్లిసిటీ ఎలా ఇస్తావయ్యా?" అన్నాడు ధర్మ.

"పేరెందుకుండదు? నేను నాగలక్ష్మి పేరును నాగిని మల్‌హోత్రాగా మారుస్తున్నా-" అన్నాడు చర్మ.

"నాగిని దాకా బాగానే ఉంది. ఈ మల్‌హోత్రా ఏమిటి? అది ఇంటిపేరు కదా-" అన్నాడు ధర్మ.

"అలాగంటారేంటిసార్- ఇంటి పేరునే పేరుగా మార్చేయడం అచ్చ తెలుగు సంప్రదాయం.

మనవాళ్ళలో సుభాష్‌చంద్రబోస్‌లు, వల్లభాయిపటేల్సు, జయప్రకాష్ నారాయణ్‌లు, మోహన్‌దాస్ కరంచంద్‌గాంధీలు ఎందరో ఉన్నారు. అలాగే నాగిని మల్‌హోత్రా..."

"సరే-నీ యిష్టం. కానీ చిత్రంలో అసభ్యత ఉండకూడదు...." నసిగాడు ధర్మ.

"అదేంటిసార్-హీరోయిన్‌కి మన పల్లెసీమ దుస్తులే వాడతానంటున్నానుగా.." హామీ ఇచ్చాడు చర్మ. ప్రతి నిజంలోనూ ఓ కుంజరః దాగి ఉంటుందని స్ఫురించక ధర్మ వెంటనే నాగలక్ష్మిని అతడికి అప్పగించాడు. ఆ విధంగా నాగలక్ష్మి నాగినిమల్‌హోత్రా అయింది కానీ ఆమె సరస్వతి విషయం మరచిపోలేదు. అయితే చర్మ అందుకు సిద్ధపడే ఉన్నాడు. "చూడమ్మా! ఈ చిత్రంలో నీకు పాటలుంటాయి కానీ ఆ గొంతు తియ్యగా ఉండకూడదు. పురుషుల గొంతుకు దగ్గర్లో ఉండే ఓ లేడీ పాప్‌సింగర్ గొంతును నీకు నేపథ్యంగా నిర్ణయించాను. నా తర్వాతి చిత్రంలో నీ స్నేహితురాలికి తప్పకుండా అవకాశమిస్తాను-" అంటూ గురువుగారి పద్ధతిలోనే ఆమెను బుజ్జగించి ఒప్పించాడు.

షూటింగు ఇంకా మూడు వారాలకు మొదలవుతుందనగా చర్మ నాగినిని ఏకాంతానికి తీసుకుని వెళ్ళి ఆమెకు కొన్ని స్టిల్ ఫోటోలు చూపించి, "ఇవి అనసూయ చిత్రంలో నీకు బదులు డూప్‌తో తీసిన దృశ్యాలు. డూప్ బదులు నీతోనే అయితే ఎలా ఉంటాయో చూడాలి. రెడీయా?" అన్నాడు.

సరస్వతి తప్ప మరో షరతు ఎరుగని నాగిని అతడు కోరిన విధంగా అతడి ముందు నిలబడింది. అయితే చర్మ ఆమెను సమీపించి నఖశిఖపర్యంతం పరీక్షిస్తూ చుట్టూ తిరిగాడే తప్ప చేత్తో తాకనైనా తాకలేదు. తర్వాత నెమ్మదిగా, "నీవు అందగత్తెవే కానీ కాస్త కొవ్వును కరిగించాలి. రెండు వారాల పాటు నేను చెప్పిన వ్యాయామాలు చెయ్యి. అదే డాన్సు ప్రాక్టీసుగానూ పనికొస్తుంది-" అన్నాడు. రెండు వారాల్లో నాగిని వళ్ళు ఆమెకే ఆశ్చర్యం కలిగేటంతగా మారింది.

"ఇక డ్రెస్ డిజైనింగ్-" అన్నాడు చర్మ.

నాగినికి తొడగడం పల్లెసీమ దుస్తులే

తొడిగారు. లేడీ డ్రస్ డిజైనర్ వచ్చి ఆమె ధరించిన ప్రతి డ్రస్సు నించీ కొన్ని ముక్కలు కత్తిరించి తీసేసింది. ఆ విధంగా నాగిని ధరించిన ప్రతి డ్రస్సులోనూ పది శాతం గుడ్డే మిగిలింది. ఒకో డ్రస్సు ఒకో తరహాలో ఆమె అందాలను ప్రదర్శించే విధంగా తయారయింది. డ్రెస్ డిజైనింగ్ అయిపోయింది.

గ్రామం చిత్రం తయారవుతున్నంత కాలం-నాగిని సృష్టించనున్న సంచలనం గురించి విపరీతమైన ప్రచారం చేసినా స్టిల్సు మాత్రం ఒక్కటి కూడా బయటపడనివ్వలేదు చర్మ.

చిత్రంలో కథ తక్కువ. ఊహలెక్కువ. ఆ ఊహల్లో నాగిని రెచ్చిపోయి నాట్యాలు చేసింది. ఆ చిత్రం విడుదలై ఎవరి ఊహకూ అందనంత హిట్టయింది. నాగిని మల్‌హోత్రా సూపర్ స్టారయింది.

అప్పుడు నాగిని అజ్ఞాతం నుంచి బయటపడి ఒక్కసారి తనవారి వద్దకు వెళ్ళాలనుకుంది. చర్మ సరేనన్నాడు. కానీ బయల్దేరేముందు ఆమె గెటప్ మార్చాడు. ఆమెను విమానంలో కాక ట్రెయిన్లో ప్రయాణం చేయమన్నాడు.

కొత్తగా తనకు వచ్చిన సూపర్‌స్టార్ హోదాలో రైలు ప్రయాణం ఇబ్బంది అవుతుందని నాగిని అనుకుంది కానీ - మధ్య పాపిడి తీసి, నున్నగా తల దువ్వి జడ వేసుకుని సంప్రదాయబద్ధంగా చీరకట్టిన ఆమెను రైల్లో ఎవరూ గుర్తుపట్టలేదు. ఇల్లు చేరాక బంధువులు, స్నేహితులు, క్లాసుమేట్సు వగైరాలెవ్వరూ ఆమెను గ్రామం హీరోయిన్‌గా గుర్తించలేదు. ఫెయిలైన పల్లెసీమ గురించి, వివాదంలో ఉన్న అనసూయ గురించీ ప్రస్తావించి-ఇప్పుడేం చేస్తున్నావమ్మా అనడిగారు.

అయితే ఆమెను కర్మ గుర్తుపట్టాడు. నాగిని మల్‌హోత్రాయే నాగలక్ష్మి అని అర్థం చేసుకున్నాక అతడు ధర్మను కలుసుకుని, "గురువుగారూ, మనవాడు మిమ్మల్నీ నన్నూ కూడా చాలా పెద్ద మోసం చేసాడు. నా చిత్రాన్ని ఆపినట్లు అతడి చిత్రాన్ని మీరెందు కాపలేదు?" అన్నాడు.

"యుగం మారిందని నాకు స్పష్టమైందిప్పుడు-" అన్నాడు ధర్మ.

"మీకు యుగాలతో నిమిత్తమేముంది? నాగలక్ష్మికి న్యాయం జరగాలని నాకు అన్యాయం చేసారు. ఎంతోకాలం మీ దగ్గర పనిచేసిన మా ఇద్దరిలోనూ మీరు చర్మమీదే పక్షపాత బుద్ధితో వ్యవహరించారు..."

"ఆగవయ్యా!" అన్నాడు ధర్మ- "నాగినితో హిట్ పిక్చర్ తీస్తానన్నాడు చర్మ. తీసాడు. యువతకేం కావాలో తెలుసుకుని - ఆ చిత్రంలో ఆమెను అంచెలంచెలుగా దుస్తుల్లేకుండా ప్రదర్శించాడు. నాగిని ఇష్టపడింది. సెన్సారు అభ్యంతరం చెప్పలేదు. మధ్య మనకేమొచ్చింది?"

**కమాల్ ప్రశ్న - ఢమాల్ కార్టూన్**



టైము చెప్పలేని వాచీ

**తివాచీ**

"అనసూయ టైములో మీరిలాగను కోలేదు..."

"అదలావుంచు. చర్మ మనిద్దరికీ మేలు చేసాడు. నువ్విప్పుడు అనసూయ పిక్చర్ రిలీజ్ చేసుకోవచ్చు. ఇప్పుడు నాగిని గురించి క్షుణ్ణంగా తెలుసుకున్న ప్రేక్షకులు అనసూయలోని ఆమె వివస్త్రగా వున్న దృశ్యాలు నాగినివి కాదనీ డూప్‌వనీ సులభంగా గుర్తు పట్టేస్తారు. ఆ విధంగా నాగిని ప్రతిష్టకు భంగముండదు. అదీకాక నాగిని మల్‌హోత్రా అంటే జనంలో క్రేజ్ ఏర్పడింది. అది నీ చిత్ర విజయానికి సహకరిస్తుంది. అందుకే నాగిని మల్‌హోత్రా నటించిన తొలి చిత్రమని వల్లె నీ మను మళ్ళీ రిలీజ్ చేయాలనుకుంటున్నాను..." అన్నాడు ధర్మ.

ధర్మ చెప్పినట్టే అనసూయ, పల్లెసీమ పెద్ద హిట్టయి నాగినికి గుర్తింపు, పేరు పెంచాయి.

ఈలోగా చర్మ నాగిని మల్‌హోత్రాతో తన రెండో చిత్రాన్ని ప్రారంభించాడు. నాగిని మళ్ళీ సరస్వతి ప్రసక్తి తెచ్చింది. చర్మ నవ్వి, "కొత్త చిత్రంలో నృత్యానికి సరితా సత్యమూర్తి అనే కొత్త తారను ఎన్నుకున్నాను. ఆమెకు నీ చేత నేపథ్యగానం చేయించాలనుకుంటున్నాను. హీరోయిన్ డాన్స్‌స్టార్‌కు పాటపాడటం కొత్త ప్రయోగం. ఈ చిత్రంలోనీకు వేరే నేపథ్యగాయని ఉంటే అనవసరపు పోలికలు వచ్చి నీ కెరీర్ దెబ్బతింటుంది-" అంటూ సముదాయించాడు. కానీ ఈ సారి నాగినికి కోపం వచ్చింది. ఆమెను సముదాయించడం కోసం, "సరితను వేరే సింగర్ నేపథ్యానికి ఒప్పించు. నేను సరస్వతి విషయం ఆలోచిస్తాను-" అన్నాడు చర్మ.

కాసేపటికి అక్కడికి సరితా సత్యమూర్తి వచ్చింది. ఆమెను సరస్వతిగా గుర్తించడానికి నాగినికి ఎంతోసేపు పట్టలేదు. నిశ్చేష్టురాలైన నాగిని తేరుకునే దాకా ఆగి, "అందం ముఖంలోకాదు, వంటిలో ఉంటుందని నీ 'గ్రామం' చూసి తెలుసుకున్నాను. సంగీతాన్ని వదిలి నృత్యాన్నాశ్రయించాను. చర్మ నీకు మాటిచ్చేట్టగా-నేనడగ్గానే ఈ చిత్రంలో అవకాశమిచ్చాడు-" అందిసరిత.

చర్మ తనకిచ్చిన మాట నిలబెట్టుకున్నట్లు అర్థం చేసుకుంది నాగిని. ఆ తర్వాత ఆమె రెండో చిత్రం విడుదలై అందులో సరిత నృత్యగానం పెద్ద టాకింగ్ పాయింటయింది. అప్పట్నించీ చాలా చిత్రాల్లో సరిత నృత్యం, ఆ నృత్యానికి నాగిని గానం రివాజుగా మారాయి.

తామున్నది చర్మ యుగమని గ్రహించడం వల్ల నాగిని, సరితల జంటకు ఇప్పట్లో ఢోకాలేదు.

**(ఈ కథలో ఉదహరించబడిన సినిమా కథలు - రచయిత అనుమతి లేకుండా ఇతరులు ఉపయోగించరాదు - వసుంధర)** ■






తమ సంస్థ చిహ్నాన్ని చూపిస్తున్నపుడు వినిపించే నేపథ్య సంగీతంతో సహా ప్రేక్షకులందరూ గుర్తు పెట్టుకునే బ్యానర్ వాల్యూ కలిగిన చిత్రాలెన్నింటినో నిర్మించిన సంస్థ - ఏవీయమ్! 1958లో విడుదలయిన



చిత్రం ఈ సంస్థ నిర్మించినదే. ప్రతిష్టాత్మకంగా భారీ ఎత్తున నిర్మించబడ్డ ఈ పౌరాణిక చిత్రానికి నేటికీ తరగని ప్రజాదరణ ఉంది ముఖ్యంగా ప్రతి శివరాత్రికి ఈ చిత్రం ప్రదర్శింపబడని ఊరు తెలుగునాట లేదేమో!?

కొన్ని పాటలు వింటున్నప్పుడు రాసింది ఎవరని అడుగుతాం. కొంతమంది గీత రచయితల గురించి చెప్పేటప్పుడు వారు రాసిన పాటలను తప్పనిసరిగా పేర్కొంటుంటాం. రాసిన ప్రతి పాటా తన గురించి అడిగి మరీ తెలుసుకునేట్టుగా తన ముద్రను 'కలం'కరించుకున్న రచయిత సముద్రాల (సీనియర్) అయితే - ఆయన గురించి చెప్పేటప్పుడు తప్పక ఉదహరించవలసిన గీతాలలో 'భూకైలాస్' చిత్రంలోని పాటలు ఉండి తీర్తాయి. ఈ చిత్రానికి సంగీతాన్ని సుదర్శనం - గోవర్ధనం సమకూర్చారు. వారి సంగీత దర్శకత్వంలో ప్రాణం పోసుకొని, నేటికి జనచైతన్యాలతో సజీవంగా వున్న ఆ చిత్రంలోని పాటలలో ఈ సంచికలో ఓ ఆరు:

దేవ మహాదేవ మము బ్రోవుము శివా
భవ పాశ నాశనా భువనైక పోషణా ॥దేవ॥
పరమ ప్రేమాకార నిఖిల జీవాధార
సకల పాప విదూర దరహాస గంభీర ॥దేవ॥
దివ్య తేజోపూర్ణ తనయులను గన్నాను
దేవతా మాతలతో పరియశము గొన్నాను
కావుమా నాసుతుల చల్లగా గౌరీశ
ఈ వరము నాకొసగు ప్రేమతొ సర్వేశ ॥దేవ॥









ఈ పాటను ఎమ్.ఎల్. వసంతకుమారి పాడగా రావణుని తల్లి కైకసి పాత్రను పోషించిన హేమలత అభినయించారు. శంకరాభరణ రాగానికి చక్కని ఉదాహరణగా ఈ గీతాన్ని చెప్పుకోవచ్చు. ఓ పాటకు సాహిత్యాన్ని సమకూర్చేముందు పాత్ర పూర్వాపరాలు రచయితకు తెలియటం ఎంత ముఖ్యమో ఈ పాటను ఆసాంతంగా గమనిస్తే తెలుస్తుంది. రెండో చరణంలో సముద్రాల ఉపయోగించిన 'పరియశము' అనే పదాన్ని తర్వాత ఏ సినీగీతంలోనూ ఏ గీతరచయితా ఉపయోగించినట్టులేదు.

మున్నీట పవళించు నాగశయన
చిన్నారి దేవేరి సేవలు చేయ ॥మున్నీ॥
నీ నాభి కమలాన కొలువు జేసే
వాణీసు భుజపీఠి బరువు వేసి ॥మున్నీ॥
మీనాకృతి దాల్చినావు
వేదాల రక్షింప!
కూర్మా కృతి బూనినావు
వారిధి మథియింప!
కిటి రూపము దాల్చినావు
కనకాక్షు వధియింప!
నరసింహమై వెలసినావు
ప్రహ్లాదు రక్షింప!
నతపాల మమునేల జాగేల - పాల ॥మున్నీ॥
మోహినీ విలాస కలిత నవమోహణ
మోహదూర మౌనిరాజ మనోమోహన
మందహాస మధుర వదన రమానాయక
కోటిచంద్ర కాంతి సదన శ్రీలోల - పాల ॥మున్నీ॥



ఈ గీతాన్ని ఎమ్.ఎల్.వసంతకుమారి పాడగా అప్పటి ప్రసిద్ధ నృత్యకళాకారిణి శ్రీమతి కమలాలక్ష్మణ్ అభినయించారు. మండోదరి తండ్రి మాయాసురుడి పాత్ర ధరించిన ఎస్.వి.రంగారావు తదితరులు ఈ పాటలో సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. షణ్ముఖప్రియ రాగం ప్రధాన రాగంగా సాగుతూ చివరి చరణాల వద్ద నటభైరవి రాగాన్ని కలుపుకున్న ఈ పాటను - సంగీత రంగాన్ని నమ్ముకోదలచిన ప్రతివారూ- ఆడైనా, మగయినా సరే సాధన చేసి తీరాలి. ఇలాటి పాటలు పాఠాల్లాంటివి. పట్టు సాధించిన కొద్దీ సామర్థ్యం పెరుగుతుంది.

మండో : అందములు విందులయే అవని ఇదేనా
కమలాసనునీ కోటిశిల్ప కూటమిదేనా
ఎందును లేనీ తీయందనాలూ
చిందులు వేసేనుగా ॥అం॥
చెలి : తెలుసును నీలో వలపుదూరం
కలచివేసినట్టే విచారం
చెలి : నీమది దోచే మన్మథుడెవరే
చెలి : నిజమేనా యోచనా
చెలి : ప్రణయ సుధా యాచన
చెలి : తగవేనా
: ఈ నటనా
మండో : చాలునింక వంచన
అందరూ: అందములు విందులయే అవని ఇదేనే
మండో : తామర పూవులా తురిమేము రారే
చెలి : మనసున వేదన మితిమీరి పోనే
చెలి : అంతేనా
చెలి : ఔనౌనె
మండో : చాలు మీదు ఆగడాలు



ఈ పాటను పి.సుశీల, బృందం పాడగా మండోదరి పాత్రను ధరించిన జమున, ఆమె చెలికత్తెల పాత్రలను ధరించిన కొందరు ఉప పాత్రధారులు అభినయించారు. సంగీతపరంగా ఈ పాటలో ఓ తమాషావుంది. అదేమిటంటే- వి.శాంతారాం దర్శకత్వంలో 1954లో వచ్చిన 'సుబహ్ కా తారా' చిత్రం కోసం సంగీత దర్శకుడు సి.రామచంద్ర స్వరపరచగా తలత్ మహమ్మద్, లతా పాడిన 'గయా అంధేరా/ హువా ఉజాలా/ చమ్‌కే చమ్‌కే సుభాకా తారా' అనే గీతం ఆ రోజుల్లో పెద్ద హిట్.

ఆ పాట ట్యూన్‌ని సుసర్ల దక్షిణామూర్తి 'సంతానం' (1955) చిత్రంలో 'సంతోష మేలా సంగీత మేలా పొంగి పొరలేను మనసీవేళా' అనే పాటకు వాడుకొన్నారు. 1-15 జూన్ 2002 సంచికలోని 'ఆ పాతమధురం' శీర్షికలో 'సంతానం' చిత్రంలోని ఈ పాట గురించి రాస్తూ 'భూకైలాస్' చిత్రంలోని ఓ పాటకు కూడా ఈ ట్యూన్ వాడుకోవడం జరిగిందని, ఆ వివరణ 'భూకైలాస్' గురించి రాసే సమయంలో ప్రస్తావిస్తామని తెలపటం జరిగింది. పాఠకులకు గుర్తుండే వుంటుంది.

ఈ 'అందములు విందులయే అవని ఇదేనా' పాట మొదటి చరణంలో- 'నీ మది దోచే మన్మథుడెవరే' అనే లైనుకి రెండో చరణంలో 'తామర పూవులా తురిమేము రారే' అనే లైనుకి- ఆనాటి 'సుభాహ్ కా తారా' చిత్రంలోని 'గయా అంధేరా' పాటలోని చరణాల ట్యూన్‌ని వాడుకున్నారు. ఒక పౌరాణిక చిత్రంలోని పాటలకు వేరే భాషలోని పాట ట్యూన్‌ని తీసుకోవటంలో కొన్ని మినహాయింపులు ఉన్నా ఎంతో మందికి విడ్డూరంగా అనిపిస్తే మాత్రం ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు.

**దేవ దేవ ధవళాచల మందిర**
**గంగాధరా హర నమో నమో**
**దైవత లోక సుధాంబుధి హిమకర**
**లోక శుభంకర నమో నమో**
**పాలిత కింకర భవనా శంకర**
**శంకర పురహర నమో నమో**
**హాలహలధర, శూలాయుధకర**
**శైలసుతావర నమో నమో** ॥దేవ దేవ॥
**దురిత విమోచన, ఫాల విలోచన**
**పరమ దయాకర నమోనమో**
**కరి చర్మాంబర, చంద్రకళాధర**
**సాంబ దిగంబర నమో నమో** ॥దేవ దేవ॥
**నారాయణహరి నమో నమో** ॥నారాయణ॥
**నారద హృదయ విహారీ నమోనమో** ॥నారాయణ॥
**పంకజనయన, పన్నగశయనా** ॥పంకజ॥
**శంకర వినుతా నమోనమో** ॥శంకర॥ ॥నారాయణ॥



ఈ పాటను ఘంటసాల గానం చేయగా ఎన్.టి.ఆర్, ఎయన్నార్‌లపై చిత్రీకరించారు. ఇంటర్‌లూడ్స్‌లో (చెలికత్తెలతో) జమున కూడా కనిపిస్తారు. పాటలో శివపరంగా ఉండే భాగానికి ఝంఝూటి రాగాన్ని, విష్ణుపరంగా ఉండే భాగానికి కాపీ రాగాన్ని ఉపయోగించారు. ఈ పాట వింటున్నపుడు రామారావుకు, నాగేశ్వరరావుకు వేర్వేరుగా ఘంటసాల తన కంఠాన్ని మార్చి పాడేరని ఫీలయ్యేవాళ్లు నేటికీ ఉన్నారు. నిజానికి రాగంలోని మార్పు వల్ల సన్నివేశపరంగా పాత్రధారి మారటం వల్ల, తరాల తరబడి మనసుల్లో పడిన ముద్ర ప్రభావంగా ఏర్పడిన అభిప్రాయాల వల్ల 'పదుగురాడు మాట పాడియై ధరచెల్లు' అన్న రీతిలో ఆ నమ్మకం అలా చలామణి అయిందే కాని నిజానికి ఘంటసాల ఆ విధంగా పాడలేదు. తెలుగునాట ఈ పాటతో పరిచయం లేనివారు చాలా తక్కువగా ఉంటారు. అంతే కాదు ఈ పాటను మోగించని శివాలయం కూడా ఆంధ్ర ప్రాంతంలో లేదనే చెప్పాలి. ఇక సాహిత్యపరంగా చెప్పాలంటే నమోనమో అనే పదాల్ని మినహాయిస్తే - దేవదేవ, ధవళాచల మందిర, గంగాధర, హర... ఇలా అన్నీ ప్రస్తుతించే విశేషణాలే. పాట మొత్తం విశేషణాలనే కలిగి ఉండటం ఈ పాట విశేషం. అతి అరుదుగా జరిగే ప్రయోగం ఇది.

**సుందరాంగా అందుకోరా**
**సౌందర్య మాధుర్య మందారము**
**అందలేని పొందలేని**
**ఆనందలోకాలు చూపింతురా** ॥ఆనంద॥ ॥సుందరాంగా॥
**కేలుకేలుగొని మేనులేకముగ**
**ఏకాంతసీమలలో**
**మది సంతాప మారగ సంతోషమూరగ**
**చెంత చేరరార** ॥కేలు॥ ॥సుందరాంగా॥
**యోగము చేదు విరాగము చేదు**
**అనురాగమే మధురమ్**
**చాలు సాధన విడవోయి వేదన**
**సంతోషాబ్ధికి పోదము** ॥యోగము॥
**అటరంగారు బంగారు మీనాలమై**
**చవులూరించుచు తేనె జూరాడుదాం**
**తేలాడుదాం ఓలాడుదాం ముదమార**
**తమితీర ఈదాడుదాం** ॥సుందరాంగా॥



ఘంటసాల పాట మొత్తం 'ఓం నమఃశివాయ' అంటూ మంత్రోచ్ఛాటన చేస్తుండగా సుశీల అద్భుతంగా పాడిన ఈ పాట ప్రేక్షకులను మైమరపించే మధుర మనోహర గీతం. ఈ పాటను ఉత్తరాదికి చెందిన శృంగార నాట్యతార హెలెన్ అభినయించారు. సన్నివేశపరంగా తపోదీక్షలో ఎన్.టి.ఆర్. కూడా కనిపిస్తారు. పాట స్వరరచనలో మనోగతమైన అల్లికే కనిపిస్తుంది గాని రాగ స్వభావాలకు ప్రాధాన్యతనిచ్చినట్టు అనిపించదు. అయినా కాస్త తరచి చూస్తే భీంప్లాస్ స్కేల్‌ను ఆధారంగా చేసుకున్నట్టు అనిపిస్తుంది. శివధ్యానంలో ఉన్న రావణుని తపోనిష్టను భంగపరచలేని ఓ అప్సరస చివరికి తాను కూడా శివనామ స్మరణతో అంతర్థానమై పోవడం పాటలోని ప్రధానాంశం. అందుకుగాను ఓ పక్క 'ఓం నమః శివాయ' అంటూ చేసే మంత్రోచ్ఛాటనను పాట మొత్తం వినిపింపచేస్తూ - మరో వైపు పాటను కొనసాగించే ప్రక్రియ పాటకు ప్రత్యేక అందాల్ని సమకూర్చి పెట్టింది. సాహిత్య పరంగా లోతుల్లోకి వెళితే ఉద్రేకపరిచే శృంగార భావం విరుపులతో, మెరుపులతో మైమరపులతో పాటంతా విస్తరించుకొని ఉన్న పదిమందిలో నిర్భయంగా స్వేచ్ఛగా పాడుకునేలా ఉన్నదంటే దానికి కారణం భాషాసంస్కారం. కవికి కావలసింది, వారితో పనిచేయించుకునే వారికి తెలియాల్సింది అదే!

జయ జయ మహాదేవా
శంభో సదాశివా
ఆశ్రిత మందారా
శృతి శిఖర సంచారా
నీలకంధరా దేవా దీన బాంధవా రావా
నన్ను గావరా ॥నీల॥
సత్యసుందరా స్వామి
నిత్య నిర్మలా పాహి ॥నీల॥
అన్యదైవము కొలువా
నీదు పాదమూ విడువా ॥అన్య॥
దర్శనమ్ము నీరా మంగళాంగా
గంగాధరా ॥నీల॥
దేహియన వరములిడు
దానగుణసీమా
పాహియన్నను ముక్తి
నిను పరంధామా
నీమమున నీ దివ్య నామ సంస్మరణా
ఏమరక సేయుదును భవతాపహరణా
భవతాపహరణా
నీ దయామయ దృష్టి
దురితమ్ము లారా
వర సుధావృష్టి
నా వాంఛ లీడేరా
కరుణించు పరమేశా
దరహాస భాసా
హరహర మహాదేవ
కైలాసవాసా కైలాసవాసా
ఫాలలోచన నాదు మొరవిని
జాలిని పూనవయా.
నాగభూషణ నన్ను గావక
జాగును సేయకయా
కన్నుల విందుగ భక్తవత్సల
కావగ రావయ్యా ॥కన్నుల॥
ప్రేమమీర నీదు భక్తుని మాటను నిల్పవయా ॥ప్రేమ॥
శంకరా శివశంకరా అభయంకరా
విజయంకరా










'జయ జయ మహాదేవా'తో మొదలయి 'నీలకంధరా దేవా' అనే మకుటంతో సాగే పాట ఘంటసాల భక్తి గీతాలలో ఎన్నదగినది, మిన్నయైనది. గాయకుని సామర్థ్యానికి గీటురాయిలా నిలిచే ఈ పాట మొదట్నించి 'దర్శనమ్మునీరా మంగళాంగ గంగాధరా' వరకు తిలంగ్ రాగాన్ని - దేహియన వరములిడు దానగుణసీమా' దగ్గర్నుంచి 'హరహర మహాదేవ కైలాసవాసా' వరకు శుద్ధ సావేరి రాగాన్ని - 'ఫాలలోచన నాదు మొరవిని' దగ్గర్నుంచి పాట చివరి వరకు నాద నామక క్రియ రాగాన్ని ఉపయోగించారు. సాధారణంగా ఈ పాటను భావ, రసస్ఫోరకంగా పాడగలిగే ఏ గాయకుడైనా పోటీలలో ప్రత్యేకంగా ప్రశంసించబడతాడు. అంతటి పట్టు ఉందీ పాటలో. ఎన్.టి.ఆర్, అభినయించిన ఈ పాటలో నాగభూషణం, బి.సరోజాదేవి కూడా కనిపిస్తారు. సంగీత పరంగా మరో విశేషమేమిటంటే పాట మధ్యన వచ్చే 'దేహియన వరములిడు' చరణం దగ్గర్నుంచి పాట పూర్తి అయ్యేలోగా ఏ రకమైన స్పందనకూ లోనుగాని హృదయం ఎక్కడైనా ఉంటే దాన్ని పాషాణంగా భావించాలి. ఇక సాహిత్యపరంగా 'అన్య దైవమూ కొలువనీదు పాదము విడువా' అనే వాక్యాల ద్వారా రావణాసురుని వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించారని చెప్పాలి. కవికి గాని, రచయితకి గాని విషయ పరిజ్ఞానంతో పాటు గ్రంథ పఠనాబలం కూడా తోడైతే భావుకతకు, భాషా పటిమ చేకూరి ఆలోచింపజేసే వాక్యాల ఆవిర్భావం జరుగుతుంది. పాట మొదట్లో వచ్చే 'శృతి శిఖరసంచారా' అనే వాక్యం ఆ కోవకు చెందినదే. శృతులనబడే వేదాల శిఖరమందు ఉండేవి ఉపనిషత్తులు. జీవాత్మను పరమాత్మ సన్నిధికి సమీపంగా (ఉప), నియబద్ధంగా (ని), ఉంచునది (షత్), - కనుక ఆ ఉపనిషత్తులలో సంచరించే వాడా అని అర్థంతో వాడిన 'శృతిశిఖర సంచారా' వ్యాక్యాన్ని మన ముందుంచిన సముద్రాల వారి పాండిత్య వైభవానికి నమోవాకాలర్పించకుండా ఉండలేం.

(వచ్చే సంచికలో కూడా 'భూకైలాస్'లోని పాటల గురించే ఉంటుంది)

ఏప్రిల్ 20 న షకీల్ బదాయూనీ వర్ధంతి సందర్భంగా...

# పరిమళం వాడని గీతరచయిత- 'షకీల్ బదాయూనీ'!

హిందీ సినిమా పాటకు తనదైన పదవిన్యాసంతో సాహిత్య సొబగు లద్దిన గీతకారుడు "షకీల్ బదాయూనీ" రెండు పుష్కరాల కాలంపాటు ఉజ్వలంగా ప్రకాశించి శ్రోతల హృదయాలలో నిలిచిపోయారాయన.

ఉత్తరప్రదేశ్‌లోని బదాయూలో 1916 ఆగస్టు 3న మౌల్వీ ఇంట పుట్టిన షకీల్ అలీఘర్ విశ్వవిద్యాలయంలో విద్యనభ్యసించి ఢిల్లీలో సప్లై కార్యాలయంలో కొలువుచేసారు. కవిత్వం రాయడం ఆయన మనసుకు నచ్చిన అంశం కావడంతో పలు ముషాయిరాల్లో కవితాగానం చేశారు. సినిమాలకి పాటలు రాయాలని 1944లో ముంబై వచ్చి సంగీత దర్శకుడు నౌషాద్, దర్శకుడు కర్దార్‌లను కలిశారు. నౌషాద్ తన దర్ద్ (1947)లో పాటలు రాయించు కొనడంతో షకీల్ సినీ కవి జీవితం ప్రారంభమైంది. దర్ద్‌లో రాసిన "అఫసానా లిఖ్ రహీహూ దిలే బేకరార్‌కా" తొలిగీతమే హిట్. తర్వాతిరోజుల్లో ఆయన ఎంతోమందికి పాటలు రాసినా ఒక్క నౌషాద్‌కే 300కు పైగా పాటలు రాయటం ఓ విశేషం.

నౌషాద్ సంగీత దర్శకత్వంలో వచ్చిన బైజూబావ్‌రా, ఆద్‌మీ, పాల్‌కి, నాటక్, చాందినీరాత్, రామ్ ఔర్ శ్యాం, ఉరన్‌కఠోలా, గంగాజమున, అమర్, సోహ్నీ మహీవాల్, మొఘలెఆజం, జాదూ, దిల్లగీ, దాస్తాన్, మేరెమెహబూబ్, సంఘర్ష్, లీడర్, మేలా, ఆన్, షబాబ్, దీదార్, దీవానా, మదరిండియా, సన్ ఆఫ్ ఇండియా, దులారీ, అనోఖీ అదా, బాబుల్, కోహినూర్ తదితర చిత్రాల్లో షకీల్ పాటలు విజయానికి కారణాలైనవి.



షకీల్ బదయూనీ, రవి, రఫీ

బైజూబావ్‌రా (1952)లో ఆయనరాసిన పాటలన్నీ నేటికీ హిట్‌సాంగ్స్ గానే ఆదరణ పొందుతున్నవి. 'తు గంగాకీ మౌజ్‌మై' 'ఓ దునియాకే రఖ్‌వాలే' 'మన్‌తడ్‌పత్' 'ఝూల్‌మె పవన్ కె', 'బచ్‌పన్‌కి మెహబ్బత్‌కో', 'మొహె భూల్‌గయే సావరియా' తదితర గీతాలు సాహిత్య గుబాళింపుతో శ్రోతలను పరవశింప జేసాయి.

నౌషాద్ తరువాత షకీల్‌సాబ్ 'రవి' సంగీతంలో ఎక్కువ పాటలు రాసారు. ముల్జిమ్, దూర్‌కీ ఆవాజ్, నర్తకి, జోగి, గృహస్తి (1963), వాంటెడ్, గెహరాదాగ్, చౌద్‌వీకాచాంద్, కౌన్ అప్‌నా కౌన్ పరాయా, ఘూంఘట్, ఫూల్ ఔర్ పత్తర్, దో బదన్, ఘరానా, ఉమ్మీద్ చిత్రాలు రవితో పనిచేసినవే. ఇంకా ఖేంచంద్‌ప్రకాష్, సి.రామచంద్ర, గులాం మహమ్మద్, ఎస్.డి.బర్మన్ వంటి సంగీత కారులకూ పాటలు రాసారు షకీల్. ఇలా 19 మంది సంగీత దర్శకులకు సుమారు 750 పాటలు రాసిన షకీల్ 'చౌదవీకాచాంద్'(1960), 'ఘరానా' (1961), 'బీస్‌సాల్‌బాద్' (1962) చిత్రాల్లో రాసిన పాటలకు వరుసగా ఉత్తమ గీతరచయితగా ఫిలింఫేర్ అవార్డులు అందుకున్నారు.

సినీ సీమలోని ఏ బలహీనతలకు, దుర్వ్యసనాలకూ లోబడని షకీల్‌కి తమలపాకు తినే అలవాటుండేది. అదే అతని ఆరోగ్యాన్ని చెడగొట్టింది. దాంతోనే ఆయన 1970 ఏప్రిల్ 20న మృతిచెందారు. షకీల్ మృతి చెంది మూడు దశాబ్దాలు దాటినా రఫీ, లత, ఆశాల స్వరాల్లో ఇప్పటికీ ఆయన పాటలు సజీవంగానే ఉన్నాయి.

**-హెచ్. రమేష్‌బాబు**

---

# హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు

**1955**

ఎ.ఆర్. కర్దార్ తన ఆస్థాన సంగీత దర్శకుడు నౌషాద్‌ని మార్చి - 'ఆర్ పార్' ని సంగీతపరంగా



'బాప్ రే బాప్' చిత్రంలో కిశోర్‌కుమార్

హిట్ చేసిన ఓ.పి.నయ్యర్ ని 'బాప్ రే బాప్' సంగీతానికై ఆహ్వానించాడు. శాస్త్రీయ సంగీతాన్ని అభ్యసించని నయ్యర్ 'పియా పియా పియా...' అనే సెమీ క్లాసికల్ హిట్ గీతాన్నందించారు. గురుదత్ హాస్య చిత్రం 'మిస్టర్ & మిసెస్ 55' కు కూడా ఓ.పి.నయ్యరే సంగీతాన్నిచ్చారు.(జానే కహాఁమేరా జిగర్ గయా జీ..., ఉధర్ తుమ్ హసీన్ హో..., చల్ దియే బందా నవాజ్.....ఈ చిత్రంలో హిట్ అయిన పాటలు)

శంకర్ -జైకిషన్‌ల జైత్రయాత్ర కొనసాగుతూనే ఉంది. 'సీమా', ఆర్.కె.సంస్థ వారి 'శ్రీ 420' ఈ సంవత్సరం వీరు ఇచ్చిన మ్యూజికల్ హిట్స్. ('సీమా'లో తూ ప్యార్ కా సాగర్ హై..., సునో ఛోటీ సి గుడియా కి..., మన్‌మోహనా బడే ఝూఠే...; 'శ్రీ 420' లో రామయ్యా వస్తావయ్యా..., మేరా జూతా హై జాపాని..., ముడ్ ముడ్ కె న దేఖ్...,ఈచక్ దానా..., దిల్ కా హాల్ సునే దిల్‌వాలా...., ప్యార్ హువా ఇక్ రార్ హువా...పాటలు బంపర్ హిట్)

దాదాపు ఓ దశాబ్దకాలంగా అవకాశాల కోసం అవస్థపడుతున్న చిత్రగుప్తను దక్షిణాదిలో పేరెన్నికగన్న ఏ.వి.యం సంస్థకు ఎస్.డి.బర్మన్ రికమెండ్ చేసారు. సరైన హిట్‌లేక అవస్థపడుతున్న చిత్రగుప్తకు భక్తిరస ప్రాధాన్యంగా ఆ సంస్థ సాహూ మోడక్, పద్మిని జంటతో నిర్మించిన 'శివభక్త' చిత్రం మంచి పేరు తీసుకురావటమే కాక ఏ.వి.యం. సంస్థతో చక్కటి అనుబంధం ఏర్పడటానికి దోహద పడింది.



'ఝనక్ ఝనక్ పాయల్ బాజే' లో ఓ సన్నివేశం

వి.శాంతారాం స్వంత చిత్రం 'ఝనక్ ఝనక్ పాయల్ బాజే' కు వసంత్ దేశాయ్ సంగీతంలో ఖాన్ సాహెబ్ అమీర్ ఖాన్ టైటిల్ సాంగ్ పాడారు. లతా గానం చేసిన 'జో తుమ్ తోడో పియా...', లతా-హేమంత్‌ల 'నైన్ సే నైన్ మిలావో...' గీతాలు ఈ చిత్రంలో మంచి హిట్స్.

-(వచ్చే సంచికలో మరికొంత)

# 'బొమ్మల' కథ

కథ, బొమ్మలు: Ramakrishna

**జరిగిన కథ**

ఆర్టిస్ట్ అభిమన్యుని శశిరేఖ ప్రేమించింది. కానీ శశిరేఖ వాళ్ల డాడీ కొండలరావు తను పెట్టే 'పరీక్షలో నెగ్గితేనే పెళ్లి' అని చెప్పి అభిమన్యు చేతికి బొమ్మలున్న ఓ కాగితాన్ని ఇస్తాడు. శశిరేఖ, అభిమన్యు, అతని స్నేహితుడు తోట కమలాకరం ఆ బొమ్మల్ని డీకోడ్ చేసే ప్రయత్నంలో ఉంటారు.

-(ఇక చూడండి)




'ఊర్వశిల్ టు చెవి' అంటే ఇది! ఇక ఆ చెవిలో రహస్యం తెలుసుకోవాలి! చెక్క్,చూడు!
ఇంగ్లీష్ 'వి' అక్షరం, ఏదో గ్రహం! రెండూ కలిపితే విగ్రహం - కానా?! తర్వాత....
వెరీగుడ్!
..మనిషిని అటు తిప్పి చూపారు - వెనుక వైపు అనుకుందాం. సో - విగ్రహం వెనక వైపు! నౌ గో ఎహెడ్!
అర్థం కాలేదా?! అది - అడుగు, ఇది - భాగం, అడుగు భాగం!
ఆ అడుగుభాగంలో తాళం కన్నం! దాన్లో చెవితో తిప్పితే లక్ష్మీప్రసన్నం!!
దొరికింది దోస్త్, ఈ మూలలో తాళం కన్నం ఉంది!
ఎక్సలెంట్! అందులో ఈ చెవి పెట్టి తిప్పు!
ఓకే!
5



అరె! ఇక్కడేదో అర ఉంది!
దీన్లో అపురూపమైన డైమండ్స్ ఏవో ఉన్నట్టున్నాయి!
మన శ్రమ ఫలించింది. రియల్లీ గ్రేట్ అఫైర్!
కాబోయే మామగారూ! మీ చిదంబర రహస్యాన్ని ఛేదించాం! ఇదిగో నిధి!
ఓ! ఇన్‌క్రెడిబుల్!!
అన్నమాట ప్రకారం అమ్మాయిని, అర భాగం ఆస్తిని అప్పజెప్తాను. ఇక పోతే....
అయ్యో! ఇప్పటికే ఆరు పేజీలైంది. జరిగిన కథే మళ్ళీ చెప్తూ పోతే ఎడిటర్ గారు మనిద్దర్నీ ఎత్తి కుదేస్తారు!
అలా ఆవేశపడి అంతెత్తూ ఎగిరితే వెళ్ళి అవతల పేజీలో పడతారు సార్! మీరెలాగయినా ఈ ఫ్రేములోనే ఉండిపోండి. - కార్టూనిస్టు వాళ్ళ జంటని కలిపేసి ఓ రొమాంటిక్ సీన్ గీసుకుంటాట్ట!
Ramakrishna
శుభం

ఏప్రిల్ 23 శ్రీమతి యస్.జానకి పుట్టినరోజు సందర్భంగా...

# "నల్లగా వుంటాను కదా... 'గానకోకిల' తగిన పేరే అని అంటారామె"



తెలుగు సినిమాల్లో ప్రసిద్ధులైన జానకులు ఇద్దరున్నారు. ఇద్దరూ ఎస్.జానకులే. ఒకరు శంకరమంచి జానకి, ఇంకొకరు శిష్టా జానకి. ఒకరు నటి; ఒకరు గాయని. షావుకారు జానకి అని చూసుకున్నా ముందు ఎస్ నే వస్తుంది. శిష్టా జానకికి వివాహం అయిన తర్వాత వైద్యుల జానకి అయినా, ఎస్.జానకే.

"నేను ముందునుంచి ఎస్ జానకిగానే పాప్యులరు. అందుకని కుటుంబపరంగా వి.జానకినే అయినా, వృత్తిపరంగా ఎస్.జానకినే. అంతేగాని ''స్త్రీకి స్వతంత్రం వుండాలి. పెళ్ళయిన తర్వాత ఉన్న ఇంటిపేరుని ఎందుకు మార్చుకోవాలి?'' అని వితండవాదం చేసే మనిషిని కాను'' అన్నారొకసారి జానకి- సంప్రదాయ బద్ధమైన మనిషి. భర్తపోయిన తర్వాత కాసంత బొట్టూ కరిగిపోతే, ఎంతమంది ఆత్మీయులు చెప్పినా బొట్టు కంటిన్యూ చెయ్యలేదు. గాజులు తొడుక్కోడం, నగలు వేసుకోడం తొలినుంచి అలవాటులేదు- ఆమెకు. 'గుణాలు ఆభరణాలు కావాలిగాని, ఆభరణాలు గుణాలకి ప్రతిరూపం కావు' అన్న సిద్ధాంతాల్ని నమ్ముకున్న మనిషి. అలాగే ఎన్నో సిద్ధాంతాలకి కట్టుబడి వున్న మనిషి. దయాగుణం, దాతృత్వం గల మనిషి. దైవభక్తి, ప్రేమ, వినయం, విధేయత గలమనిషి. అందుకే చాలామందికి ఆమె నిజమైన గౌరవనీయురాలు.

చిన్నప్పట్నుంచీ కృష్ణుడంటే ఇష్టం. అదీ చిన్నప్పటి కృష్ణుడు. అల్లరి కృష్ణుడు, చిలిపి కృష్ణుడు, చలాకి కృష్ణుడు, ముద్దు కృష్ణుడు- ఈ కృష్ణులందరూ చిరు విగ్రహాల రూపంలో ఆమె దగ్గరున్నారు. ఆమె చక్కగా బొమ్మలు గీస్తారు; పెయింటింగ్స్ వేస్తారు. అవన్నీ కృష్ణులే. ఆమె రాస్తారు. కృష్ణుడి మీద పాటలు రాశారు. చిన్నపాపకి ఒక తమిళ చిత్రంలో పాడిన 'క్రిష్ణా, నీ ఎంగే' పాట ఆమె రాసుకున్నదే, ట్యూనూ ఆమె చేసుకున్నదే. అదే యథాతథంగా ఇళయరాజా వాడారు. అదేపాట తెలుగులో "క్రిష్ణా నువ్వెక్కడ?" అని ఆమె పాడే పాట. ఆ పాట లేకుండా ఆమె కచేరీ వుండదు. అంత చిన్న పిల్లలా పాడగలగడం ఆమె టాలెంటు. పదిమందిలో కూచుని సరదాగా కాలక్షేపం చేస్తున్నప్పుడు- ఎక్కడినుంచో చిన్నపిల్ల మాటలు వినిపిస్తాయి. అందరూ "ఎవరీపాప? ఎట్నుంచి వచ్చింది?" అని విస్మయంగా అటూ ఇటూ వెతుక్కుంటూ వుంటారు. సైలెంట్‌గా వుండి, ఫక్కున నవ్వే జానకి- గొంతులో చేసే జోకు. గొంతులు అనుకరించి మాట్లాడ్డం ఆమెకు ఇంకో టాలెంటు. అంత సన్నని గొంతూ ఒక్కసారి 'బండ'గా మారిపోతుంది. అంతలో వృద్ధురాలైపోతుంది. ఒక తమిళ చిత్రంలోనూ, ఒక తెలుగు చిత్రంలోనూ (శ్రీవారికి శోభనం) వృద్ధ కంఠంతో ఆమె పాడిన పాట చిన్న నిదర్శనం.

జానకిని 'గాన కోకిల' అన్నారు. "నేను అంగీకరిస్తాను. నల్లగా వుంటాను కదా, తగిన పేరే" అని చమత్కారం చేశారు జానకి.

భర్త పేరు రామ్‌ప్రసాద్. 'రామూ' అని పిలిచేవారు ఆమె. "నేను జానకిని, ఆయన రాముడు. పేర్ల రీత్యా కూడా మేము సరిపోయాం. అదే భార్యపేరు సీత, భర్తపేరు లక్ష్మణరావు అన్నట్టుంటే ఇబ్బందిగానే వుంటుంది'' అన్నారొకసారి పిచ్చాపాటీలో. ఇష్టమైన కృష్ణుడి పేరే, అబ్బాయికీ పెట్టుకున్నారా దంపతులు. మనవరాళ్ళ పేర్లు సంగీతానికి సంబంధించిన రాగాల పేర్లు.

సినిమాల్లో ఆమె పాడని పాట లేదు. అన్ని రకాలవీ పాడారు. తిరగని దేశంలేదు. అన్ని దేశాల్లోనూ ఆమె కంఠం మారుమోగింది. అలానే పాడని భాషలేదు. బెంగాలి, సింహళ భాషలతో సహా. ఆ గొంతు పైస్థాయికీ, ఇంకా పైస్థాయికి వెళ్ళి గిర గిర తిరుగుతుంది. పియానోలో కలుస్తుంది, సన్నాయిలోనూ కలుస్తుంది. ఆమె ఒకే ఒక్క చిత్రానికి (మౌనపోరాటం) సంగీతం సమకూర్చారు. "మళ్ళీ ఏ చిత్రానికి సంగీతం చెయ్యలేదెందుకని?" అని ఎవరో అడిగితే, "ఎవరూ అడగలేదు" అని కచ్చితమైన, నిజమైన జవాబు చెప్పారామె. ఉన్నమాట చెప్పడం తెలుసుగాని విన్నమాట చెప్పరు. కన్న విషయాలే తప్ప, అన్య విషయ ప్రసక్తులుండవు.

సినిమాలకు రాకముందు, వచ్చిన తర్వాతా కూడా కచేరీల్లో పాడడం ఉత్సాహం. సినిమాలకు వచ్చిన తర్వాత సంప్రదాయ సంగీతం నేర్చుకుని, శాస్త్రీయ సంగీత కచేరీలు చేసిన ఘనత కూడా జానకికి వుంది. చిన్నతనంలో పాడుకున్న గాలిపాట, అలా అలా పీచి పీచి ఇంత పాటయింది. సినిమాలకి రాకముందు, రాజమండ్రిలో మాధవపెద్ది సత్యంగారి వివాహ సందర్భంగా పాడిన ఆ చిన్న జానకికి అప్పుడే అశీర్వచనం లభించింది. అప్పుడే ఎన్నెన్నో చోట్ల పాడిన హింది, తెలుగు పాటలకి ప్రేక్షకుల ఆదరణ, ఆశీస్సూ లభించింది. ప్రతి కచేరిలోనూ, ఘంటసాలగారి 'పుష్పవిలాపం' పద్యాలు పాడడం అప్పట్నుంచీ అలవాటు.

అలాంటిది, "నా తొలి సినిమా పాట వారి కంఠంతో కలిసి శ్రుతి చేసుకోడం ఎంత అదృష్టం!" అంటారామె.

ఇన్నేళ్ళుగా పాడుతున్నా, శారీరకంగా ఆమెకు అలసటేమోగాని, ఆ గొంతుకు మాత్రం అలుపులేదు. 'ముందడుగు' సినిమాలో 'కోడెకారు వయసు వాడా' పాట జానకి, మాధవపెద్ది సత్యం పాడారు- ఏళ్ళ క్రితం! రెండేళ్ళ క్రితం విశాఖపట్నంలోని ఒక సంగీత సభలో ఈ ఇద్దరూ ఆ పాట పాడుతూవుంటే, పాట మధ్యలో ఆపి- జానకి అడిగిన చమత్కారం.

"ఈ వయసులో మేమిద్దరం 'కోడెకారు వయసు' పాట పాడుతూవుంటే మీకెలావుంది? ఎబ్బెట్టుగాలేదూ?"

ఉండదు. నలభై ఏళ్ళ తర్వాత ఆ పాట వారు పాడినా ఆ కంఠాల్లో 'కోడెకారు వయసు' కొట్టొచ్చినట్టు వినిపించింది.

- రావి కొండలరావు



భర్త రామ్‌ప్రసాద్, తనయుడు మురళీకృష్ణతో...












పి.లీల, చెంబై వైద్యనాథ్ భాగవతార్‌లతో...



మామగారు ఫన్‌డాక్టర్ చంద్రశేఖర్,
సంగీత దర్శకుడు టి.చలపతిరావులతో...

ప్రముఖ నేపథ్య గాయని ఎస్.జానకి పుట్టినరోజు (ఏప్రిల్ 23) సందర్భంగా సంగీతాభిమానులందరి తరపున అభినందనలతో...

హాసం

